శ్రీ

# దాశరథి శతకము

కంచెర్ల గోపన్న

(రామదాసు)

ప్రతిపదార్థ భావ రచయిత్రులు

V·L· SUVARCHALA, M·A , M Phil

V. SEETHAMAHALAKSHMI, M.A., B·Ed.

(శ్రీ రామాష్టోత్తర శత నామావళి,
శ్రీ సీతాష్టోత్తర శతనామావళి,
శ్రీ ఆంజనేయాష్టోత్తర శతనామావళిసహా)

ఓం నమః పరమాత్మనే



This Book is Published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams under their scheme "Aid to Publish Religious Books"

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి మా కృతజ్ఞతాభివందనములు.

ప్రతిపదార్థ భావరచయితృతులు



విజయవాడ నగర సాహితీప్రియులకు సుపరిచితులైన శ్రీ బబ్బేపల్లి రాధాకృష్ణమూర్తి కృష్ణాజిల్లా దివి తాలూకాకు చెందిన మాజేరు గ్రామంలో 1933 జనవరి 13వ తేదీన జన్మించారు. వీరు శ్రీ బబ్బేపల్లి చలమయ్య, అనంతలక్ష్మమ్మ పుణ్యదంపతుల ఏకైక సంతానం. మాజేరుకు సమీపంలో గల జమీందారీ గ్రామమైన చల్లపల్లిలో గల నాటి ఎస్. ఆర్. హైస్కూల్‌లో సెకండరీ విద్యను ముగించుకున్న శ్రీ. రాధాకృష్ణమూర్తి ఉన్నత విద్యకై బొంబాయి నగరం చేరుకున్నారు అక్కడి సిడెన్‌హామ్ కాలేజిలో ప్రవేశించి, కామర్స్ విభాగంలో డిప్లొమాను అందుకున్నారు.

డిప్లొమా అనంతరం విజయవాడలో ఇన్‌కంటాక్సు మరియు సేల్సు టాక్సు, ప్రాక్టీషనర్‌గా స్థిరపడిన శ్రీ బబ్బేపల్లి, ఆరంగంలో విశేషమైన కీర్తి ప్రతిష్ఠల నార్జించారు. తన జీవితాన్ని టాక్సు రంగానికే పరిమితం చేసుకొనక, శ్రీ బబ్బేపల్లి కళా, సాహిత్యరంగాల అభివృద్ధికి కూడ తన వంతు ఆర్థిక మరియు హార్దిక సహకారం అందించటం

విశేషం. ఈ కృషిలో భాగంగా పలు విద్యాసంస్థల, సాహిత్య సంస్థలలో వివిధ హోదాలతో అనుబంధం ఏర్పరచుకొని వాని బహుముఖ వికాసానికి తమ విశ్రాంతి సమయాన్ని వినియోగిస్తున్న వదాన్యులు శ్రీ బబ్బేపల్లి.

అంతేకాక "భువన విజయము" అను సాహిత్య సంస్థను వీరు స్వయంగా స్థాపించి, దాని గౌరవాధ్యక్షులుగా కవి పండితులనేకులను వివిధ సందర్భాలలో సత్కరించుటయేకాక, సాహితీప్రియులకు అందుబాటులో లేక, కనుమరుగవుతున్న విఖ్యాత ప్రాచీన గ్రంథాలను పునర్ముద్రించ టానికి వీరు నడుంకట్టటం బహుధా ప్రశంసనీయం. ఈ కార్యక్రమాలకు తోడు స్థానిక స్మార్త సభకు కూడ వీరు గౌరవాధ్యక్షులుగా వ్యవహరిస్తూ, స్మార్త విద్యార్థులకు ప్రతి సంవత్సరం పరీక్షలు నిర్వహించుట ద్వారా ఆర్ష విద్యలకు విశేషమైన ప్రోత్సాహాన్ని అందిస్తున్నారు.

శ్రీమతి లోలాక్షి శ్రీ బబ్బేపల్లి వారి ధర్మపత్ని. ఈ దంపతులకు ఐదుగురు సంతానము. ఇరువురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. టాక్సు రంగంలో 40 సంవత్సరాల సుదీర్ఘమైన, కీర్తిమంతమైన అనుభవంగల తమ తండ్రి అడుగుజాడలలోనే వారి కుమారులు శ్రీ చలపతి రావు, శ్రీ సురేష్‌కుమార్‌లు కూడ నడవటం సహజమే.

వివిధ రంగాల పురోభివృద్ధికి తమవంతు సహకారాన్ని మరింతగా అందిస్తూ, శ్రీ బబ్బేపల్లి కుటుంబం మరింత పేరు ప్రఖ్యాతులను ఆర్జించ గలదని ఆశిద్దాం

# ముందుమాట

మా పితృపాదుల కోరిక మేరకు మేము దాశరథి శతక పద్యములకు ప్రతి పదార్థ భావ రచనకు మూడు సంవత్సరములకు ముందే ప్రారంభించినను, మేమిరువురము ఉపాధ్యాయ వృత్తిలో నుండడంచేత విధి నిర్వహణలో తీరిక సమయము దొరకక, అనతికాలములో పూర్తి చేయలేకపోతిమి. ఇప్పటికైనను ఈ రచన ఈ రూపాన్ని దాల్చటం సంతోషాన్ని కలుగజేయడమేకాక మా తండ్రిగారి కోరికను మన్నించిన వారమైతిమి. ఈ శతకంలో ప్రతి పద్యం చివరా "దాశరథీ! కరుణా పయోనిధీ!" అని అంత్యప్రాస నియమముతో, శ్రీరాముని గూర్చిన రెండు సంబోధనలుండడంచేత మేము కూడ ప్రతి పద్య భావానికి ముందు అంత్య ప్రాసనియమముతో శ్రీరామకృష్ణుల కభేదంచేసి (గోపన్నగారు చేసినట్లు) రెండు సంబోధనలను కూర్చితిమి ఈ రచనలో తప్పులున్న విజ్ఞులు దయతో మన్నింప ప్రార్థించుచున్నాము.

ఇక ఈ రచనకు శ్రమయనుకొనక చక్కని పీఠిక వ్రాసియిచ్చిన శ్రీ వింజమూరి శేషఫణిశర్మ గారికిని, శ్రీరామనామస్మరణ మాహాత్మ్యాన్ని సమకూర్చిన మా తండ్రిగారికిని, రచనను సమగ్రంగా అవలోకించి మిక్కిలి దయతో తమ అభిప్రాయాల్ని వ్రాసియిచ్చిన శ్రీ డా॥ శ్రీనివాసాచార్యులుగారికిని, శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారికిని మా కృతజ్ఞతాభివందనములర్పించుచున్నాము. ఈ శతకాన్ని పలు శ్రమలకోర్చి సకాలంలో ముద్రించి ప్రతులనందజేసిన "సాయి శ్రీనివాస్ ప్రింటర్సు" వారికి కృతజ్ఞతలను తెలుపుచున్నాము.

ఇంక ఒక్కమాట. ఈ రచనకు చివర శ్రీరామాష్టోత్తర శతనామా వళిని, శ్రీ సీతాష్టోత్తర శతనామావళిని, శ్రీ ఆంజనేయాష్టోత్తర శతనామా వళిని పాఠకులకుపయుక్తంగా ఉండగలదని చేర్చాము. భక్తులు గమనింప గలరు.

మా ఈ రచనను శ్రీ బెల్లెపల్లి రాధాకృష్ణమూర్తి వారి సతీమణి శ్రీమతి లోలాక్షి గారలకు సంతోషపూర్వకముగా కృతి సమర్పణ గావించుచున్నాము. వారును, వారి కుటుంబమును సర్వదా నిత్యకల్యాణము పచ్చతోరణమునై వెలుంగగలందులకు హనుమత్ సహిత శ్రీ సీతారామ చంద్రమూర్తి వారిని ప్రార్థింతుము.

ఇట్లు

**లక్ష్మి సువర్చల**

**సీతామహాలక్ష్మి**

(ప్రతిపదార్థ భావరచయిత్రులు)



శ్లో॥ అపదామపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్

శ్లో॥ సర్వానిష్ట నివారకం శుభకరం పింగాక్ష మక్షపహం
సీతాన్వేషణతత్పరం కపివరం కోటీందుసూర్యప్రభం
లంకాద్వీపభయంకరం సకలదం సుగ్రీవసమ్మానినం
దేవేంద్రాది సమస్త దేవ వినుతం కాకుత్థ్సదూతం భజే॥

— )o( —

# కృతిగ్రహీతలు



శ్రీ బిప్పెపల్లి రాధాకృష్ణమూర్తిగారు
వారి సతీమణి శ్రీమతి లోలాక్షిగారు

శా॥ గారామొప్పఁగఁగీర్తిఁగాంచి విలసత్ కారుణ్యమేపార స
చ్ఛారిత్రాధిపులైన పండితులకున్ సత్కారముల్ సేయుచున్
ధౌరేయుండయిపెల్లు బిప్పెపలి రాధాకృష్ణమూర్త్యాఖ్యుఁడ
ద్దారన్ సంతతిఁబ్రోచుఁగావుతను రాధాకృష్ణుడెల్లప్పుడున్॥

# దాశరథి శతకము

## మున్నుడి

### శతక నిర్వచనము - స్వరూపము

ఆంధ్రవాఙ్మయమున పేరెన్నికగన్న విభిన్న కావ్య ప్రక్రియలలో శతకమొక విశిష్ట స్థానము నాక్రమించినది. ప్రాకృత సంస్కృత భాషలలో గల శతప్రక్రియ ననుసరించియే, తెలుగుభాషలో గూడ శతక రచన మారంభింపబడినది. సంస్కృత భాషలో పెక్కు శతకములున్నను, ప్రాచీన సంస్కృతాలంకారికులు వీని స్వరూపమును విస్పష్టముగా పేర్కొనకుండ అనిబద్ధకావ్యములని కొందఱును, ఒకశ్లోకము ముక్తకము గాన ముక్తక సముదాయముగానున్న వీనిని కులకములని మఱికొందఱును తెల్పియున్నారు. 13వ శతాబ్దమందున్న అమృతానందయోగి "శతేవ శతకం ప్రోక్తమ్" అని శతక స్వరూపమును స్పష్టముగా నిరూపించినట్లు కనబడుచున్నది. కాని 14-వ శతాబ్దమునందున్న విద్యానాథుడు అసర్గ బంధము ఉపకావ్యమని పేర్కొనగా ఈ విద్యానాథుని ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాత అసర్గ బంధ కావ్యములకు ఉదాహరణముగా మయూరుని సూర్యశతకాదులను చెప్పియున్నాడు.

ఇక తెలుగు లక్షణ గ్రంథములలో విన్నకోట పెద్దన తన "కావ్యాలంకార చూడామణి" యందు "శతకమన నొప్పు మఱి పద్య శతము గూడ"—అనియు, అనంతామాత్యుడు తన "ఛందోదర్పణము" అను నామాంతరము గల "అనంతుని ఛందస్సు"—అను గ్రంథమున

"శతకము"— "అష్టోత్తర శతకము" అను వానిని గూడ సుదాహరించి నాడు. అప్పకవి తన "అప్పకవీయము"న "శతకము - అష్టోత్తర శతకము" — అని చెప్పినాడు కాని వాని లక్షణములను చెప్పలేదు.

శతకములయందలి పద్యములను చాటువులని కొందఱును, శతకములు ఖండకృతులని మఱికొందఱును తలచినారు. అంతేగాక ఇవి భావగీతములని కొందఱును, ఆత్మాశ్రయ కవితా రీతికి చెందునవి అని వేఱొక కొందరును తలంచుచున్నారు.

## శతక రచనారంభము

శతక రచన ప్రప్రథమమున ప్రాకృతమున నారంభమైనది. ఈ భాషయందున్న "అవదాన శతకము" నందు ఒక్కొక్క విభాగమున పది శ్లోకముల చొప్పున పది విభాగములు కనబడుచున్నవి. తెలుగుభాషయందు గూడ నారాయణ శతకము (బమ్మెర పోతన రచన) నందును, ఒంటిమిట్ట రఘువీర శతకము (అయ్యలరాజు త్రిపురాంతక కవికృతము) నందును గూడ ఇట్టి విభాగమున్నట్లే గమనింపగలము.

కన్నడ భాషలో మకుట నియమము - సంఖ్యానియమము- అను వానితో 8-వ శతాబ్దియందే శతక రచన మారంభింపబడినట్లు తెలియు చున్నది. "త్రైలోక్య చూడామణి శతకము" ఆకాలమునాటిదే. తెలుగు-కన్నడ భాషలకు గల సన్నిహిత సంబంధముచే కన్నడ భాషయందు గల శతక ప్రక్రియ ననుసరించియే తెనుగున గూడ శతక రచన మారంభింప బడినట్లు ఊహింపవచ్చును.

## శ త క ల క్ష ణ ము లు

ఏకసూత్రతత గలిగిన ముక్తక సముచ్చయమే శతకముగా ఇది వరలో తెలిసికొనియున్నాము. ఇక (1) సంఖ్యానియమము (2) మకుట నియమము (3) వృత్తనియమము (4) రసనియమము అను నాలుగును తెలుగు భాష యందలి శతకములకు ముఖ్యలక్షణములుగా గుర్తింప బడినవి. ఈ నాలుగు లక్షణముల వివరణమును ఇప్పుడిచ్చుట పరిశీలింతము

**1) సంఖ్యానియమము :-** ప్రాచీన ప్రాకృత సంస్కృత స్తోత్రములందును శతకములందును గూడ చాలవరకు సంఖ్యానియమము పాటింపబడినది. నూఱు, నూటయెనిమిది, నూటపది, నూటపదహాఱు, నూటఇరవై మొదలుగాగల సంఖ్యలతో విభిన్న సాంప్రదాయాలననుసరించి స్తోత్రాలు, శతకాలు రచింపబడినవి. ఆదికవియైన వాల్మీకి మహర్షి శ్రీమద్రామాయణమున గల "అశ్వమేధశతైః"— అను శ్లోక భాగానికి వ్యాఖ్యాతలు "అనేకాశ్వమేధైః— అని వివరణ మిచ్చుటచే నూఱు సంఖ్య బహుశార్థమున గూడ ప్రయోగింపబడినట్లు గ్రహింపవచ్చును. చాలమంది ప్రాకృత సంస్కృత శతక కర్తలు నూఱు — నూటయెనిమిది సంఖ్యతో శతకములను రచించినట్లు తెలియుచున్నది. తెలుగుభాషయందలి పెక్కురు శతకకర్తలు ఈ సంఖ్యానియమమునే అనుకరించి యుందురు. అందుచే తెలుగు భాష యందలి పెక్కు శతకములు నూఱు లేదా నూటయెనిమిది పద్యములతో రూపొందింపబడినవి.

**2) మకుట నియమము :-** మకుట నియమము సంస్కృతమున చాల స్తోత్రములందును, శతకములందును గూడ పాటింపబడినది. వేదస్తుతులలో "సజనాః ఇంద్రః" ఇత్యాదిగను, వాల్మీకి రామాయణమున

"యస్యార్యోఽనుమతే గతః" అనియును, "కాలభైరవాష్టకము" "విశ్వనాథాష్టకము" మొదలగు స్తోత్రముల యందును, చండీశతకమున "సాస్తు కాశీ శ్రియేవః" "పార్వతీ పాతు సా వః" అనుచును, మకుట నియమము పాటింపబడినది. ఇట్టి మకుట నియమమును తరువాతి కన్నడ కవులును, తెలుగు కవులును అనుకరించిరనుట కెట్టి సందేహమును లేదు. ఆంధ్రమున మకుటముతో గూడిన స్తోత్రరచనకు ఆద్యులు నన్నయభట్ట నన్నెచోడులే. "మాకు ప్రసన్నులయ్యెడున్"—అను మకుటముతో నన్నయ రచించిన నాగస్తుతియు, "దారిద్ర్య విద్రావణా"—అను మకుటముతో నన్నెచోడుడు రచించిన దారిద్ర్యవిద్రావణ స్తోత్రమును తరువాతి తెలుగు కవులు మకుట నియమముతో శతక రచన గావించుటకు అంకుర ప్రాయము లనవచ్చును. ఇట్టి మకుట నియమమును పాటించుట మూలముగా ఒక్కొక్కప్పుడు శతకమంతయు ఏకప్రాసతో రచింపవలసిన ఆవశ్యకమును ఒక్కొక్కప్పుడు ఒకే వర్ణముతో యతిని నిలుపవలసిన అక్కఱయు తప్పనిసరి యగుచున్నది. ఈ దాశరథి శతకమున "దాశరథీ! కరుణాపయోనిధీ!"— అను మకుటము కారణముగా తుదిపాదమున ఒకే వర్ణముతో యతిని కూర్పవలసినచ్చుటను గమనింపగలము.

3) వృత్త నియమము :- పెక్కు శతకములు ఒకేవృత్తము లేదా పద్యముతో రచింపఁబడియుండుట కానవచ్చుచున్నది. ఇట్టినియమము వలన ఒక్కొక్కచోట ఏకప్రాసరచన, వేఱొక్కచోట తుదిపాదమున ఒకే అక్షరమును యతి స్థానమున కూర్చుట మున్నగు విషమ సమస్యల నెదుర్కొనవలసివచ్చును. ఒక్కొక్కప్పుడు మిక్కిలి క్లిష్ట ప్రాసను నిలుపు నియమమును పాటించి రచింపబడిన శతకములును గలవు. ఒక్కొక్కచోట మకుటము ననుసరించియే ఏకవృత్తముతో శతకమంతయు రచింపవలసిన ఆవశ్యకము అనివార్యమగును.

**4) రసనియమము :-** తెలుగు భాష యందెక్కువగా భక్తి భావ బంధురములైన శతకములే ఎక్కువగా నున్నవి. శృంగార శతకమును, హాస్యరస శతకములును, వ్యాజస్తుతి, వ్యాజనిందా శతకములును కూడ ఎక్కువగానే కానవచ్చుచున్నవి. నీతిబోధక శతకములు పెక్కులు గలవు.

ఇక తెలుగున 12, 13 శతాబ్దములలో రచింపబడిన పాల్కురికి సోమనాధుని "వృషాధిప" శతకమును, యథావాక్కుల అన్నమయ్య రచించిన "సర్వేశ్వర" శతకమును, ప్రప్రథమ శతకములై, సర్వలక్షణ శోభితములై భక్తిభావ బంధురములుగా కానవచ్చుచున్నవి. తరువాతి కాలమున కొన్ని సంఖ్యా-వృత్త-మకుట-రస నియమములను పాటించుచు, పద్యములను లేదా వృత్తములను అకారాదిగ రచింపబడిన శతకములును, కొన్నిగలవు. ఇప్పుడు ఇచ్చట పరిశీలింపబడుచున్న "దాశరథి" శతకము భక్తి శతక వర్గమునకు చెందినది.

## దాశరథి శతకము

# గోపన్న కవిచరిత్ర

"దాశరథీ! కరుణాపయోనిధీ!"— అను మకుటముతో ఆంధ్రదేశ మంతటను మిక్కిలి వ్యాప్తిగాంచి ప్రసిద్ధికెక్కిన దీ "దాశరథి" శతకము కంచెర్ల గోపన్న కృతము. ఈతడు శ్రీరామ భక్తుడు. బాల్యమున బాల రామాయణమును (వాల్మీకి కృత శ్రీమద్రామాయణము నందలి రామాయణ సంగ్రహ చరిత్ర గల ప్రథమ సర్గ) చదువు నలవాటు గలవాడు. అప్పటి

నుండియు శ్రీరాముని యందు మిక్కిలి భక్తి గలవాడై యుండెను. ఈతడే ఆంధ్రదేశమున భద్రాచల రామదాసని ప్రఖ్యాతిగాంచిన మహాభక్తుడు. తెలుగు దేశమున కీర్తనలతోడను, పద్యములతోడను, తోహరలతోడను, వచనములతోడను కూడియున్న "భద్రాచల రామదాస చరిత్రము" అని మిక్కిలి ప్రచారములో నున్న గ్రంథము ఈతని చరిత్రకు సంబంధించినదే.

17-వ శతాబ్దమున హైదరాబాదు సమీపమున గల గోల్కొండను ముఖ్యపట్టణముగా జేసికొని తెలంగాణమును పరిపాలించిన తానీషా కాలమున నీతడు భద్రాచలమునకు తహసీలుదారుగా నున్నట్లు ఈతని చరిత్ర తెలుపుచుండుటచే ఈ శ్రీరామ భక్తుడు 17-వ శతాబ్దమున నున్నట్లు గ్రహింప వీలగుచున్నది. తెలంగాణముననున్న నేలకొండపల్లె ఈ మహా భక్తుని జన్మస్థలము. తండ్రి లింగనమంత్రి. తల్లి కామాంబ. ప్రథమశాఖకు చెందిన బ్రాహ్మణుడు ఆత్రేయస గోత్రమువాడు. దాశరథి శతకము నందలి ఈ క్రింది పద్యము పై విషయములను వెల్లడించుచున్నది.

ఉ॥ అల్లన లింగమంత్రి సుతుఁడత్రిజ గోత్రజుఁడా ది శాఖి కం
చెర్ల కులోద్భవుండనఁ బ్రసిద్ధుఁడనై భవదంకితంబుగా
నెల్ల కవుల్ నుతింప రచియించితి గోప కవీంద్రుఁడన్ జగ
ద్వల్లభ! నీకు దాసుఁడను దాశరథీ! కరుణాపయోనిధీ!!

ఇక

ఉ॥ ఆర్యులకెల్ల మ్రొక్కి వినతాంగుఁడనై రఘునాధ భట్ట రా
చార్యుల కంజలెత్తి....

— అను పద్యభాగ మూలమున ఈతడు రఘునాథ భట్టాచార్యుల వారి శిష్యుడని తెల్లము.

ఈతడు తన యింట నెప్పుడును శ్రీరాముని గూర్చి భజనలు గావించుచు సమారాధనలను చేయుచుండెడివాడట. ఇట్లుండ నొకనాడు కబీరుదాసను భాగవతోత్తముడు. ఈతడు మిక్కిలి భక్తితో గావించు శ్రీరామనామ సంకీర్తనలను విని ఆనందపరవశుడై ఈతనికి తారకమంత్ర మపదేశించెను. అప్పటి నుండి ఈతడు ద్విగుణీకృత భక్త్యుత్సాహములతో శ్రీరాముని సేవించుచు భార్యా పుత్రులతో కాలక్షేపము చేయుచుండెడివాడు. తనకు గల్గిన ఆస్తి నంతయు భక్తితో రామభక్తుల కర్పించుచు సంతర్పణలను చేయుచుండుటచే ఈతనికి కుటుంబ పోషణమే కష్టమయ్యెను ఆ కాలమున గోల్కొండ ప్రభువైన తానీషా యొద్ద మంత్రి పదవుల యందున్న అక్కన్న-మాదన్న అను తన మేనమామలను చేరి వారి ప్రాపకమున ఈతడు భద్రాచలమునకు తహసీలుదారు పదవిని పొందెను. ఆ పదవి యందుండి అచ్చట పన్నులు వసూలు చేయుచు, వసూలు చేసిన ధనమునంతయు భద్రాచల శ్రీరామచంద్రుని కైంకర్యమునకు వెచ్చబెట్టుచుండెనేకాని తానీషాకొక పైసయైనను పంపకుండెను అందుచే ప్రభువైన తానీషా ఆగ్రహించి ఈతనిని బందిఖానా యందుంచి మిక్కిలిగా బాధించెను. తాను నమ్మిన శ్రీరామచంద్రుడే తన్నుకాపాడగలడను నమ్మకముతో ఈతడు పంద్రెండు సంవత్సరములు కారాగారములో యమ యాతనల ననుభవించుచు భక్తి భరితములగు కీర్తనలను పద్యములను రచించెను పిమ్మట ఈతడు తానీషా సేవకులు పెట్టు బాధలననుభవింపలేక విషము త్రాగి మరణించుటకు ఉద్యమింపగా శ్రీరామలక్ష్మణులు యువకుల రూపమున గోపన్న చెల్లించవలసిన పైకమును తానీషాకు అందజేయగా రాజాజ్ఞచే రాజభటులు గోపన్నను చెఱసాల నుండి విడిపించిరి.

ఈ దాశరథి శతకము నీతడు రచింపక పూర్వము కొన్ని గ్రంథములు రచించి నరాంకితము గావించి మోసపోయినట్లు దాశరథి శతకము

నందలి ఈ క్రింది పద్యభాగము ననుసరించి తెలియుచున్నది కాని ఆ గ్రంథముల స్వరూప స్వభావము లెట్టివో తెలియవచ్చుటలేదు.

చం॥ మసగొని రేఁగుఁబండ్లకును మౌక్తికముల్ వెలపోసినట్లు దు
ర్వ్యసనముఁ జెంది కావ్యము దురాత్ములకిచ్చితి మోసమయ్యె-

ఈతని దాశరథి శతక మొక్కటియే ఈతని భక్తిభావమునకును, పాండిత్యప్రకర్షకును, కవితాపాటవ ప్రకటనమునకును, శతకవాఙ్మయమున ఈతని పేరును చిరస్థాయిగా నిలుపుటకును సమర్థమై యున్నది.

## దాశరథి శతక పరిశీలనము

గోపన్న మహాభక్తుడుగనే కాక గొప్ప పండితుడుగను, కవిశ్రేష్ఠుడుగను, పెక్కు గ్రంథములు పఠించి పరిశోధించిన విమర్శకుడుగను కన్పట్టును. ముఖ్యముగా భక్తిభావ సంభరితములగు గ్రంథముల నుండి ఈ శ్రీరామభక్తుడు కొన్ని చక్కని శ్లోకములను గ్రహించి భావానువాదము గావించి రచించిన పద్యములును, కొన్ని భక్తిశతకము లందలి పద్యభావముల ననుకరించి రచించిన పద్యములును ఈతని దాశరథి శతకము నందుండుటయే యిందులకు తార్కాణము. ఇట్టి పద్యములు ఈతని శతకమునకు వన్నె చేకూర్చుచు పఠితల హృదయమున చొచ్చుకొని వారిని పరమ భక్తులుగను, సన్మార్గవర్తనులుగను చేయుననుట కెట్టి సందేహమును లేదు. అట్టివానిని కొన్నిటిని ఇచ్చట మచ్చునకు ఉదాహరించెదను.

శ్లో॥ "రా" శబ్దోచ్చార మాత్రేణ! ముఖాన్నిర్యాంతి పాతకాః!
పునఃప్రవేశ భీత్యాచ! మకారస్తు కవాటవత్॥

—అను "రామ" శబ్దోచ్చారణ మహత్త్వమును విశదీకరించు పై శ్లోకమునకు ఈ మహాభక్తకవి వరుని భావానువాదమును పరిశీలింపుడు.

ఉ॥ "రా" కలుషంబులెల్ల బయలంబడఁద్రోచిన "మా" కవాటమై
దీకొని ప్రోచు నిక్కమని ధీయుతులెన్నఁ దదీయ వర్ణముల్
గైకొని భక్తిచే నుడువఁగానరు గాక విపత్పరంపరల్
దాకొనునే జగజ్జనుల దాశరథీ! కరుణాపయోనిధీ!!

ఇక కులశేఖరాళ్వార్ ముకుందమాల యందలి

శ్లో॥ కృష్ణ! త్వదీయ పద పంకజ పంజ రాంత
మద్యైవ మే విశతు మానస రాజహంసః
ప్రాణ ప్రయాణ సమయే కఫవాత పిత్తైః
కంఠావరోధన విధౌ స్మరణం కుతస్తే॥

—అను శ్లోకమునకు

ఉ॥ ముప్పున కాలకింకరులు ముంగిట వచ్చినవేళ, రోగముల్
గొప్పరమైనచోఁ గఫము కుత్తుక నిండినవేళ, బాంధవుల్
గప్పినవేళ, మీస్మరణ గల్గునొ, కల్గదొ, నాఁటి కిప్పుడే
తప్పక చేతు మీ భజన దాశరథీ! కరుణాపయోనిధీ!!

—అని ఈ ఆర్త భక్తుని అనువాద రూపమైన మొఱ.
ఇక "గరుడ పురాణము" నందలి

శ్లో॥ కురంగ మాతంగ, పతంగ, భృంగ
మీనాః హతాః పంచభిరేవ పంచ

ఏకప్రమాదీ సకథం సహన్యతే
యః సేవతే పంచభిరేవ పంచ॥—అనునట్టియు

ఇక "వివేక చూడామణి" యందలి

శ్లో॥ శబ్దాదిభిః పంచభిరేవ పంచ
పంచత్వమాపుః స్వగుణేనబద్ధాః
కురంగ, మాతంగ, పతంగ, మీన
భృంగా నరః పంచభి రంచితః కిమ్॥

—అను పంచేంద్రియ సుఖములకును వశమగు జీవుల గతిని దెలుపు శ్లోక భావములకు అనుకరణముగా ఇంచుక మార్పుతో రచించిన ఈ క్రింది పద్యమును తిలకింపుడు.

చం॥ వనకరి చిక్కె మైనసకు, వాచవికిన్ జెడిపోయె మీను, తా
వినికికిఁజిక్కెఁజిల్వ, కనుఁ దుఃఖుఁజెందెనువేళ్ళ, తావిలో
మనికి నశించెఁదేఁటి, తరహా యిరు మూటినిఁగెల్వనైదు సా
ధనముల నీవె కావఁదగు, దాశరథీ! కరుణాపయోనిధీ!!

అట్టి పంచేంద్రియ సుఖములకును తన్ను వశము గానీయక రక్షింపు మనుచు పై పద్యమున ఈ ఆర్త భక్తుని ప్రార్ధన.

ఇక "విష్ణుపురాణము" నందలి

శ్లో॥ స్వపురుషమభివీక్ష్య పాశ హస్తం
వదతి యమః కిల తస్య కర్ణమూలే
పరిహర మధుసూదన ప్రపన్నాన్
ప్రభురహ మన్యనృణాం నవైష్ణవానామ్॥

— అను శ్లోకమునకు సదా శ్రీరామనామ సంకీర్తన గావించు ఈ పరమ భక్తాగ్రేసరుని అనువాద భావమును గనుడు.

చం॥ పరమదయానిధే! పతితపావననామ! హరే! యటంచు, సు
స్థిరమతులై సదా భజనసేయు మహాత్ముల పాదధూళి నా
శిరమునఁదాల్తు మీరటకుఁజేరకుఁడంచు యముండు కింకరో
త్కరముల కానవెట్టెనఁట, దాశరథీ! కరుణాపయోనిధీ!!

ధూర్జటి మహాకవి తన "శ్రీకాళహస్తీశ్వర శతకము"న

మ॥ తమకంబొప్పఁబరాంగనా జన పర ద్రవ్యంబులన్ ముచ్చిలం
గ, మహోద్యోగముసేయు నెమ్మనము దొంగంబట్టి వైరాగ్య పా
శములంజుట్టి బిగించి నీదు చరణ స్తంభంబునంగట్టి వై
చి ముదంబెప్పుడు గల్గఁజేయఁగదవే శ్రీకాళహస్తీశ్వరా॥

అని తన మనశ్చాంచల్యమును పోగొట్టవలసినదిగా వేడుకొనగా ఈ గోపన్నయు.

చం॥ పరుల ధనంబుఁజూచి పర భామలఁజూచి హరింపఁగోరు మ
ద్గురుతర మానసంబనెడు దొంగను బట్టి, నిరూఢ దాస్య వి
స్ఫురిత వివేక పాశములఁజుట్టి భవచ్చరణంబనే మరు
త్తరువునఁ గట్టివేయఁగదె, దాశరథీ! కరుణాపయోనిధీ!!

—అనుచు అతని రీతినే ప్రార్థించును.

పోతన "నారాయణ శతకము" న శ్రీమన్నారాయణుని మహత్త్వమును.

శా॥ నీ పుత్రుండు చరాచర ప్రతతులన్ నిర్మించి పెంపారఁగా,
నీ పుణ్యాంగన సర్వజీవతతులన్ నిత్యంబు రక్షింపఁగా,

నీ పాదోదక మీ జగత్త్రియములన్ నిష్పాపులంజేయఁగా,
నీ పెంపేమని చెప్పవచ్చు సుగుణా! నిత్యాత్మ! నారాయణా॥

—అనుచు వర్ణింపగా ఈ పరమ భక్తుడును

ఉ॥ నీ సతి పెక్కు కల్మిలిడనేర్పరి, లోక మకల్మషంబుగా
నీ సుత సేయు పావనము, నిర్మితి కార్యధురీణదక్షుఁడై
నీ సుతుఁడిచ్చు నాయువులు, నిన్ను భజించినఁగల్గకుండు నే
దాసులకీప్సితార్థములు, దాశరథీ! కరుణాపయోనిధీ!!

—అనుచు నారాయణుని యవతార రూపమునమున్న దాశరథి నుగ్గడించును.

ఇక అయ్యలరాజు త్రిపురాంతక కవి తన "ఒంటిమిట్ట రఘువీర శతకము"న

శా॥ త్రోవన్ మానవుఁడొంటి దోవు తటి నీ స్తోత్రంబు వాక్రుచ్చినన్
నీవుందమ్ముఁడు దోడు వత్తురటెకా నెయ్యంబు తియ్యంబుగా,
నీవంటాప్తుఁడు నిన్నుఁబోలు హితుఁడున్ నీ వంటి భక్త ప్రియ
ప్రావీణ్యుండునులేఁడు చూడ రఘువీరా! జానకీనాయకా॥

— అనుచు శ్రీరామచంద్రుని ఆపద్బాంధవునిగా స్తుతింపగా, గోపన్నయు, అట్లే

ఉ॥ పాపము లొందువేళ, రణపన్నగ భూత భయ జ్వరాదులం
దాపదనొందువేళ, భరతాగ్రజ! మిమ్ము భజించు వారికిన్
ప్రాపుగ నీవు తమ్ముఁడిరు పక్కియలం జని తద్విపత్తి సం
తాపము మాన్పికాతురఁట, దాశరథీ! కరుణాపయోనిధీ!!

అనుచు ఈ పద్యమున శ్రీరామచంద్రుని ఆపన్ని వారకుడుగా స్తుతించియున్నాడు.

యథావాక్కుల అన్నమయ్య తన "సర్వేశ్వర శతకము"న

శా॥ పెంపన్ దల్లియగున్, రుజాపటల దుష్పీడా విధిక్షోభ వా
రింపన్ వైద్యుఁడగున్ గుమార్గ విధులన్ గ్రీడింపఁబోకుండ శి
క్షింపన్ బల్లిదుఁడైన తండ్రియగుచున్ శ్రీమంతుఁగా నెంతయున్
సంపద్వృద్ధి యొసంగ దాతయగు నీ సద్భక్తి, సర్వేశ్వరా॥

—సర్వేశ్వరుని యందలి భక్తియే తనకు ఆతనికి తల్లిగను, తండ్రిగను, దాతగను, వైద్యునిగను జేయుననుచు కీర్తింపగా, ఈ భక్త వరుడును అట్లే.

ఉ॥ పెంపను దల్లివై, కలుషబృంద సమాగమ మొందకుండ ర
క్షింపను దండ్రివై, మెయివసించు దశేంద్రియ రోగముల్ నివా
రింపను వెజ్జువై, కృపగుణించి పరంబుఁ దిరంబుగాఁగ స
త్సంపదలియ్య నీవెగతి, దాశరథీ! కరుణాపయోనిధీ!!

—అను పద్యమూలమున తనకు తల్లిగను, తండ్రిగను, దాతగను, వైద్యుడుగను అగుటకు శ్రీరామచంద్రుని ప్రార్థించుచున్నాడు.

అంత్యప్రాస నియమమును పాటించుచు పాల్కురికి సోమనాధుడు తన "వృషాధిప శతకము"న పెక్కు పద్యములను రచింపగా ఈ మహా భక్తుడును అంత్యప్రాస నియమముతో రచించిన ఈ క్రింది పద్యములను సమీక్షింపుడు.

ఉ॥ లింగమయాంతరంగ! గురులింగ పదాంబుజ భృంగ! సత్ప్రసా
ధాంగ! కృపాపరిస్ఫుర దపాంగ! విముక్త భుజంగ! జంగమో

త్తుంగ! జితాభిషంగ! గత దుష్కృత భంగ! ఘదీయలింగ! నీ
వంగడమే! జుమయ్య, బసవా! బసవా! బసవా! వృషాధిపా॥

ఉ॥ రంగదరాతి భంగ! ఖగరాజ తురంగ! విపత్పరంపరో
త్తుంగతమఃపతంగ! పరిపోషితరంగ! దయాంతరంగ! స
త్సంగ! ధరాత్మజా హృదయ సారసభృంగ! నిశాచరాబ్జ మా
తంగ! శుభాంగ! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!!

పై రెండు పద్యములందును పూర్ణానుస్వార పూర్వక "గ" కారమే **అంత్యప్రాసాక్షరముగా** నుండుటను గమనించునది.

ఉ॥ నాదకళావినోద! యఖినందిత వేదహృతాపవాద! సం
పాదిత భక్తి మోద! బుధవందితపాద చిరప్రమోద నా
స్వాదిత సుప్రసాద! యవిషాద శిలాదసుతా నిఖేద! దే
వా దయఁజూడుమయ్య! బసవా! బసవా! బసవా వృషాధిపా!

ఉ॥ శ్రీద! సనందనాది మునిసేవిత పాద! దిగంతకీర్తి సం
పాద సమస్త భూత పరిపాల వినోద! విషాద వల్లికా
చ్ఛేద ధరాధినాథకుల సింధు సుధామయపాద! నృత్తగీ
తాది వినోద! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!!

పై రెండు వృత్తములయందును దీర్ఘపూర్వక "ద" కారమే **అంత్యప్రాసాక్షరముగా** నున్నట్లు విశదమే కదా.

ఇక పరమ భాగవతాగ్రగణ్యుడైన కులశేఖరాళ్వార్ తన **"ముకుందమాల"** గ్రంథ

శ్లో॥ ..................................................................

త్వత్ భృత్యభృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ॥

—అనుచు పై శ్లోకపాద భావముల మూలమున వేడుకొనగా మన భక్త శేఖరుడైన గోపన్నయు.

ఉ॥ ..........................................................నీ

కొప్పిదమైన దాసజనులొప్పిన బంటుకు బంటనంటి నా
తప్పులకెల్ల నీవెగతి, దాశరథీ! కరుణాపయోనిధీ!!

—అనుచు మిక్కిలి ఆర్తితో కరుణామయుడును భక్త సులభుడును నయిన ఆ దాశరథిని ప్రార్థించుచున్నాడు.

పైని వివరించిన శ్లోక భావములను గాని పద్యభావములను గాని అనుసరించి రచింపబడిన పద్యములను పరిశీలించినచో భక్తాగ్రగణ్యుల భావము లొకే విధముగా నుండునని తలంచుట సరసము గాని అనుకరణ మనుట సమంజసముగా నుండదేమో!

ఈ శతకము నందలి 1-2-3-4-5-8-9-10 పద్యములు స్తోత్ర పూర్వకముగా వీరాగ్రేసరుడైన శ్రీరామచంద్రుని మహత్త్వమును దెల్పుచు రచింపబడినవి. ఇక 69-వ పద్యము మొదలు 78 - వ పద్యము వరకు ఆ పరమాత్మని దశావతార లీలలుగా వర్ణింపబడినవి.

ఇక మహా భక్తులు పరమాత్మ స్వరూపులుగా తమ తమ ఇష్ట దైవతములను ప్రార్థించుతఱి పారవశ్య దశలో గావించిన "అంజలెత్తి" "వైరులన్నదన జయించు" "వ్రాతురో"మున్నగు లక్షణ విరుద్ధ ప్రయోగ ములను లక్షణ కర్తలు పరిగణింపక "ఏకోహి దోషో గుణసన్నిపాతే! నిమజ్జతీందోః కిరణేష్వివాంకః"— అను మహాకవి కాళిదాస సూక్తిని మనసునందుంచుకొనుట శ్రేయస్కరమని భావించుచున్నాను.

ఇక ప్రతిపదార్థ భావ రచన విషయమున ఒక్కమాట. సాధారణముగా నిట్టి శతకములు సరళ సుందర శైలిలో సాగి యుండుట చేత ఆబాల గోపాలము పఠించి ఆనందించుటకు అనువై యుండును. ఏపద్యము చదివినను కవి హృదయము పద్య భావము తెలియుచున్నట్లే యుండును. కాని పద్యముల కన్నింటికి అన్వయము కుదురు పరచి ప్రతిపదార్థమును చెప్పుట, భావము నిదమిత్థమని తెలియుట అంత తేలికపనికాదు. వాక్యములయందు అవాంతర వాక్యములు చొచ్చియుండును. ఒకటి రెండు పదములు అధ్యాహారముగా తెచ్చికొనవలసి యుండును ఇది సాధారణ పాఠకునకును, ఆంధ్ర భాషాధ్యేత యగు విద్యార్థికిని సులభ సాధ్యము గాదు. ఆంధ్ర భాషా బోధనమునందు సిద్ధహస్తులగు పండితులు ప్రతి పదార్థ భావములు వ్రాసి యుందించుట వలన పద్యములు మిగుల ప్రసన్నములై హృదయమున హత్తుకొన గలవు. ఇది యట్టి సప్రయోజనమగు రచనమని భావించుచున్నాను. భావముల మొదట నిబంధించిన భగవత్సం బోధనములు రెండును అంత్యానుప్రాస సుందరములై పఠిత యొక్క భక్తి భావమును ప్రోదిచేయఁ జాలియున్నవి.

భక్త సులభుడగు శ్రీరామచంద్రమూర్తి పేతద్రచయిత్రులు, శ్రీమతి లక్ష్మి సువర్చలకును, శ్రీమతి సీతామహాలక్ష్మికిని అఖిలశుభప్రదాతయైయితోధి కాఽభ్యుదయముల నొసంగి రక్షించు గాతమని యర్థించుచు నాకీ నాల్గు మాటలు వ్రాయునవకాశ మొదవినందులకు ధన్యత్వమును ప్రకటించుచు విరమించుచున్నాను.

"ఇతి శమ్"

(Sd) వింజమూరి శేషఫణి శర్మ
ఆంధ్రోపన్యాసకుఁడు
పీఠికాపురాధీశ ప్రభుత్వ కళాశాల
కా కి నా డ

శ్రీరామ

# శ్రీ రామ-నామ-స్మరణమాహాత్మ్యము

శ్లో॥ వందే రామమనాది పూరుషమజం వందే రమానాయకం
వందే హారకిరీట కుండలధరం వందే సునీలద్యుతిం
వందే చాపకలంబకోజ్జ్వలకరం వందే జగన్మంగళం
వందే పంక్తిరథాత్మజం మమగురుం వందే సదారాఘవమ్॥

శ్లో॥ వందే శౌనకగౌతమాద్యభినుతం వందే ఘనశ్యామలం
వందే తారకపీఠ మధ్యనిలయం వందే జగన్నాయకం
వందే భక్తజనౌఘదేవవిటపం వందే ధనుర్వల్లభం
వందే తత్త్వమ సీతి వాక్యజనకం వందే సదారాఘవమ్॥

శ్లో॥ వందే సూర్యశశాంకలోచనయుగం వందే జగత్పావనం
వందే పత్రసహస్రపద్మ నిలయం వందే పురారిప్రియం
వందే రాక్షసవంశ నాశనకరం వందే సుధాశీతలం
వందే దేవకపీంద్రకోటి వినుతం వందే సదారాఘవమ్॥

# వాల్మీకి

భగవంతుని లీలావతారములలో నొకటియగు శ్రీరామచంద్రుని చరిత్ర గల శ్రీ మద్రామాయణము వాల్మీకి మహాముని రచనయని లోక ప్రసిద్ధి. వాస్తవమునకీ వాల్మీకి మహాముని అసలుపేరేదో ఎవ్వరికిని తెలియదు. వల్మీకము అనగా పుట్ట. "వల్మీక స్యాపత్యం" పుట్టయొక్క సంతానము కాబట్టి "వాల్మీకి" అనియు, "వల్మీకాద్బహిర్గతః" పుట్టనుండి బయటకు వచ్చినవాడు కాబట్టి "వాల్మీకి" అనియు మనం వ్యుత్పత్తులను చెప్పుకుంటున్నాము. అంతేగాని ఆయనగారి అసలుపేరు మనకు తెలియుట లేదు. ఇంకను ఆదికవియైు మహామునియైన ఈతడు ప్రచేతసుని పుత్రుడుగాన ప్రాచేతసుడని కూడా పిలువబడుతున్నాడు. ఒకప్పుడు శ్రీరామచరణ్ కుందుర్తి వేంకటనరసయ్య పాకయాజిగారు శ్రీమద్రామాయణాన్నిగూర్చి చేసిన మహోపన్యాసంలో ఈ క్రింది విధంగా విపులీకరించి చెప్పారు.

శ్లో॥ యఃపిబన్ సతతంరామ చరితామృత సాగరం
అతృప్తస్తంమునిం వందే ప్రాచేతసమకల్మషమ్॥

— అనే శ్లోకంలోని ప్రాచేతసుడు కేవలం వాల్మీకి మహర్షి కాడు. ఆప్రాచేతస మహర్షి బ్రహ్మ శాపవశమున భూలోకంలో రత్నాకరుడనే బ్రాహ్మణ కుమారునిగా జన్మించి (ఈతని పేరు ఋక్షుడు అని రామాయణంలో వుంది.) విధి వశాన చండాలురతో గలిసి బోయతను పెండ్లాడి సంతానాన్ని పొందిదారులుకాచి ప్రయాణీకులనుకొట్టి ధనము సంపాదిస్తూ జీవయాత్ర సాగిస్తుండగా ఆతని అదృష్టవశాత్తు ఆ మార్గంవెంట సప్త ఋషులు వస్తూ ఆతనిపై దయగలిగి వర్ణభ్రష్టుడు కావడంచేత ఆతనికి తారకమంత్రోపదేశం చేయడానికి వీలుగాక అచ్చట నున్న చెట్లు గాలికి మరా మరా ధ్వనులు చేస్తుండగా ఆ "మరామరా" అనే అక్షరాన్నే పఠిస్తూ

జపం చేయవలసిందిగా హితబోధ చేస్తారు. ఆ మరామరా అను అక్షరాలే "రామరామ"గా మార్పునొందుతాయి. ఆ విధంగా కొన్ని సంవత్సరాలు తదేక దీక్షతో జపిస్తూండగా నిద్రాహారాలు లేకపోవడంచేత శరీరము తెలియని పరిస్థితి ఏర్పడగా అతని శరీరంమీద పుట్టలు ఏర్పడతాయి. కొన్ని సంవత్సరాల తరువాత దయాళురైన ఆ సప్తర్షులు మరల ఆ మార్గంవెంటే వస్తూ, ఆ పుట్టనూ, ఆ పుట్టలో తదేకదీక్షతో రామ మంత్రాన్ని జపిస్తూన్న ఆ మహామహునిగాంచి అతనిని ఆ తపస్సు నుండి విరమింపజేసి అతనికి "వాల్మీకి" అని నామకరణం చేశారు. పిమ్మట అతడు నారద బ్రహ్మదేవుల ఉపదేశానుసారంగా రామాయణ రచన సాగించాడు. ఈ విషయాన్నే కాక ఇంకా కొంతమంది రామనామ జపం చేత మోక్షాన్ని సాధించినవారిని ప్రస్తావిస్తూ ఒక మహాకవి ఈ క్రింది విధంగా విపులీకరించి చెప్పాడు.

సీ॥ దారి తక్కరి రాముఁదల్ల క్రిందుగఁబాడి
పుట్టితో మోక్షవిభూతిఁగనఁడె

ఇప్పుడు మనకు ప్రచారంలో ఉన్న వాల్మీకి రామాయణంలో 24000 శ్లోకాలే కనబడతాయి.

శ్లో॥ చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్॥

— అని శ్రీమద్రామాయణగాథ వందకోట్ల శ్లోకాలతో కూడి యున్నది అని శ్రీమద్రామాయణ పఠన సమాపన శ్లోకాల్లో చెప్పబడి యున్నదికదా. మరి మనకిప్పుడా శ్లోకాలన్నీ కనిపించవేం? ఇప్పుడు మనకు లభ్యమగుచున్నవి ఇరువదినాలుగువేల (24000) శ్లోకాలు మాత్రమే గదా! దీనికి సమన్వయమెట్లు? ఇందులకు శ్రీరామచరణ్

కుందుర్తి వేంకటనరసయ్య పాకయాజిగారు ఈ క్రింది విధంగా సమన్వయ పరుస్తారు.

ప్రచేతసుడనే మహర్షిచేత శతకోటి శ్లోక పరిమితిగల రామాయణ గ్రంథం రచింపబడినది. ఆ గ్రంథము స్వర్గ, మర్త్య, పాతాళలోకములకు మూడింటికి సమానంగా పంచబడింది. అందులో భూలోకానికి వచ్చిన భాగం మరలా నవఖండాలకు పంచబడగా మన ఖండానికి విభాగింపబడిన భాగం తిరిగి మనఖండంలోని సప్తద్వీపాలకు పంచబడగా మన జంబూ ద్వీపానికి వచ్చిన వాటాను శ్రీ రామభక్తులైన మహర్షులనేకులు పంచుకోగా మన వాల్మీకి మహర్షి వాటా ఇరువదినాలుగువేల శ్లోకాలయింది. ఈ గ్రంథమే మనకిప్పుడు ప్రచారములోనున్న వాల్మీకి శ్రీమద్రామాయణము. ఈ గ్రంథము బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ కాండలనే ఆరు కాండలతో కూడుకొనియున్నది. ఇంతేగాక ఉత్తరకాండ అనే పేరుతో రామాయణములోని వేరొక భాగం కూడా ప్రచారంలోవుంది. ఇది కూడా వాల్మీకి కృతమేయని శ్రీ గాయత్రీ రామాయణము నందలి

శ్లో॥ యామేవ రాత్రిం శత్రుఘ్నః
పర్ణశాలాం సమావిశత్
తామేవ రాత్రిం సీతాఽపి
ప్రసూతా దారకద్వయమ్॥

—అనే శ్లోకం ఇరువది నాల్గవదిగా కన్పిస్తోంది. ఈ గాయత్రీ రామాయణం వాల్మీకి రచనయే. ఇది ఇరువదినాలుగు శ్లోకాలతో కూడియున్నది. గాయత్రీ మంత్రంలోని 24 అక్షరాలు ఒక్కొక్క శ్లోకంలో ఒక్కొక్క అక్షరం చొప్పున నిక్షిప్తంచేసి వ్రాయబడినట్లు తెలుస్తోంది. "యామేవ రాత్రిమ్" అన్నది 24-వ శ్లోకము. శత్రుఘ్నుడు రాముని

యాజ్ఞచే లవణాసురుని సంహరించి వాల్మీకి మహర్షి పర్ణశాలను ప్రవేశించిన రాత్రియే సీతాదేవికి ఇద్దరు పుత్రులు (కుశలవులు) జన్మించారు అని ఈ శ్లోక తాత్పర్యము. ఈ కుశలవుల జననము గాయత్రీ రామాయణము సందలి చివరి ఇరువది నాలుగవ శ్లోకంగా నుండుటచేత ఉత్తర రామాయణం కూడా వాల్మీకి మహర్షి కృతమేయని నిశ్చయింపవచ్చును.

# శ్రీ రామ నామము

దశరథ మహారాజు అరువదివేల సంవత్సరాలు రాజ్యపాలన గావించాడు. కౌసల్య—సుమిత్ర—కైకేయి అనే ముగ్గురు రాజకుమార్తెలను వివాహం చేసికొన్నాడు. కాని ఏ ఒక్క భార్యయందును సంతానం కలగ లేదు. అప్పుడు కొందరు మహామునుల ఉపదేశాన్ననుసరించి పుత్రకామేష్టి అనే యాగాన్ని సంతాన ప్రాప్తికై చేశాడు. ఆ యాగ ప్రభావ మూలంగా ఆ మహారాజు పెద్ద భార్యయైన కౌసల్యకు ఒక పుత్రుడు జన్మించాడు. ఆతనికి ఏ పేరు పెట్టమంటారు అని దశరథుడు తమ కులగురువైన వశిష్ఠ మహర్షిని అడుగుతాడు. ఆ మహర్షి చక్కగా ఆలోచించి "రామ" అనే పేరు పెట్టమంటాడు. "రామ" అనే పేరు పెట్టమనడంలో గొప్ప అంతరార్థముంది. ఆ రహస్యాన్ని ఈ క్రింద వివరిస్తాను.

సామాన్యంగా ప్రతి మహా మంత్రానికి ఒక జీవాక్షరం ఉంటుంది. ఏ అక్షరాన్ని ఆ మహా మంత్రం నుండి తొలగిస్తే ఆ మంత్రానికి అపార్థం వస్తుందో ఆ తొలగించబడిన అక్షరాన్నే ఆ మహామంత్రానికి జీవాక్షర మంటారు. ఇక "ఓం నమో నారాయణాయ" అనే విష్ణుపరమైన అష్టాక్షరీ మహా మంత్రానికి "రా" జీవాక్షరము. ఆ జీవాక్షరాన్ని తీసివేస్తే "నాయ నాయ" అవుతుంది. న+అయనాయ; అయనాయ=మోక్షము కొఱకు; న=కాదు; అనే అపార్థం వస్తోంది కాబట్టి ఈ అష్టాక్షరీ మహా మంత్రానికి

"రా" జీవాక్షరమయింది. ఇక శివపరమైన "ఓం నమఃశివాయ" అనే పంచాక్షరీ మహామంత్రానికి "మ" జీవాక్షరము. ఈ "మ" అనే అక్షరాన్ని తొలగిస్తే "న శివాయ" అవుతుంది. శివాయ=మంగళము (శుభము) కొఱకు; న=కాదు; అనే అపార్థం వస్తోంది కాబట్టి ఈ పంచాక్షరీ మహా మంత్రానికి "మ" జీవాక్షరమయింది. ఈ రెండు జీవాక్షరములను కలిపి ఉచ్చరిస్తే "రామ" అని అవుతుంది. శివునకును; విష్ణువునకును అభేద మును తెల్పు ఈ "రామ" అనే నామమునే దశరథుని యొక్క జ్యేష్ఠ పుత్రునకు నామకరణం చేయవలసినదిగా దశరథ మహారాజునకు వశిష్ఠ మహర్షి హితోపదేశం చేస్తాడు. ఆ కుల గురువుల అజ్ఞానుసారం "రామ" అనియే పెద్ద కుమారునకు నామకరణం చేస్తాడు. "రామ" అనే అక్షర ద్వయంలో నిగూఢమై యున్న భావమిది. ఈ విషయాన్నే 24 కోట్ల శ్రీరామనామ జపంచేసి తరించిన శ్రీరామ భక్తుడైన త్యాగరాజు ఒక కీర్తనలో "ఎవరని నిర్ణయించేదిరా నిన్ను" అంటూ ప్రారంభించి "శివు డవో, మాధవుడవో, కమల భవుడవో, పరబ్రహ్మవో" అంటూ "శివ మంత్రమునకు "మ" జీవము, మాధవు మంత్రమునకు "రా" జీవము, ఈ వివరము తెలిసిన ఘనులకు మ్రొక్కెద" అని "రామ" అను రెండక్ష రముల ప్రభావాన్ని వ్యక్తం చేస్తాడు. ఇంకా

"శివాయ విష్ణురూపాయ! శివరూపాయ విష్ణవే" అని కూడా చెప్ప బడిఉంది. ఈ హరిహరులకు భేదం ఉన్నది అంటే పాపమట. ఈ క్రింది శ్లోకాన్ని పరిశీలించండి.

శ్లో॥ హరిరేవ శివస్సాక్షాత్! శివ ఏవ హరిః స్మృతః
ఉభయోరంతరం నాస్తి! భేదకృత్ పాపమశ్నుతే!!"

—సాక్షాత్తు హరియే! శివుడు, శివుడే హరి. ఇరువురకునూ భేదమావంతయులేదు. ఇరువురకు భేదమున్నదంటే మహా పాపమని పై శ్లోక భావము.

# శ్రీ రామ మంత్ర మహత్త్వము

శ్లో॥ కృతేతు తపసోముక్తిః। త్రేతాయాం యాగతస్తథా
ద్వాపరే దానధర్మాదేః। కలౌ సంకీర్తనాదపి॥

—కృతయుగంలో తపస్సు చేతను, త్రేతా యుగంలో యజ్ఞ యాగాది క్రతువులచేతను, ద్వాపరయుగంలో దాన ధర్మాదులచేతను ముక్తి పొందవచ్చును కాని కలియుగంలో పై తపస్సు, క్రతువులు, దాన ధర్మాదులు అక్కర లేకుండా భగవన్నామ స్మరణ మాత్రం చేతనే మోక్షం కరతలామలకం - అని పై శ్లోక భావము.

అంతేగాక

శ్లో॥ హరే రామ హరే రామ। రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ। కృష్ణ కృష్ణ హరే హరే
ఇతి షోడశకం నామ్నాం। కలికల్మష నాశనం
నాతః పరతరోపాయః। సర్వవేదేషు దృశ్యతే॥

—సమస్త వేదాలను వెదకి చూచినా "హరే రామ హరే కృష్ణ" అనే పై శ్లోకంలోని పదహారు నామాల జపమే కలికల్మషాన్ని నాశనం చేస్తుంది కాని వేరు ఉపాయం లేదు అని పై శ్లోకాల భావం. పై విధంగా మహా జ్ఞానులైన మహర్షులు ఘోషిస్తున్నారు. ఇక

శ్లో॥ రామ నామ్నః పరో మంత్రః
నభూతో నభవిష్యతి
సప్తకోటి మహామంత్రాః
చిత్త విభ్రమకారకాః॥

—"రామ"- అనే మంత్రాన్ని మించిన మహామంత్రం భూత భవిష్యత్కాలాల్లో లేదనియు, ఉండబోదనియు, మనకు గల సప్తకోటి

మహా మంత్రాలన్నీ మనస్సును కలవర పరచునట్టివి మాత్రమే యనియు ఉపనిషద్వాణి ఘంటాపథంగా పలుకుతోంది. ఇదే పై శ్లోక భావము. ఇంతేగాక

శ్లో॥ సమ ప్తకోటి మహామంత్రాః। చిత్త విభ్రమకారకాః
ఏక ఏవ పరోమంత్రః। రామ ఇత్యక్షరద్వయమ్॥

—మనకు గల సప్త కోటి మహామంత్రాలు మనస్సును కలవర పరచేవే. మరి ఏదయ్యా మహామంత్రం అంటే "రామ" అనే రెండక్షరాలే అని పై శ్లోకభావము. ఈ విధంగా కూడా పెక్కురు "రామ" అనే అక్షర ద్వయమే మహా మంత్రంగా నొక్కి వక్కాణిస్తున్నారు.

"న గాయత్ర్యాః వరో మంత్రః" —గాయత్రీ మంత్రము కంటె వేరొక మహా మంత్రం లేదని పెద్దలు పలుకుతూంటే "రామ" అనే రెండక్షరాలే ఎట్లా గొప్పదవుతుందంటారేమో, ఈ రెండూ ఒక్కటే అని సమాధానము. గాయత్రీ మంత్రానికి గల ఇరువది నాలుగు (24) అక్షరాలను వాల్మీకిమహర్షి రామాయణరచనలో 1000(వెయ్యి) శ్లోకముల కొక్కొక్క అక్షరం చొప్పున 24 వేల శ్లోకాల్లోను 24 అక్షరాలను నిక్షిప్తం చేశాడు. అందుచేత "రామ" అనే రెండక్షరముల మహా మంత్రము నకు, 24 అక్షరాలతో కూడియున్న గాయత్రీ మంత్రమునకు భేదం అణుమాత్రం లేదని భక్తులు గ్రహించాలి.

భక్తులను భవబంధ విముక్తులను గావించడానికి సమర్థమైనది. పరమాత్మ అనబడే తారక బ్రహ్మము మాత్రమే అని రామరహస్యోప నిషత్తులో వివరంగా చెప్పబడ్డది. ఆ ఉపనిషత్తులో శ్రీరామ భక్తుడైన హనుమంతుడు యోగీంద్రులను, మహర్షులను, భక్తులను సంబోధిస్తూ ఈ విధంగా చాటుతాడు.

శ్లో॥ భో! యోగీంద్రాశ్చ ఋషయో
విష్ణుభక్తా స్తథైవచ
శ్రుణుధ్వం మామకం వాక్యం
భవబంధ వినాశనం
ఏతేషు చైవ సర్వేషు
తత్త్వంచ బ్రహ్మతారకమ్
రామ ఏవ పరంబ్రహ్మ
రామ ఏవ పరంతపః
రామ ఏవ పరంతత్త్వమ్
శ్రీరామో బ్రహ్మతారకమ్॥

# శ్రీ రామ నామ మాహాత్మ్యము

శంకరుడు సదా రామ నామ స్మరణ చేస్తూ ఉంటాడని ప్రసిద్ధి. ఆయన సర్వావయవాల్లోని ప్రత్యణువు రామనామాన్ని స్మరిస్తూనే ఉంటుం దట. ఇక శివుడు హాలాహలాన్ని త్రాగినపుడు గర్భంలో ఉన్న అవయ వాలన్నీ రామనామ స్మరణచేస్తూ ఉండడంవల్ల ఆ విషము ఆ నామాల్ని దూసుకుని లోపలకు పోలేకపోయిందట. పోనీ తిరిగి బయటకు వద్దామంటే దానిని త్రాగిన వెంటనే శివుడు మరల రామనామాన్ని పఠిస్తూ ఉండడం చేత దాన్ని దూసుకుని బయటకురాలేకపోయిందట. అందుచేత అటూఇటూ వెళ్ళలేక అతని కంఠంలోనే నిల్చిపోయింది. అందుచేతనే ఆయన గరళ కంఠుడైనాడు. ఈ విషయాన్నే వేరుగా ఈ క్రింది విధంగా చెప్తారు.

4 ఎ)

శ్లో॥ రాశబ్దోచ్చారమాత్రేణ। ముఖాన్నిర్యాంతి పాతకాః
పునః ప్రవేశ భీత్యాచ। మకారస్తు కవాటవత్॥

"రా" అనే అక్షరాన్ని ఉచ్చరించినపుడు గర్భమునందు దాగియున్న పాపాలన్నీ బయటకు వచ్చేస్తాయట. (తిరిగి ఆ పాపాలు లోపలకు ప్రవేశించకుండా) "మ" కారము ఉచ్చరించినపుడు పెదవులు కలుసుకుంటాయి కాబట్టి ఆ పెదవులు రెండునూ తలుపులవలె అడ్డుకొని మూసుకుంటాయట ఈ విషయాన్నే పరమభక్తాగ్రేసరుడయిన మన గోపన్న ఈ దాశరథి శతకంలో—

"రాకలుషంబులెల్ల బయలంబడద్రోచిన "మా" కవాటమై
దీకొని ప్రోచునిక్కము"—అని రామశబ్ద మహత్త్వమును వివరిస్తాడు. ఇంతేగాక

శ్లో॥ రామేతి వర్ణ ద్వయమాదరేణ
సదాస్మరన్ ముక్తిముపైతి జంతుః
కలౌయుగే కల్మషమానుషాణా
మన్యత్రధర్మేఖలు నాధికారః॥

—ఎల్లపుడు "రామ" అనే రెండు వర్ణములను ఆశ్రయిస్తే మానవులు తప్పక ముక్తిని పొందుతారు. అంతేగాని ఇతర ధర్మాలనాశ్రయించే అధికారం ఈ కలియుగంలోని కల్మషమానవులకు లేదంటారు—అని పై శ్లోక భావము

ఇక "రా" అనే అక్షరం అగ్నిబీజం ఈ అగ్నిబీజాక్షరమైన "రా" అనేదాన్ని మనం మనసారా ఏకాగ్రచిత్తంతో ఉచ్చరిస్తే మనలో నెలకొని ఉన్న అహంకారమమకారాలను దహించివేస్తుంది. ఇక "మ" అనే

అక్షరం అమృతబీజం. ఈ అమృత బీజాక్షరమైన "మ" అనేదాన్ని ఉచ్ఛరించినపుడు మన హృదయాన్ని ప్రేమామృతంతో నింపుతుంది.

సామాన్యంగా ఇంట్లోకి దొంగలు రాకుండా ఉండడం కొరకై కొందరు మేము మెలకువగానే ఉన్నామని చెప్పడానికి "రామ, రామ" అని గట్టిగా స్మరణచేస్తూ ఉంటారు. అప్పుడు దొంగలు భయపడి వారి ఇంట్లో ప్రవేశించడానికి భయపడతారు. ప్రవేశించలేరుకూడా ఇది వాస్తవమేకాని రామనామ జపము ధనాన్ని దొంగిలించడానికి వచ్చిన దొంగలనే కాక మనలోపల ప్రకాశమానంగా ఉండే జ్ఞానరత్నాన్ని హరించడానికి ప్రయత్నించే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను నట్టి శత్రువులనబడే దొంగలను కూడా తరిమివేస్తుంది.

# శ్రీ రామనామ స్మరణమాహాత్మ్యము

శ్లో॥ శ్రీ రామనామమాహాత్మ్యం। సర్వంజానాతిశంకరః

—శ్రీరామనామ స్మరణ మాహాత్మ్యము సంపూర్ణముగా తెలిసినవాడు శంకరుడొక్కడు మాత్రమేనట. శ్రీరామనామ సంకీర్తన మూలంగా మనకొక విధమైన రుచికలిగి అందుమూలంగా ఆ నామ స్మరణపై మరులు కలగాలి.

రావణ సంహారమైన తరువాత జరిగిన శ్రీరామ పట్టాభిషేక మహోత్సవ సమయంలో శ్రీరామచంద్రుడు అచ్చటనున్న వారికందరకు ఎవరికి ఏ వరం కావాలంటే ఆ వరాన్ని ప్రసాదించాడట. అందులో లక్ష్మణుడు "అన్నగారు చాలగొప్పవాడు, పరాక్రమైక వీరుడు అయి ఉన్నప్పుడు తమ్ముడు ఏ విధమైన ఆనందాన్ని అనుభవింపగలుగుతాడో ఆ

ఆనందాన్ని అనుభవించాను. ఇక తమ్ముడు గొప్పవాడై యుండగా అన్నగారు ఏవిధమైన ఆనందాన్ని అనుభవింపగలుగుతాడో ఆ ఆనందాన్ని అనుభవింపగల వరాన్ని ప్రసాదించమంటాడు. అంతట శ్రీరాముడు "ముందు వచ్చే బలరామావతారంలో నేను తమ్ముడుగా కృష్ణావతారాన్ని ధరిస్తాను. నీవు అన్నవై బలరామావతారాన్ని ధరింపగలవు" అని వరం ప్రసాదించాడట. ఇక కపులు "మీదగ్గరకు రావాలంటే మాకు చాలాభయం. మీదగ్గరగావచ్చి మీతో కలిసి మా కోతిచేష్టలు చేయగల వరము కావాలి" అని అడిగారట. అప్పుడు శ్రీరాముడు "తరువాత నేను ధరింపబోయే శ్రీకృష్ణావతారంలో మీరు గోపబాలకులుగా పుడతారు నేను గోవుల కాపరిగా మీతో కలిసి ఆడుకుంటాను. ఆ సమయంలో మీ కోతిచేష్టలు కనబరుద్దురుగాని" అని వరాన్ని ఇచ్చాడట. "నీ ఆకార విశేషాలు, రూప లావణ్యములు మమ్ములను మోహపరవశులను చేస్తున్నాయి. అందుచేత నిన్ను ఒక పర్యాయము కౌగిలించుకొనే వరాన్ని మాకిచ్చి మా కోరికను సఫలం చేయవలసినది"- అని సమస్త కోరికలు త్యజించిన మహర్షులు కోరినారట. అందులకు శ్రీరాముడు "ఈ అవతారంలో నా కౌగిలి భాగ్యము ఒక్క సీతాదేవికి మాత్రమేగాని అన్యులకు లభించే అవకాశంలేదు. ముందు వచ్చే శ్రీకృష్ణావతారంలో మీరందరు గోపికలుగా జన్మించి నా కౌగిలి సౌఖ్యాన్ని పొందగలుగుతారు"- అని అనుగ్రహించాడట. అందుచేతనే "రమయతి మోదయతి రూపసంపదేతి రామః"- తన రూప లావణ్యాదులచేత అందరను సంతోషపెట్టువాడు రాముడు అనువ్యుత్పత్తి కలిగింది. అంతేగాక "పుంసాం మోహనరూపాయ"- పురుషులను గూడా మోహింపజేయగల రూపముగలవాడు శ్రీరాముడు అనే ప్రసిద్ధిని పొందాడు. ఇక మిగిలింది హనుమంతుడు.

మీ నామస్మరణ రుచి నన్ను పరవశుణ్ణి చేస్తోంది. ఆ రుచి అమృ

తమువలె నన్నానందింపజేస్తోంది. ఆ అమృత ప్రవాహం ఎక్కడ పుడు తుందో తెలుసుకోవాలని ఎంత ప్రయత్నించినా, ఎంత దూరం పోయినా ఆ అమృత ప్రవాహం యొక్క పుట్టుకస్థలం దొరకడంలేదు. ఆ పుట్టుక ప్రదేశాన్ని తెలుసుకోవాలంటే ఒక కల్పాంతం ఆయుర్దాయం కావాలని పిస్తోంది. కనుక ఆ అమృత ప్రవాహ జన్మస్థలాన్ని తెలుసుకునేటందుకై కల్పాంతము జీవించియుండేటట్టుగా వరం కోరినాడట శ్రీరామభక్త హనూమాన్. అందులకు శ్రీరామచంద్రుడు ఆ పరమభక్తాగ్రగణ్యునకు ఆ వరాన్ని అనుగ్రహించాడట. రామనామ స్మరణ మాహాత్మ్యము, రుచి, హనుమంతునకు కూడా సమగ్రంగా లభించకపోయిన కారణంచేతనే "శ్లో" శ్రీ రామనామమాహాత్మ్యం సర్వం జానాతిశంకరః అనియు "శ్లో॥ నజానే జానకీజానే, రామత్వన్నామవైభవమ్। సర్వేశోభగవాన్ శంభుః। వాల్మీకి ర్వేత్తివానవా"- శ్రీరామనామమాహాత్మ్యము సంపూర్ణముగా తెలుసుకొన్నది శంకరుడే అనియు, శ్రీరామనామవైభవము సర్వము శంకరునకే తెలుసు ననియు మొదలగు పెద్దల వాక్యాలు కనబడతాయి. అంతేగాక

శ్లో॥ జానాతి రామ తవనామ రుచింమహేశో
జానాతి గౌతమసతీ చరణ ప్రభావమ్
జానాతి దోర్బలపరాక్రమ మీశచాపో
జానాత్యమోఘపటు బాణగతింపయోధిః॥

—నీ యొక్క నామరుచి మహేశ్వరునకును, నీ పాదకమల ప్రభావము అహల్యకును, నీయొక్క బాహుబల పరాక్రమము శివధనుస్సు నకును, నీయొక్క అమోఘమైన బాణప్రయోగ ప్రభావము సముద్రము నకును తెలుసును అనియు,

శ్లో॥ జానామి రామ తవతత్త్వగతిం హనూమాన్
జానాతి ధామ తవసఖ్యగతిం కపీశః

జానాతి రామ తవయుద్ధగతిం దశాస్యో
జానాతి రామ ధనదానుజ ఏవసత్యమ్॥

—హే! రామచంద్రా! నీయొక్క తత్త్వజ్ఞానము హనుమంతునకును, నీయొక్క స్నేహమార్గము సుగ్రీవునకును, నీయొక్క యుద్ధగమనము దశకంఠునకును, నీయొక్క సత్యవాక్య పరిపాలనక్రమము విభీషణునకును బాగుగా తెలుసును—ఇత్యాదిగా ఆచార్యులు వర్ణించియున్నారు. ఇట్టి మహావాక్యముల వలననే

"రామనామంబు ముక్తికి రాజపథము"— అనియు

తే।గీ॥ రమణి! యవశముచేనైన రామనామ
మమర కీర్తింపబడుచుండ నఖిలపాత
కములచే విడ్వబడు నుమ్మసుమతియపుడె॥

—ఇత్యాది చక్కని సూక్తులు వెలువడ్డాయి. ఇక్కడ ఇంకొక విశేషముంది.

శ్లో॥ రామచంద్ర తవనామ జపంతః
పామరా అపితరంతి భవాబ్ధిమ్
అంగసంగి భవదంగుళిముద్రః
కింవిచిత్ర మతరత్కపిరబ్ధిమ్॥

—ఓ రామచంద్రా నీనామ జపం చేసిన పామరులు కూడా సంసార (తిరిగి జన్మఎత్తుట అనే) సముద్రాన్ని దాటగలుగుతూంటే, నీవు ధరించినట్టియు, సీతాదేవికి ఆనవాలుగా నీయవలసినదనుచు నీవు హనుమంతునకిచ్చినట్టియు ఉంగరమును దగ్గర జాగ్రత్త పరచుకొన్నమాత్రాన మారుతికి రావణాసురుని లంకాపట్టణంలో ఉన్న సీతాదేవిని చూచివచ్చుటకై సముద్రాన్ని దాటడానికి శక్తి కలిగిందంటే వింత ఏమున్నది-అంటున్నారు శంకరభగవత్పాదులు.

శ్రీరామనామ సంకీర్తనవల్ల పుట్టిన రుచి మూలంగానే గోపన్న, త్యాగరాజు మొదలగువారు వాగ్గేయకారులైనారు. వీరు రాగతాళములతో మేళగించి తాము ఉత్తేజితులై లోకాన్ని ఉత్తేజపరచగల కీర్తనలను రచింపగలిగారు అని శ్రీరామచరణ్ కుందుర్తి వేంకటనరసయ్య పాకయాజిగారు ప్రవచించారు. అలాగే వాల్మీకిని ఆదర్శంగా తీసుకొని పోతన, తులసీదాసు మొదలగు మహాభక్తులు భక్తిరసం చిప్పిలే గ్రంథాలను రచించి లోకానికి మహోపకారం చేశారు. ఈ విషయాన్నే ఒక ఆంధ్ర మహాకవి-

సీ॥ దారిటక్కరి రాముఁదల్లక్రిందుగఁబాడి
పుట్టతో మోక్షవిభూతిగనఁడె
చెఱలోన రామసంస్మరణంబుగావించి
గోపన్నబంధంబుఁబాపుకొనఁడె
మగ్గమున్ రామనామముతోడనాడించి
భక్తకబీరుండు ముక్తిఁగొనఁడె
రామకథాసుధారస పానరసికుఁడై
తులసిదాసుఁడు రాముఁగలిసికొనఁడె
రామనామ నిరంతరారాధనైక
మాధురీసాధురీతుల మరగి తనిసి
ప్రకృతిలోన నాత్మారామపదముదక్క
నొండుగనలేని యూంజనేయుండులేఁడె॥

—అని కీర్తిస్తున్నాడు. ఇక

శ్లో॥ రామచంద్ర చరితామృతపానం
సోమపాన శతకోటిసమానమ్
సోమపాన శతకోటిభిరీయా
జ్జన్మనైతి రఘునాయకనామ్నా॥

— శ్రీరామచంద్రుని స్మరిస్తూ ఆతని చరిత్ర అనే అమృతాన్ని పానం చేయడమనేది నూరుకోట్ల యజ్ఞాలుచేసి ఆ యజ్ఞాల ఫలాన్ని మనకు ప్రసాదించే సోమపానం చేసినదానితో తులతూగుతుందట. అంతేకాదు· నూరుకోట్ల యజ్ఞాలఫలాన్ని మనకు ప్రసాదించే సోమపానం చేసినవారికి కూడా మరల జన్మ ఉంటుందట కాని శ్రీరామచరితామృతపానం చేసిన భక్తులకు తప్పక జన్మవిముక్తి కలిగి మోక్షమే లభిస్తుందట.

అంశావతారాలుగాక సంపూర్ణావతారాలుగాను, అభేదం చెప్పుకో దగిన అవతారాలుగాను పరిగణింపబడిన రామకృష్ణుల నామస్మరణ వలన గలిగే ఫలితాన్ని వివరించడంలో రామనామస్మరణ మహత్త్వమును పై శ్లోకం విశదంగా తెలియజేస్తే శ్రీకృష్ణనామ స్మరణ మహత్త్వమును ఈ క్రింది శ్లోకంపై శ్లోకం వలెనే వివరంగా తెలియజేస్తుంది. అవలోకించండి·

శ్లో॥ ఏకస్య కృష్ణస్య సకృత్ప్రణామో
దశాశ్వమేధావ భృధేనతుల్యః
దశాశ్వమేధీ పునరేతిజన్మ
కృష్ణ ప్రణామో నపునర్భవాయ॥

— ఒక్క పర్యాయము ఆర్తితో ఏకాగ్రచిత్తంతో "కృష్ణా" అని స్మరిస్తే పది అశ్వమేధయాగములుచేసి అవభృధ స్నానములు చేసినందు వల్ల గలిగే ఫలితాన్ని పొందుతారట. అంతేగాక దశాశ్వమేధాలుచేసి ఫలితాన్ని పొందిన మహామహుడు తిరిగి జన్మ ఎత్తవలసినదేనట. కాని కృష్ణ నామ స్మరణ గావించిన మహాభక్తునకు పునర్జన్మ లేదట.

సమస్త ప్రాణికోట ప్రాణాలను హరించే యమధర్మరాజుకూడా.

తే॥గీ॥ పద్మనయనుమీద భక్తియోగంబెల్ల
ముక్తియోగమనుచు మొదలెఱుంగు

వారివారివారివారిఁజెందిన వారి
త్రోవదలఁపవలదు దూతలార॥

అనుచు తన సేవకులకు హితవు బోధించి ఆజ్ఞాపించినాడట.

"రామ, రామ". అనుచు జపించనక్కరలేకుండా ఆ అక్షరాలను తలక్రిందుచేసి ఉచ్చరించినా సంపూర్ణ ఫలమే కలుగుతుందని వాల్మీకి చరిత్రలో మనం తెలిసికొన్నాము. ఆ మహాభక్తుడు "రామ" అనే మహా మంత్రాన్ని తలక్రిందుగా "మరా, మరా" అని ఉచ్చరించి మహర్షి అయి నాడు గదా. అందుకే మన తెలుగుభాషలో భార్యను "వశి, వశి" అని పిలిస్తే మంచిదన్నారు. ఉద్దేశపూర్వకం కాకపోయినా, వశి, వశి అని కొన్ని మార్లు ఉచ్చరించిన "శివ, శివ" అగుచున్నదిగదా! ఏదో ఒక విధంగా "రామ, శివ" అనే నామాల్లో ఏదో ఒకదానిని (రెండు నామములకు భేదం లేదుకాబట్టి) ఉచ్చరింపజేసి ముక్తిని కరతలామలకం చేద్దామని మన పెద్దల సంకల్పం. అందులోను, భార్యను ఏదో ఒక పనికి పిలవడం తప్పదుగదా అందుచే శివనామస్మరణ చేసిన ఫలితం మనకు కలిగిద్దామని వారిఉద్దేశము. ఇప్పుడు మనము ప్రకృతానికి వద్దాము.

నోరులేని జంతువులను హింసిస్తూ, చంపుతూ వాటి మాంసాన్ని అమ్ముకొని అడవులలో జీవితాన్ని గడిపే కిరాతులు కొందరు ఈ క్రింది మాటలు అనుకుంటున్నారట.

శ్లో॥ వనేచరామః వసుచాహరామః
నదీస్తరామః నభయంస్మరామః

—వనే = అడవులయందు; చరామః = సంచరించుచుదము; వసు చాహరామః = ధనాన్ని దొంగిలించుచుదము; నదీః + తరామః = నదులను

దాటువదము: భయానన్మరామః = భయము అను మాటను మనము స్మరింప వలసిన పనిలేదు.

ఇందు చ రామః అను క్రియాపదములో రామ అను వర్ణద్వయ మున్నది అల్లే హ రామః త రామః స్మ రామః అను మూడు క్రియా పదములలోను గూడ "రామ" అను రెండక్షరములున్నవిగదా! ఆ కిరా తులు వారు మాట్లాడుకునే మాటల్లో "రామ" మంత్రమున్నదని వారికి తెలియనివారు ఆ మంత్రాన్ని మనము ఉచ్చరిస్తూ వున్న దృష్టి వారికి లేక పోయినా

శ్లో॥ ఇతీరయంతోఽపి వనేకిరాతాః
ముక్తిగతాః రామపదానుషంగాత్॥

—ఏదో విధంగా "రామ" అనే రెండక్షరములను ఉచ్చరించిన మాత్రాన (తెలిసి తాకినా తెలియక తాకినా అగ్ని కాల్చివేయునన్నటుగా) ఆ కిరాతులు ముక్తిని పొందారట అందుచేతనే "రామనామంబు ముక్తికి రాజపథము" అన్నారు. "రామో విగ్రహవాన్ ధర్మః" —రూపమును ధరిం చిన ధర్మమే శ్రీరామచంద్రమూర్తి గనుకనే "రామ" అనే రెండక్షరాలలో గొప్ప మహత్త్వము, శక్తి ఉంది.

శ్లో॥ శ్రీరామనామ మాహాత్మ్యం। సర్వం జానాతిశంకరః
తదర్ధంగిరిజావేత్తి। అగస్త్యోవేత్తి తత్త్వతః

—శ్రీరామ స్మరణమాహాత్మ్యము సంపూర్ణంగా తెలిసినవాడు శంకరుడైతే అందులో సగం మాత్రమే పార్వతీదేవికి తెలుసునట. అందు చేత ఆ మహాతల్లి, శక్తిస్వరూపిణి లోకోపకారార్థమై శంకరుణ్ణి ఈ క్రింది విధంగా ప్రశ్నిస్తుందట

శ్లో॥ కేనోపాయేనలఘునా।విష్ణోర్నామ సహస్రకమ్
పఠ్యతే పండితైర్నిత్యం। శ్రోతుమిచ్ఛామ్యహంప్రభో॥

—ఓ ప్రభువైన పశుపతీ! సులువైన (తేలికయైన) ఏ ఉపాయం చేత విష్ణుసహస్రనామ పారాయణ చేసినందువల్ల గలిగే ఫలితం వస్తుందో నాకు సెలవీయవలసినదిగా ప్రార్థిస్తున్నాను. అని అడిగినప్పుడు శివుడు ఈ క్రింది విధంగా ఆమెకు విశదపరచినాడట.

శ్లో॥ శ్రీరామరామరామేతి। రమేరామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం। రామనామవరాననే॥

ఓ ప్రియమైన పార్వతీ! "శ్రీరామ" అని జపించినట్లైతే విష్ణు సహస్రనామ పారాయణ చేసిన ఫలితం సంపూర్ణంగా లభిస్తుంది- అని తేలిక మార్గాన్ని ఉపదేశిస్తాడు. ఇదే తారకమంత్రము. ఈ మంత్రాన్నే భక్త కబీరు మన గోపన్నకుపదేశింపగా, గోపన్న ఆ మంత్రాన్నే జపించి ముక్తి పొందుతాడు ఈ విషయమే

శ్లో॥ నామ్నాం సహస్రం దివ్యానాం। స్మరణే యత్ఫలంలభేత్
తత్ఫలం లభతేనూనం। రామోచ్చారణమాత్రతః॥

—అనే శ్లోకమూలంగా కూడా వ్యక్తమౌతోంది.

ఇట్టి విషయాలు సమగ్రంగా తెలిసికొని, అహంకార మమకారాలనే మాయలోబడక భక్తితో, ఏకాగ్రచిత్తంతో శ్రీరామనామస్మరణ చేస్తూ ఉండాలి.

శ్లో॥ మాతారామో మత్పితా రామచంద్రః
భ్రాతారామో మత్సఖా రాఘవేశః
సర్వస్వం మే రామచంద్రో దయాలుః
నాన్యం జానే నైవజానే నజానే॥

—నా తల్లి, తండ్రి, సోదరుడు, స్నేహితుడు, సర్వము దయగల మహానుభావుడు శ్రీరామచంద్రుడే కాని వేరు దైవమును నేనెరుగనే ఎరు

గను; నేనెరుగను- అనే సుస్థిరభావన మనకు కలగాలి. అట్టి భావన కలిగి నప్పుడే మనకు తప్పక మోక్షముతోసహా సర్వైశ్వర్యములు లభింపగలవు.

మా కుమార్తెలు చి।సౌ। లక్ష్మీసువర్చల, M.A., M.PHIL, చి।సౌ। సీతామహాలక్ష్మి, M.A., B.Ed., రచించిన ఈ దాశరథి శతక ప్రతిపదార్థ భావాల్లో గల దొసగులను మన్నించండి. ఈ ప్రతిపదార్థ భావ రచన గావించిన మా కుమార్తెలను, వారి భర్తలను, వారి సంతానమును భద్రగిరి నివాసుడైన శ్రీ సీతారామచంద్రమూర్తి సర్వదా కాపాడుచు వారికి ఆయురారోగ్యైశ్వర్యాలనిచ్చి రక్షించవలసిందిగా ప్రార్థిస్తున్నాను. ఈ సందర్భంలో నాకు తెలిసినంతవరకు భక్తులైన పాఠకలోకానికి అందించడం సమంజసం కాకపోదనియెంచి "శ్రీరామనామస్మరణ మాహాత్మ్యాన్ని రచించిన నన్ను భగవదనుగ్రహ పాత్రునిగా ఆశీర్వదించగలందులకు మిమ్ములను వేడుకొనుచున్నాను.

ఇట్లు

భక్తజనపాదరేణువు

విద్వాన్ వేమూరి వేంకటరామయ్యశర్మ

ఎం. ఏ.

# ఛన్దము

నిశ్శ్రేయసోపాయమగు భక్తి భావమునకు దాశరథి శతక మాశ్రయము భక్తాగ్రేసరుడు శ్రీ కంచెర్ల గోపన్న రచించిన యీ శతకమునకు సోదరీయుగళము శ్రీమతి లక్ష్మీసువర్చల, శ్రీమతి సీతామహాలక్ష్మి రచించిన ప్రతిపదార్థ భావముల నవలోకించి సంతసించితిని. ఈ పుస్తకమునకు మొదట పీఠికయు, శ్రీరామనామస్మరణ మాహాత్మ్యమును పొందుపరచ బడినవి. మాతృభాషయందేని పద్యరచన దుర్బోధమై కేవల వ్యావహారిక వచన మాత్రమునే చదివి అర్థమొనర్చుకొనగలిగిన చాలమందికి భాషా జ్ఞానమును సంపాదించుటకీ యర్థభావ వివరణము దోహదమొనర్చు చున్నది.

సంస్కృతాంధ్ర సాహిత్య పరిచయము లేనివారి కర్థముగాని పద్యము లీ శతకమున చాల గలవు.

అర్థభావ వివరణావశ్యకములగు పెక్కు ప్రబంధములున్నను, భక్తిభావ ప్రవణములగు నీ రచయిత్రీ యుగళ హృదయముల నీ శతకమే యాకర్షించినది. ప్రతిపద్యభావ ప్రారంభమునగల సంబుద్ధిద్వయమే యిందులకు ప్రమాణము. ధర్మమూర్తియగు శ్రీరామచంద్రుని కల్యాణ గుణవర్ణనమున కాస్పదమై ప్రపన్నుడు నార్తుడునగు గోపన్న యొక్క హృదయగుహ నుండి వెలువడి భక్తితరంగితమగు నీ శతకము హిమాలయమునుండి ప్రవహించు గంగా ప్రవాహము పగిది వినిర్మల శిశిర మధుర రస సంభరితము.

ఇందలి పీఠిక శతక వాఙ్మయ ప్రాదుర్భావవికాసాదికమును వివరించుచు చారిత్రక విషయ పరిజ్ఞానమునకు దోహదమొనర్చుచున్నది

ఇందు పొందుపరచబడిన శ్రీరామనామస్మరణ మాహాత్మ్యము గోక్షీరమునకు చక్కెర కలిపినట్లు గ్రంథమునకు మాధుర్యాతిశయమును సంతరించుచున్నది. అంతియేకాక బంగారమునకు తావియబ్బినట్లు పొత్తము నకు నూత్న పరిమళభరము నలముచున్నది. -

ఇతి

నివేదయితా

(Sd) రాం॥శ్రీనివాసాచార్యః

భాష్యాన్తవైయాకరణః

భాషాప్రవీణః

అష్టావధానీ

M.A. (సంస్కృతసాహిత్యే)

# అభిప్రాయము

నదులు, గిరులు ఉన్నంతవఱకు "రామకథ" గానము చేయబడు చుండును. కంచెర్ల గోపన్నగారు రామభక్తుడు. గోపన్నగారి పేరుకన్న, వారికి "రామదాసు" అను పేరే ప్రసిద్ధము. అంతటి రామభక్తుడన్నమాట ఆయన కీర్తనలలో ఆర్తి కన్పించును. తెలుగునాట స్త్రీ పురుషులచే నవి గానము చేయబడుచుండుట ఒక యదృష్టము. "భజనపాళీ"లలో అవి మిక్కిలి ప్రచారమునందినవి ఆంధ్ర వాఙ్మయములో, సంకీర్తనములలోనివి ప్రథమ స్థానము వహించినవని నా అభిప్రాయము.

గోపన్నగారి మఱియొక రచన "దాశరథీ శతకము." శతకములలో ననన్యప్రచారముకల సులభ సుందరశతకము. నా చిన్నతనములో, వీధి బడులలో, తొలుత కృష్ణశతకము, తర్వాత సుమతి శతకము (కందపద్య శతకములు) చెప్పెడివారు. పిమ్మట దాశరథీ శతకమును చెప్పెడివారు.

(వృత్తశతకము). ఆ తర్వాత వేమనశతకము కాని నరసింహశతకము కాని చెప్పెడివారు. కనుక, దాశరథీ శతకము కంఠస్థమైయుండెడిది. ఇప్పుడా బడులు లేవు కనుక వాచకములలో పరిమిత పద్యములేయుండును కనుక, దాశరథీశతక ప్రచారము విశేషముగా కావలసియున్నది.

కీర్తిశేషులు, నటులు, వాయులీనవిద్వాంసులు, ఆంధ్రప్రభ సంపాదకులు నయిన నీలంరాజు వెంకటశేషయ్యగారు, ఆంధ్రప్రభద్వారమున, భద్రాద్రిరామునికి విరాళములు వసూలుచేసినారు. తిరువాయూరులో త్యాగరాజోత్సవములు జరుగురీతిని, భద్రాచలములో రామదాసోత్సవములు జరుగవలెనని సంకల్పించిరి. ఫలితముగా రామదాస ధ్యానమందిరము వెలసినది. అచటి కుడ్యములపై దాశరథీ శతక పద్యములను చెక్కించిరట. ఆకాశవాణి విజయవాడ కేంద్రమువారు శ్రీరామనవమినాడు శ్రీరామకల్యాణము ప్రత్యక్షవ్యాఖ్యానము చేయుట హర్షింపదగినది. ఆనాడు ఆ కల్యాణము జరిగిన తర్వాతనే భోజనముచేయు భక్తులు పెక్కుమంది కలరు. ఆంధ్రమున రామభక్తి యట్టిది. భద్రాద్రిరాముని విగ్రహము కూడ మిగిలినవానికంటె విలక్షణమైనది.

గోపన్నగారికిగాని, త్యాగరాజుగారికిగాని, పోతనగారే లక్ష్యభూతులయినట్లు కన్పించుచున్నది. కాగా, త్యాగరాజుగారి కృతులు సంగీతమునకు బీజాక్షర రూపములైనవి. "దాశరథీ! కరుణాపయోనిధీ!! యనెడి మకుటమే చమత్కార జనకముగానున్నది. ఆకర్షకముగానున్నది.

దాశరథీ శతకమునకు అర్థతాత్పర్యములు పెక్కుమంది వ్రాసిరి. కాని ఈ గ్రంథపద్ధతి విలక్షణమైనది. అర్థములను తూచిచెప్పుటయేకాక భావమునందు ప్రథమభాగమున నొక విలక్షణమైన సంబోధనలు కలవు. ఈ గ్రంథమునకు వన్నెతెచ్చునది శేషఫణిశర్మగారి మున్నుడి. వారు శతక చరిత్రమును చెప్పుటయేకాక శతకమున నేపద్యములను నేశ్లోకములు

ప్రభావితముచేసినవో చెప్పిరి. పరిశోధనా పద్ధతిలో నా వ్యాసము సాగినది. సాహితీపరుల కుపయుక్తమైనది. శ్రీరామనామస్మరణ మాహాత్మ్యము శ్రీ వేమూరి వెంకటరామయ్యగారి రచన. బహువిషయ పరిజ్ఞానముతో నడచిన ధార్మికోపన్యాసముగా నున్నది.

శతకములు ప్రధానముగా ఆరాధనారూపములు. ఈ శతకము రామభక్తి ప్రధానమైనది కనుక శ్రీరామనామస్మరణ, వైశిష్ట్యము ముందుండుట ఉచితముగనున్నది. ఇట్టి యమూల్యమైన పీఠికలతో దాశరథీ శతకమింతవఱకు వెలువడలేదు. చివరికొకమాట.

దేశములో కొన్ని ప్రవాదములు బలముగానున్నవి. (1) శ్రీనాథుడును పోతనయు బావమఱుదులనుట. ఇద్దఱికిని యొక శతాబ్దమంతర మున్నది. సినీమాలవారు దీనికి వారి కథ కొఱకు బలమును చేకూర్చిరి. (2) అట్లే రామదాసునకు కబీరు గురువనుట. దీనికి నాటకమువారు బలమును చేకూర్చిరి. "ఆంధ్ర గంధర్వ శ్రీ జొన్నవిత్తుల శేషగిరిరావు గారు కబీరు పాత్రను పోషించిరి. ఇద్దఱకును కాలవ్యత్యాసమున్నది. గోపన్నగారు "రఘునాధభట్టరాచార్యుల కంజలించి"యని చెప్పికొనినారు. కాని కబీరును గురువుగా పేర్కొనలేదు. మంత్రగురువగుట కవకాశము లేదు. ఒకవేళ ఇద్దఱు రామదాసులు, ఇద్దఱు కబీరులు ఉండిరేమో తెలియదు. కబీరును రామభక్తుడు కావచ్చును. గోపరాజు కూడా రామభక్తుడే కదా!

స్వస్తి

(Sd) పైడిపాటి సుబ్బరామశాస్త్రి
కవి సమ్రాట్, మహోపాధ్యాయ, శతావధాని
విద్వాన్, B.A. + Double P.O.L.

— )o( —

శ్రీ రామ

# శ్రీ దాశరథి శతకము

**1) శ్రీ రఘురామ! చారుతులసీదళదామ! శమక్షమాది శృం**
**గార గుణాభిరామ! త్రిజగన్నుత శౌర్యరమాలలామ! దు**
**ర్వార కబంధ రాక్షస విరామ! జగజ్జన కల్మషార్ణవో**
**త్తారకనామ! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ॥**

**ప్రతిపదార్థము –**

శ్రీ రఘురామ=పవిత్రమైన రఘు వంశమున బుట్టిన శ్రీరామా; చారు=ఒప్పిదమైన; తులసీదళ=తులసీదళములచే కూర్చబడిన; దామ=హారము గలవాడా; శమ, క్షమ+ఆది=శాంతి ఓర్పు మొదలుగాగల; శృంగారగుణ+అభిరామ=శృంగార గుణములచే మనోజ్ఞమైనవాడా; త్రిజగత్+నుత=ముల్లోకములచే స్తుతింపబడిన; శౌర్య, రమా, లలామ=శ్రేష్ఠమైన శౌర్యలక్ష్మిచే కూడినవాడా; దుర్వార=జయింపశక్యముకాని; కబంధరాక్షసవిరామ=కబంధుడను రాక్షసుని సంహరించినవాడా; జగత్+జన=లోకమునందలి ప్రజలయొక్క; కల్మష+అర్ణవ=పాపములనెడు సముద్రమును; ఉత్తారకనామ=దాటింప సమర్థమైన నామముగలవాడా; భద్రగిరి దాశరథీ=భద్రాదిని నివాసముగా జేసికొన్న దశరథరామా; కరుణాపయోనిధీ=దయాసముద్రుడా;

ప్రభావితముచేసినవో చెప్పిరి. పరిశోధనా పద్ధతిలో నా వ్యాసము సాగినది. సాహితీపరుల కుపయుక్తమైనది. శ్రీరామనామస్మరణ మాహాత్మ్యము శ్రీ వేమూరి వెంకటరామయ్యగారి రచన. బహువిషయ పరిజ్ఞానముతో నడచిన ధార్మికోపన్యాసముగా నున్నది.

శతకములు ప్రధానముగా ఆరాధనారూపములు. ఈ శతకము రామభక్తి ప్రధానమైనది కనుక శ్రీరామనామస్మరణ, పైశిష్ట్యము ముందుండుట ఉచితముగనున్నది. ఇట్టి యమూల్యమైన పీఠికలతో దాశరథీ శతకమింతవఱకు వెలువడలేదు. చివరికొకమాట.

దేశములో కొన్ని ప్రవాదములు బలముగానున్నవి. (1) శ్రీనాధుడును పోతనయు బావమఱుదులనుట. ఇద్దఱికిని యొక శతాబ్దమంతర మున్నది. సినీమాలవారు దీనికి వారి కథ కొఱకు బలమును చేకూర్చిరి. (2) అట్లే రామదాసునకు కబీరు గురువనుట. దీనికి నాటకమువారు బలమును చేకూర్చిరి. "ఆంధ్ర గంధర్వ శ్రీ జొన్నవిత్తుల శేషగిరిరావుగారు కబీరు పాత్రను పోషించిరి. ఇద్దఱకును కాలవ్యత్యాసమున్నది. గోపన్నగారు "రఘునాధభట్టరాచార్యుల కంజలించి"యని చెప్పికొనినారు. కాని కబీరును గురువుగా పేర్కొనలేదు. మంత్రగురువగుట కవకాశము లేదు. ఒకవేళ ఇద్దఱు రామదాసులు, ఇద్దఱు కబీరులు ఉండిరేమో తెలియదు. కబీరును రామభక్తుడు కావచ్చును. గోపరాజు కూడా రామభక్తుడే కదా!

స్వస్తి

(Sd) పైడిపాటి సుబ్బరామశాస్త్రి
కవి సమ్రాట్, మహోపాధ్యాయ, శతావధాని
విద్వాన్, B.A. + Double P.O.L.

— )o( —

శ్రీ రామ

# శ్రీ దాశరథి శతకము

1) శ్రీ రఘురామ! చారుతులసీదళదామ! శమక్షమాది శృం
గార గుణాభిరామ! త్రిజగన్నుత శౌర్యరమాలలామ! దు
ర్వార కబంధ రాక్షస విరామ! జగజ్జన కల్మషార్ణవో
త్తారకనామ! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము —

శ్రీ రఘురామ=పవిత్రమైన రఘు వంశమున బుట్టిన శ్రీరామా; చారు=ఒప్పిదమైన; తులసీదళ=తులసీదళములచే కూర్చబడిన; దామ= హారము గలవాడా; శమ, క్షమ+ఆది=శాంతి ఓర్పు మొదలుగాగల; శృంగారగుణ+అభిరామ=శృంగార గుణములచే మనోజ్ఞమైనవాడా; త్రిజగత్+నుత=ముల్లోకములచే స్తుతింపబడిన; శౌర్య, రమా, లలామ= శ్రేష్ఠమైన శౌర్యలక్ష్మిచే కూడినవాడా; దుర్వార=జయింపశక్యముకాని; కబంధరాక్షసవిరామ=కబంధుడను రాక్షసుని సంహరించినవాడా; జగత్+ జన=లోకమునందలి ప్రజలయొక్క; కల్మష+అర్ణవ=పాపములనెడు సముద్రమును; ఉత్తారకనామ=దాటింప సమర్థమైన నామముగలవాడా; భద్రగిరి దాశరథీ=భద్రాద్రిని నివాసముగా జేసికొన్న దశరథరామా; కరుణా పయోనిధీ=దయాసముద్రుడా;

భావము :-

భద్రగిరిని నివాసస్థానముగా చేసికొన్న ఓ శ్రీరామా ! దయా సముద్రుడవైన సీతారామా ! శ్రీ రఘువంశమున బుట్టినవాడా ! పవిత్ర మైన తులసీదళముల దండను ధరించినవాడా ! ఇంద్రియ నిగ్రహము ఓర్పు మొదలగు సుందరమైన గుణములచే ఆనందము నిచ్చువాడా ! త్రిలోకవాసులచేత కొనియాడబడునట్టి శౌర్య సంపద గలవాడా! జయింప శక్యముకాని కబంధుడను రాక్షసుని చంపినవాడా ! సమస్తలోకవాసులను వారి పాపములనెడు సముద్రము నుండి వెలికితీసి రక్షించు నామమును ధరించినవాడా ! (నన్ను దయజూడుము)

2) రామ! విశాల విక్రమ పరాజిత భార్గవరామ! సద్గుణ
స్తోమ! పరాంగనావిముఖ సువ్రతకామ! వినీలనీరద
శ్యామ!కకుత్స్థవంశకలశాంబుధిసోమ! సురారిదోర్బలో
ద్దామ విరామ! భద్రగిరి దాశరథీ। కరుణాపయోనిధీ!

ప్రతిపదార్థము :-

రామ = ఓ శ్రీరామా! విశాల = అత్యధికమైన; విక్రమ = పరాక్రమము చేత; పరాజిత = జయింపబడినట్టి; భార్గవరామ = పరశురాముడు గలవాడా! సద్గుణస్తోమ = సద్గుణ సమూహముచే నొప్పినవాడా; పరాంగనా = పరుల భార్యల విషయమై; విముఖ = పరాఙ్ముఖమైన; సువ్రతకామ = మంచి వ్రతమునందిచ్ఛగలవాడా; వినీల = చక్కని నీల వర్ణముగల; నీరద = మేఘమువలె; శ్యామ = నీల వర్ణముగలవాడా; కకుత్స్థవంశ = ఇనకులజుడైన పురంజయుని వంశమనెడు; కలశ + అంబుధి = పాలసముద్రమునకు; సోమ = చంద్రుని వంటివాడా; సుర + అరి = రాక్షసుల యొక్క; దోర్బల +

ఉద్దామ=భయంకరమైన భుజబలమును; విరామ=నాశము గావించువాడా! భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ.

**భావము :-**

ఓ సుగుణాభిరామా! దశరథరామా! అనన్యపతాక్రమముచే పరశురాముని జయించినవాడా! సద్గుణ సముదాయమునకు ఆటపట్టయినవాడా! చక్కని నీలవర్ణము గలిగిన మేఘమువంటి శరీరకాంతి గలవాడా! కకుత్స్థ వంశమనెడు పాలసముద్రము నుప్పొంగజేయు చంద్రుని వంటివాడా! రాక్షసుల బాహుబలమును నాశము చేయువాడా! నన్ను దయజూడుము.

3) అగణిత సత్యభాష! శరణాగత పోష! దయాలసజ్ఝరీ
విగత సమస్తదోష! పృథివీసురతోష! త్రిలోకపూతకృ
ద్గగనధునీ మరంద పదకంజ విశేష! మణిప్రభాధగ
ద్ధగితవిభూష! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ॥

**ప్రతిపదార్థము :-**

అగణిత=లెక్కింప శక్యముకాని; సత్యభాష=సత్యములనే పలుకువాడా; శరణ+ఆగత=రక్షణ కొరకు సమీపించిన వారిని; పోష= రక్షించువాడా; దయా=దయఅనెడు; లసత్+ఝరీ=ప్రకాశమానమైన సెలయేటి నీటిచేత; విగత=నాశము చేయబడిన; సమస్తదోష=పెక్కు పాపములు గలవాడా; పృథివీ సురతోష=బ్రాహ్మణులను సంతోషపెట్టువాడా; త్రిలోక=స్వర్గ, మర్త్య పాతాళములనెడి మూడు లోకములను; పూతకృత్=పవిత్రము చేయునట్టి; గగనధునీ=ఆకాశ గంగయొక్క; మరంద=మకరందముగల; పదకంజ విశేష=పాదపద్మవిశేషము గలవాడా; మణిప్రభా=మణులయొక్క కాంతులచేత; ధగద్ధగిత=ధగధగ

ప్రకాశించునట్టి; విభూష=ఆభరణములు గలవాడా! భద్రగిరి దాశరథీ కరుణా పయోనిధీ....

భావము :—

ఓ భక్తజన పోషా! దీనజనరక్షణ దయావిశేషా! మాట తప్పక లెక్కించ శక్యముకాని సత్యవాక్కులు గలవాడా! వేరుగతిలేదు అని నిన్నే శరణు పొందినవారిని కాపాడువాడా! నీ దయ అనెడు కాంతివంతమైన వెలయేటి నీటిచే సమస్త పాపములను కడిగివేయువాడా! బ్రహ్మజ్ఞాన సంపన్నులను సంతోషపెట్టువాడా! మూడు లోకములను పవిత్రము చేయునట్టి ఆకాశ గంగోదక మనెడు తేనెను స్రవించు పాదపద్మములు గలవాడా! మణుల యొక్క కాంతులచేత చక్కని కాంతితో ప్రకాశించు అలంకారములు గలవాడా! నన్ను దయజూడుము.

4) రంగదరాతి భంగ! ఖగరాజతురంగ! విపత్పరంపరో
త్తుంగ తమఃపతంగ! పరితోషితరంగ! దయాంతరంగ!స
త్సంగ! ధరాత్మజాహృదయ సారసభృంగ! నిశాచరాబ్జమా
తంగ! శుభాంగ! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము :—

రంగత్+అరాతిభంగ=గర్వముచే విజృంభించు శత్రువులను నాశము చేయువాడా! ఖగరాజ తురంగ=పక్షిరాజైన గరుత్మంతుడే వాహనముగా గలవాడా! విపత్+పరంపరా=ఆపదల వరుసలనెడి; ఉత్తుంగ=మిక్కిలి దట్టమైన; తమః=చీకటికి; పతంగ=సూర్యుని వంటివాడా! పరితోషిత=సంతోషపెట్టబడిన; రంగ=పెక్కురతో నిండియున్న రంగస్థలి గలవాడా! దయా+అంతరంగ=దయతో నిండిన మనస్సుగలవాడా!

సత్సంగ=సత్పురుషులతో కూడియుండువాడా; ధరా+ఆత్మజా=సీతాదేవి యొక్క; హృదయ=హృదయమనెడి; సారస=కమలమునకు; భృంగ=తుమ్మెద వంటివాడా! నిశాచర+అబ్జ=రాక్షసులనెడు పద్మములకు; మాతంగ=ఏనుగువంటివాడా; శుభ+అంగ=శుభకరమైన మూర్తి విశేషము గలవాడా! భద్రగిరి దాశరథీ కరుణా పయోనిధీ....

**భావము :—**

ఓ గురుజన వినమితోత్తమాంగా! శ్రీపాదోద్భవగంగా! గర్వముచే పొగరెక్కియున్న శత్రువులను సంహరించువాడా! పక్షిరాజైన గరుత్మంతుడే వాహనముగా గలవాడా! అనేకమైన విపత్తుల వరుసయనెడు గొప్ప చీకటిని పటాపంచలుచేయు సూర్యునివంటివాడా; జనసమూహముతో నిండిన సభను రంజింపజేయువాడా! కరుణతో నిండిన మనస్సు గలవాడా; మహాపురుషుల సంసర్గము గలవాడా; సీతా మహాసాధ్వి హృదయ కమలమందే తుమ్మెదవలె నివసించువాడా! దుష్ట రాక్షసులనెడు తామరలను నాశము గావించు మదపుటేనుగు వంటివాడా! మంగళకరమైన విగ్రహము గలవాడా! నన్ను దయజూడుము.

**5) శ్రీద! సనందనాది మునిసేవిత పాద! దిగంతకీర్తి సంపాద! సమస్తభూత పరిపాలవినోద! విషాదవల్లికాచ్ఛేద! ధరాధినాథకుల సింధుసుధామయపాద! నృత్తగీతాది వినోద! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!**

**ప్రతిపదార్థము :—**

శ్రీద=ఐశ్వర్యము నిచ్చువాడా! సనందన+ఆది=సనందనుడు మొదలుగాగలిగిన; ముని=మునులచేత; సేవిత=సేవింపబడుచున్న;

పాద=పాదములు గలవాడా! దిగంత=దిక్కులయొక్క చివరల వఱకు; కీర్తి సంపాద=సంపాదించిన కీర్తి గలవాడా; సమస్తభూత=సర్వ ప్రాణుల యొక్క; పరిపాల=పాలించి కాపాడుటయందు; వినోద=సంతోషము గలవాడా; విషాద=విచారములనెడు; వల్లికాచ్ఛేద=తీగలను నఱికి వేయు వాడా; ధరాధినాథకుల=రాజుల యొక్క వంశమనెడు; సింధు=సముద్రము నకు; సుధామయపాద=అమృతమయములైన కిరణములుగల చంద్రుని వంటివాడా; నృత్తగీత+ఆది=నాట్యము, సంగీతముఅను లలితకళల చేత; వినోద=ఆనందపడువాడా; భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ ...

భావము :-

ఓ పరమ పవిత్ర పాదపద్మా; ఋషిపుంగవాంతరంగ సద్మా; ధర్మార్థ కామములనెడు త్రివర్గమును ప్రసాదించువాడా: సనందనుడు మొదలుగాగల మహాముని జనులచేత పూజింపబడుచున్న పాదములు గలవాడా; దిగంతముల వఱకు వ్యాపించిన కీర్తిని సంపాదించినవాడా సమస్త చరాచర ప్రపంచమును పాలించుచు రక్షించుటయందు వేడుక గల వాడా; దుఃఖములను నట్టి తీగలను తెగనఱకువాడా; రాజవంశములనెడు సముద్రమునుప్పొంగజేయునట్టి అమృత కిరణములుగల చంద్రుని వంటి వాడా; భక్తితో గావించు నాట్యగీతాదుల యందు వినోదము గలవాడా; నన్ను దయజూడుము.

6) ఆర్యులకెల్ల మ్రొక్కి వినతాంగుఁడనై రఘునాథభట్టరా
చార్యులకంజలెత్తి కవి సత్తములన్ వినుతించి కార్యసా
కర్యమెలర్పనొక్క శతకం బొనఁగూర్చి రచింతునేఁడు తా
త్పర్యమునన్ గ్రహింపుమిది దాశరథీ! కరుణాపయోనిధీ!

**ప్రతిపదార్థము :-**

ఆర్యులకున్+ఎల్లన్=పూజ్యులందఱకును, మ్రొక్కి=నమస్కరించి; వినత+అంగుడనై=శరీరమును నమ్రతతో వంచినవాడనై; రఘునాథభట్టరాచార్యులకున్=రఘునాథభట్టరు అను పేరుగల గురుదేవులకు; అంజలి+ఒత్తి=దోసిలిఘటించి; కవి సత్తములన్=కవిశ్రేష్ఠులను; వినుతించి=స్తుతించి; కార్యసౌకర్యము+ఎలర్పన్=కార్యసాఫల్యము నందుటకు; నేఁడు=ఈ దినమున; ఒక్క శతకంబున్=ఒక శతకమును; ఒనగూర్చి=చేర్చి; రచింతున్=రచియింతును; ఇది=ఈ శతకమును; తాత్పర్యమునన్=నా అభిప్రాయమును గుర్తించిన వాడవై గ్రహింపుము=చేకొనుము; దాశరథీ కరుణా పయోనిధీ ...

**భావము :-**

ఓ భద్రగిరి నివాస శ్రీరామచంద్రా! సద్గుణసాంద్రా! పూజింపదగిన పండితుల కందఱకును నమస్కరించి, మా గురుదేవులైన రఘునాథ భట్టరాచార్యులకు వినయముతో చేమోడ్చి, కవిశ్రేష్ఠులకు అంజలి ఘటించి, పైవారి అనుగ్రహముతో నేను తలంచిన కార్యము సఫలమగునట్లుగా నీపేర నొక శతకము రచింపఁబూనితినిగాన నాభక్తి భావమును గ్రహించిన వాడవై దీనిని దయతో స్వీకరించి నన్నను గ్రహింప వేడెదను.

7) మసగొని రేఁగుబండ్లకును మౌక్తికముల్ వెలవోసినట్లు దు
ర్వ్యసనముజెందికావ్యము దురాత్ములకిచ్చితిమోసమయ్యెనా
రసనకుఁబూతవృత్తి సుకరంబుగఁజేకుఱునట్లువాక్సుధా
రసములు చిల్కఁబద్యముఖ రంగమునందు
నటింపవయ్య! సం
తసమునుజెంది భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!

ప్రతిపదార్థము :-

మనగొని=ఇచ్చగొనినవాడనై: రేగుబండ్లకును = రేగుపండ్లకు సయితము; మౌక్తికముల్=మంచిముత్యములను; వెలబోసినట్లు=మూల్యమిచ్చి కొనిన విధముగా; దుర్వ్యసనముజెంది=దురాశకులోనైనవాడనై: కావ్యమున్=రచనను; దురాత్ములకున్=అవినీతిపరులకు; ఇచ్చితిన్= కృతి ఇచ్చియుంటిని; మోసమయ్యెన్=మోసపోతిని; నారసనకున్=నా నాలుకకు; పూతవృత్తి=పవిత్రత; సుకరంబుగన్=సులభముగా; చేకురు నట్లు=కలుగునట్లు; వాక్సుధారసములు=వాక్కులనెడు అమృతబిందువులు; చిల్క=చిలుకునట్టి; పద్యముఖరంగమునందున్=పద్యములను పల్కు నట్టి ముఖమనెడు రంగస్థలమునందు; సంతసమునుజెంది=సంతోషమును పొంది; నటింపవయ్య=నాట్యమును చేయుమయ్యా; భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ !

భావము :-

ఓ భక్తజన మందారమా! సర్వసద్గుణసారమా! మిక్కిలి ఆశతో సామాన్యపు రేగుపండ్లకు మంచిముత్యములను వెలగానిచ్చి కొనిన విధముగా కావ్యరచన గావించి దుష్టులకు కృతి ఇచ్చి మోసపోతిని. ఓ భక్తజన కల్పద్రుమా! నా నాలుకను పవిత్రమొనర్చి నీవు మిక్కిలి సంతోషమునుజెంది నా వాక్కులందు సుధారసము చిందునట్లుగా పద్యములను రచింపగల శక్తి నాకిచ్చుటకు నా ముఖమందు నిల్చియుండుటకై ప్రార్థింతును.

8) శ్రీ రమణీయహార! యతసీకుసుమాభ శరీర! భక్తమం
దార! వికారదూర! పరతత్త్వవిహార! త్రిలోకచేతనో
ద్ధార! దురంత పాతక వితాన విదూర! ఖరాదిదైత్యకాం
తారకుఠార! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!

ప్రతిపదార్థము :-

శ్రీ రమణీయహార=గొప్పకాంతిచే మనోహరమైన హారము గల వాడా; అతసీకుసుమాభశరీర=అవిసె పువ్వువలె మృదువైన దేహము గలవాడా; భక్తమందార=భక్తులకు కోర్కెలనిచ్చు కల్పవృక్షము వంటి వాడా; వికారదూర=మనోవికారములను జయించినవాడా; పరతత్త్వ విహార=భగవత్స్వరూపమున విహారము గావించువాడా; త్రిలోకచేతనా+ ఉద్ధార=స్వర్గ, మర్త్య, పాతాళలోకములందలి ప్రాణులను ఉద్ధరించువాడా; దురంత=అంతములేని; పాతక వితాన=పాపపు సముదాయమును; విదూర=నాశము గావించువాడా; ఖర+ఆది=ఖరుడు మొదలైన; దైత్య=రాక్షసులనెడు; కాంతార=అడవిని ఖండించునట్టి; కుఠార=గొడ్డలి వంటివాడా; భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ మహాపాతక పరిహారా! ఉపనిషద్రాజమార్గవిహారా! శోభచే సుందరమైన హారమును ధరించినవాడా! అవిసెపూవువలె మృదువైన శరీరము గలవాడా! భక్తుల కోర్కెలను దీర్చు కల్పవృక్షము వంటివాడా!

మనోవికార రహితుడా! భగవత్స్వరూపమున విహారము గావించువాడా! స్వర్గ, మర్త్య, పాతాళములను ముల్లోకములందలి ప్రాణులను ఉద్ధరించు వాడా! అంతము గానరాని పాపపురాశిని నాశము గావించువాడా! ఖరుడు మొదలుగాగల రాక్షసులనెడు అరణ్యమును ఛేదించు గొడ్డలి వంటివాడా! నన్ను రక్షింపుము.

9) దురితలతాలవిత్ర! ఖరదూషణ కాననవీతిహోత్ర! భూ
భరణ కళావిచిత్ర! భవ బంధవిమోచనసూత్ర! చారువి
స్ఫురదరవిందనేత్ర! ఘన పుణ్యచరిత్ర! వినీలభూరి కం
ధరసమగాత్ర! భద్రగిరి దాశరథీ। కరుణాపయోనిధీ!

ప్రతిపదార్థము :-

దురిత లతా=పాపములనెడు తీగలను ఖండించు; లవిత్ర=కొడవలి వంటివాడా; ఖరదూషణ=ఖరుడు దూషణుడు అనెడు; కానన=అడవిని నాశము గావించునట్టి; వీతిహోత్ర=అగ్నిహోత్రము వంటివాడా; భూభరణ కళావిచిత్ర=భూభారమును విలాసముగా ధరించు శక్తి గలవాడా; భవ బంధ విమోచనసూత్ర=సంసారబంధమును వదలించునట్టి విశేషమెఱింగిన వాడా; చారువిస్ఫురత్+అరవిందనేత్ర=సుందరమై వికసించిన పద్మము వంటి నేత్రములు గలవాడా; ఘనపుణ్యచరిత్ర=గొప్పదై పవిత్రమైన చరిత్ర గలవాడా; వినీల=నీలపురంగు గలిగిన; భూరి=గొప్పదైన; కంధర=మేఘముతో; సమ=సమానమైన కాంతిగల; గాత్ర=శరీరము గలవాడా; భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!

**భావము :-**

ఓ భానువంశ పవిత్రా! మహాపాపలతాలవిత్రా! తీగలవంటి పాపములను త్రుంచు శక్తిగల కొడవలి వంటివాడా! ఖరుడు, దూషణుడు అను రాక్షసులనెడు అరణ్యమును దగ్ధము కావించు అగ్నిహోత్రుని వంటివాడా! భూభారమును వహించుటయను కళయందు విచిత్రమైన నేర్పుగలవాడా! సంసారబంధము నుండి విడిపించు మూలసూత్రము నెఱింగినవాడా! అందముగా నుండి వికసించిన పద్మముల వంటి కన్నులు గలవాడా! గొప్ప పవిత్రమైన చరిత్ర గలవాడా! నీలమేఘముతో సమానమైన శరీర ఛాయ గలవాడా! నన్ను కాపాడుము.

**10) కనక విశాలచేల! భవ కానన శాతకుఠారధార! స**
**జ్జన పరిపాలశీల! దివిజస్తుత సద్గుణకాండ! కాండ సం**
**జనిత పరాక్రమ క్రమ విశారద! శారదకందకుంద చం**
**దన ఘనసార సారయశ! దాశరథీ! కరుణాపయోనిధీ॥**

**ప్రతిపదార్థము :-**

కనక విశాలచేల=బంగారు వికారమైన విశాలమైన వస్త్రమును ధరించినవాడా; భవకానన=పుట్టుక అనునట్టి అడవికి; శాత=పదునైన; కుఠారధార=గొడ్డలి యొక్క అంచువంటివాడా; సజ్జన పరిపాలశీల=సత్పురుషులను రక్షించునట్టి స్వభావము గలవాడా; దివిజస్తుత=దేవతలచే నుతింపబడిన; సద్గుణకాండ=మంచి గుణ సముదాయము గలవాడా; కాండ=బాణముల వలన; సంజనిత=పుట్టిన; పరాక్రమ=శౌర్యము యొక్క; క్రమ=పద్ధతియందు; విశారద=నేర్పుగలవాడా; శారదకంద=

శరత్కాల మేఘమువలెను; కుంద=మల్లెపూవు వలెను; చందన=మంచి గంధము వలెను; ఘనసార=కర్పూరమువలెను; సార=శ్రేష్ఠమైన; యశ=కీర్తి గలవాడా; దాశరథీ! కరుణాపయోనిధీ॥

**భావము :-**

ఓ సద్గుణధామా! పరంధామా! గొప్ప బంగారు వెలుగుల వస్త్రమును ధరించినవాడా; పుట్టుక అనెడు అడవిని ఛేదించుటయందు మిక్కిలి వాడియైన గొడ్డలియొక్క అంచువంటివాడా; సత్పురుషులను కాపాడు స్వభావము గలవాడా; దేవతలచేత స్తుతింపబడునట్టి సద్గుణ సముదాయము కలవాడా; బాణముల మూలమున గొప్ప పరాక్రమము ప్రదర్శించు నేర్పు గలవాడా; శరత్కాలమేఘము-మల్లెపువ్వు-శ్రీగంధము-కర్పూరములను వాని వలె మిక్కిలి స్వచ్ఛమై శ్రేష్ఠమైన కీర్తిగలవాడా! దయజూడుము.

**11) శ్రీ రఘువంశ తోయధికి శీతమయూఖుఁడవైన నీ పవి**
**త్రోరు పదాబ్జముల్ వికసితోత్పల చంపకవృత్త మాధురీ**
**పూరిత వాక్ప్రసూనములఁబూజలొనర్చెదఁజిత్తగింపుమూ**
**తారకనామ! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!!**

**ప్రతిపదార్థము :-**

శ్రీ రఘువంశతోయధికి=సంపదతో కూడిన రఘువంశమనెడి సముద్రమునకు; శీతమయూఖుడవు+ఐన=చల్లని కిరణములు గల చంద్రుని వంటి వాడవైన; నీ పవిత్ర+ఉరు+పద+అబ్జములు=నీ యొక్క గొప్పవై, పవిత్రమైన పాదపద్మములను; వికసిత=మిక్కిలి వికాసము చెందిన; ఉత్పలచంపక=కలువ పూవులయొక్కయు; సంపెంగ

పూవులయొక్కయు (ఉత్పలమాలలు, చంపకమాలలు అను) వృత్త = దండలయొక్క (పద్యముల యొక్క): మాధురీ పూరిత = మాధుర్యముచే నిలుపబడిన: వాక్ + ప్రసూనములన్ = మాటలనెడి పుష్పములచేత: పూజ లొనర్చెదన్ = పూజ చేయుదును: తారకనామ = భవసముద్రమును దాటించు నట్టి నావవంటి నామము కలవాడా: చిత్తగింపుమా = అంగీకరింపుము: భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ॥

భావము :-

ఓ భద్రగిరి నివాసా! అయోధ్యాధివాసా! గొప్ప ఐశ్వర్యముతో కూడిన రఘువంశమనెడు సముద్రమును ఉప్పొంగజేయునట్టి చంద్రుని వంటి వాడవైన నీ పవిత్రమైన పాద పద్మములను వికసించిన కలువల చేతను, సంపెంగపూవుల చేతను కూర్చబడిన మాలలచేతను (ఉత్పల చంపకములను వృత్తములచేత) మాధుర్యముచే నిండిన వాక్కులనెడు పుష్పాలచేతను నీకు పూజ గావించెదను. నాయందు దయయుంచి అంగీ కరింపుమా: సంసార సముద్రము నుండియు, పుట్టుకనుండియు రక్షించు నట్టి పరమ పవిత్రమైన నామమును ధరించినవాడా! కరుణింపుము.

12) గురుతరమైన కావ్యరస గుంభన కబ్బురమంది ముష్కరుల్
సరసులమాడ్కి నంతసిలఁజాలుదురోటు! శశాంకచంద్రికాం
కురములకిందు కాంతమణికోటి స్రవించిన భంగి వింధ్య భూ
ధరమున జాలునే శిలలు దాశరథీ! కరుణాపయోనిధీ!!

## ప్రతిపదార్థము

గురుతరమైన=మిక్కిలి గొప్పదైన; కావ్య=కావ్యమునందలి; రస గుంభనకున్=రసముల యొక్క కూర్పునకు; అబ్బురమంది= ఆశ్చర్యమును పొంది; మూఢులు=అజ్ఞానులు; సరసులమాడ్కిన్= సహృదయులవలె; సంతసిలజాలుదురొటు = సంతోషింపజాలుదురా; కళాంక=చంద్రునియొక్క; చంద్రికా+అంకురములకున్ = అప్పుడే ప్రసరించుచున్న కిరణకాంతులకు; ఇందుకాంతమణికోటి=చంద్రకాంత మణుల సముదాయము; స్రవించినభంగిన్=ద్రవించిన విధముగా; వింధ్య భూధరమునన్=వింధ్యపర్వతమునందుగల; శిలలు=రాళ్ళు; జాలునే= కరిగి ప్రవహించునా (ప్రవహింపవని భావము) దాశరథీ! కరుణా పయోనిధీ!!

**భావము :-**

ఓ తరణి కులేశా! కలశాబ్ధినివేశా! లేతవెన్నెల మొలకలకు చంద్ర కాంత మణులు కరిగి స్రవించిన విధముగా వింధ్య పర్వతము నందలి శిలలు స్రవింపజాలవుకదా! అట్లే శృంగారాది నవరసముల కూర్పుగలిగిన గ్రంథములందలి విశేషములకు అచ్చెరు వంది పరవశముగాంచు సరసుల వలె మూఢులు ఆనందింపనేరరుకదా! (అందుచే ఓ దాశరథీ) నా గ్రంథ మును రసికుడవైన నీకే అంకితము గావించెదను గ్రహింపుము.

**13)** తరణికులేశ! నానుడులఁదప్పులు గల్గిన నీదునామ స
ద్విరచితమైన కావ్యము పవిత్రము గాదె? వియన్నదీ
జలం
బరుగుచు వంకయైన మలినాకృతిఁబాఱినఁదన్మ
హత్త్వముఁన్
దరఁగు గణింప నెవ్వరికి ధాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :—

తరణికులేశ=భానువంశపు రాజా! నానుడులన్=నా మాటల యందు; తప్పులు గల్గినన్=దోషములున్నప్పటికిని; నీదు నామ సద్విరచితము+ఐన=నీ యొక్క పేరు నుండి రచింపబడునట్టి: కావ్యము=గ్రంథము (అనగా ఈ కావ్యము); పవిత్రముగాదె=పవిత్ర మైనదికాదా: వియన్నదీజలంబు=ఆకాశగంగ యొక్క ఉదకము, అరుగుచున్=ప్రవహించుచు; వంకయైనన్=వంకరగా పారినను; మలిన+ఆకృతి బాఱినన్=మురికియైన రూపముతో ప్రవహించినను; తత్+మహత్వమున్=దానియొక్క ప్రభావమును; గణింపన్=ఎన్నుటకు; ఎవ్వరికిన్=ఎవరికైనను; తరమే=శక్యమా! (కాదు అని భావము) దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :—

ఓ ఆర్తజన బాంధవా! జనకాత్మజాధవా! సూర్యవంశపుఱేనివైన ఓ దశరథ రామా; నీ పవిత్ర నామమును కూర్చుచు నాచే రచింపబడిన ఈ శతకమున నా అజ్ఞానముచే దోషములు దొరలినను అవి ఒప్పులై పవిత్రములేయగును; ఆకాశగంగ వంకలుగా పారినను, మురికినీటితో ప్రవహించినను ఆ గంగోదక ప్రభావమును వర్ణింప నెవ్వరికిని శక్యము కాదుగదా! అనుగ్రహింపుము.

14) దారుణ పాతకాబ్ధికి సదా బడబాగ్ని, భవాకులార్తి వి
స్తార దవానలార్చికి సుధారసవృష్టి, దురంత దుర్మతా
చార భయంకరాటవికి (జండ కఠోర కుఠారధార నీ
తారకనామ మెన్నుకొన దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము :-

నీ తారకనామము=సంసారబంధము నుండి విడిపింపజేయు "శ్రీరామ" అనెడి నీ నామము; ఎన్నుకొనన్=ఆలోచింపగా; దారుణ పాతక+అబ్ధికిన్=మిక్కిలి భయంకరమైన పాపమనెడు సముద్రమునకు; సదా=ఎల్లప్పుడు; బడబాగ్ని=సముద్రమునందలి చల్లారని అగ్నివంటిది; భవ+ఆకుల+ఆర్తి=సంసారము యొక్క లేదా పుట్టుక యొక్క వ్యాకుల మైన బాధలయొక్క; విస్తార+దవ+అనల+అర్చికిన్=అధికమైన కార్చిచ్చుయొక్క మంటలకు: సుధారస వృష్టి=అమృతరస వర్షమువంటిది దురంత=అంతుగానని; దుర్మత=చెడుమతములయొక్క; ఆచార=పద్ధతి యనెడు; భయంకర+అటవికిన్=భయమును కలిగించు అడవికి; చండ= తీవ్రమైనట్టియు; కఠోర=భయంకరమైనట్టియు; కుఠారధార=గొడ్డలి యొక్క అంచు వంటిది; దాశరథీ! కరుణాపయోనిధీ॥

భావము :-

ఓ భవజలధితారకా! దశకంఠ సంహారకా! నీ శ్రీరామ యను పవిత్రనామము భవ సముద్రమును తరింపజేయునది. ఆ తారకనామమే భయంకరమైన పంచ మహాపాతకములనెడు సముద్రము నడగించు బడ బాగ్ని సమానము ఆ నామమే సంసారము లేక పుట్టుకయందలి పెక్కు బాధలనెడు కార్చిచ్చు మంటలకు అమృతరస వర్షముతో తుల్యము. మితి గానని దుష్టమతముల ఆచారములనెడు భయంకరమైన అరణ్యమును నరికి వేయుటకు తీవ్రమై కఠినమైన గొడ్డలి వాదర వంటిదికదా! నేను వర్ణింప నశక్తుడను.

15) హరునకు నవ్విభీషణున కద్రిజకుందిరు మంత్రరాజమై
కరికి నహల్యకున్ ద్రుపదకన్యకునార్తిహరించుచుట్టమై
పరగినయట్టి నీపతిత పావన నామము జిహ్వపై నిరం
తరము నటింపఁజేయుమిఁక దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము —

హరునకున్ = శంకరునకు; ఆ+విభీషణునకున్ = రావణాసురుని తమ్ముడైన విభీషణునకు; అద్రిజకున్ = హిమవంతుని కుమార్తె యగు పార్వతికి; తిరుమంత్రరాజము+ఐ = సమస్త సంపదలనిచ్చు శ్రేష్ఠమైన మంత్రమై; కరికిన్ = గజరాజమునకు; అహల్యకున్ = గౌతమ మహర్షి కి భార్యయైన అహల్యకు; ద్రుపద కన్యకున్ = ద్రౌపదికి; ఆర్తిన్ + హరించు = మనస్సునందలి వ్యథలను పోగొట్టు; చుట్టమై = బంధువై; పరగినయట్టి = ప్రకాశించునట్టి; నీ పతితపావన నామము = పాపాత్ములను పవిత్రులనుగా చేయు నీ నామము; జిహ్వపైన్ = నా నాలుకపైన; ఇకన్ = ఇంక నిరంతరము = ఎల్లప్పుడును; నటింపజేయుము = నాట్యమాడునట్లుగా చేయవలసినది. దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :—

ఓ దాశరథీ! సేతుబద్ధ నీరధీ! నీ పవిత్రనామము శంకరునకును, విభీషణునకును, పార్వతికిని ఐశ్వర్యమును కలిగించునదిగను; గజేంద్రునకును, అహల్యకును, ద్రౌపదికిని ఆపదనుండి రక్షించు బంధువుగను ప్రసిద్ధమైనట్టిది. పంచమహాపాతకులను కూడ పవిత్రము జేయునట్టి నీ నామమెల్లప్పుడును నా నాలుకపై నిలుచునట్లుగా చేయుటకు నిన్ను ప్రార్థింతును

16) ముప్పునఁగాలకింకరులు ముంగిట వచ్చినవేళ
రోగముల్
గొప్పరమైనచోఁ గఫము కుత్తుక నిండినవేళ
బాంధవుల్

గప్పినవేళ మీ స్మరణ గల్గునో కల్గదో నాఁటికిప్పుడే
తప్పకచేతు మీ భజన దాశరథీ ! కరుణాపయోనిధీ !

ప్రతిపదార్థము :-

ముప్పునన్=వార్ధకమునందు; కాలకింకరులు = యమభటులు; ముంగిటన్=ఇంటి సమీపమునకు; వచ్చిన వేళన్=వచ్చిన సమయమందును; రోగముల్=వ్యాధులు; కొప్పరము+ఐనచో=విజృంభితమైనపుడును; కఫము=శ్లేష్మము కుత్తుక నిండిన వేళన్=గొంతుకను చుట్టిన కాలము నందును; బాంధవుల్=చుట్టములు; కప్పినవేళన్=చుట్టును చేరియున్నప్పుడును; (అనగా మరణమాసన్నమైనపుడు) మీ స్మరణ=మిమ్ములను స్మరించుట భాగ్యము; నాటికిన్=ఆ దినమునకు; కల్గునో కల్గదో=కలుగునో కలుగదో (అందుచే) మీ భజన=మీ స్మరణ ఇప్పుడే=ఈ వేళనే (అనగా ఆరోగ్యముగా నున్నప్పుడే) తప్పక చేతున్=విడువక చేయగలవాడను; దాశరథీ! కరుణాపయోనిధీ !

భావము :-

ఓ త్రివిక్రమా! నిర్వక్ర పరాక్రమా! ముసలితనమున యమకింకరులు నా ప్రాణములను గొనిపోవుటకు ఇంటిముందునకు వచ్చినపుడును; శరీరమును వ్యాధులు మిక్కిలి పీడించుచున్నపుడును; కంఠమును కఫము చుట్టుకొనినపుడును; పరలోక గతుడనగుదునని బంధువులందరు నా చుట్టును చేరియున్నపుడును మీ పవిత్ర నామస్మరణ కావించు భాగ్యము నాకు కలుగునో, కలుగదో చెప్పలేను. అందుచే ఆరోగ్యముగా నున్న ఇప్పటినుండియే మిమ్ములను హృదయమున నందిడుకొని మీ భజన చేయగలవాడను. నన్ను కృపజూడుము.

17) "పరమ దయానిధే! పతితపావననామ! హరే"
యటంచు సు
స్థిరమతులై సదా భజనసేయు మహాత్ముల
పాదధూళి నా
శిరమునఁదాల్తు మీరటకుఁ జేరకుఁడంచు యముండు
కింకరో
త్కరమున కానవెట్టెనఁట దాశరథీ! కరుణాపయోనిధీ!

ప్రతిపదార్థము :-

పరమ దయానిధే=గొప్ప దయాగుణమునకు నిధి వంటివాడా; పతితపావన నామ=పాపులను సయితము పవిత్రము సేయగల పేరును ధరించిన వాడా! హరే=ఓ శ్రీహరీ! అటంచున్=అని ఉచ్చరించుచు; సుస్థిరమతులై=మిక్కిలి నిశ్చలమైన మనస్సు గలవారై; సదా=అనవరతము; భజన+చేయు=భజన చేయునట్టి; మహాత్ముల పాదధూళి=భాగవతోత్తముల పాదములనంటిన ధూళిరాగమును; నా శిరమునన్=నా శిరస్సునందు; తాల్తున్=ధరించెదను; (కావున) మీరు+అటకున్=మీరెవ్వరును అచ్చటకు; చేరకుడు+అంచున్=సమీపింపవద్దు అని యముండు=యమధర్మరాజు; కింకర+ఉత్కరములకున్=తన భటుల సమూహమునకు; ఆన+పెట్టెనట=ఆజ్ఞ ఇచ్చెనట; దాశరథీ! కరుణాపయోనిధీ!

భావము :-

ఓ శ్రీరామచంద్రా! రఘుకులేంద్రా! యమధర్మరాజు తన భటుల సమూహమును చేరబిలిచి "పరమ దయానిధే! పతితపావననామ! హరే!" అనుచు స్థిరచిత్తులై నీయందే మనసు నిలిపి నిరతము నిన్నుగూర్చి స్మరణ

గావించు భాగవతోత్తముల పాద ధూళిని నా శిరస్సున భక్తితో ధరింతును గాన మీరట్టి మహాత్ముల సమీపమునకు పోవలదు సుమా!" అని ఆజ్ఞాపించెనట (కాన నీ నామస్మరణ మాహాత్మ్యము నెరుంగుట కెవ్వారికి శక్యము? దయానిధివి గావున నన్ను కృపజూడుము)

18) అజునకుఁ దండ్రివయ్యు సనకాదులకుం బర
తత్త్వమయ్యు స
ద్ద్విజముని కోటికెల్లఁ గులదేవతవయ్యు దినేశ
వంశ భూ
భుజులకు మేటివయ్యుఁ బరిపూర్ణుఁడవై వెలుఁగొందు
పక్షి రా
డ్ధ్వజ; మిముఁ బ్రస్తుతించెదను దాశరథీ !
కరుణాపయోనిధీ !

ప్రతిపదార్థము :-

అజునకున్ = బ్రహ్మదేవునకు; తండ్రివయ్యున్ = తండ్రివయ్యును; సనకాదులకున్ = సనకుడు మొదలుగా గల వారికి; పరతత్త్వమయ్యున్ = పరబ్రహ్మ స్వరూపుడవయ్యును; సద్విజ మునికోటికెల్లన్ = భక్తాగ్రగణ్యులైన బ్రాహ్మణులు, ఋషులు మొదలుగా గల వారికందరకును; కులదేవత వయ్యున్ = కులమునందలి ఇష్టదేవతవయ్యును; దినేశ వంశ = సూర్యవంశమునకు సంబంధించిన; భూభుజులకున్ = రాజులకు; మేటివయ్యున్ = శ్రేష్ఠుడవయ్యును; పరిపూర్ణుడవై = సకల సద్గుణ సంపన్నుడవై; వెలుగొందు = ప్రకాశించు; పక్షిరాట్ + ధ్వజ = పక్షిరాజైన గరుత్మంతుడు జెండాయందు కలవాడవైన ఓ విష్ణు స్వరూపుడా!

మిమున్=మిమ్ములను ప్రస్తుతించెదను = స్తోత్రము చేయగలవాడను; దాశరథీ! కరుణాపయోనిధీ!

**భావము :-**

ఓ దశరథాత్మజా! దశరాజధ్వజా! నీవు సృష్టికర్తయగు బ్రహ్మ దేవునకు తండ్రివి. సనక సనందాది మహామునులకు పరబ్రహ్మ స్వరూపుడవు. బ్రహ్మజ్ఞాన సంపన్నులయిన బ్రాహ్మణులకు దివ్య ఋషులకును కులదేవతవు. సూర్యవంశ రాజశ్రేష్ఠులలో ప్రథమ గణ్యుడవు సమస్త సల్లక్షణములు కలిగినవాడవై ప్రకాశించు ఓ గరుడధ్వజా! నిన్ను తప్పక స్మరించుచు ప్రస్తుతించెదను. (నా యందు దయ జూపుము).

**19) "పండిత రక్షకుండఖిల పాప విమోచనుఁడబ్జ సంభవా**
**ఖండల పూజితుండు దశకంఠ విలుంఠన చండ కాండ కో**
**దండ కళాప్రవీణుఁడను తావకకీర్తి వధూటికిత్తుఁ బూ**
**దండలుగాఁగ నా కవిత దాశరథీ! కరుణాపయోనిధీ !**

**ప్రతిపదార్థము :-**

పండిత రక్షకుండు=పండితులను రక్షించువాడు; అఖిల=సమస్తమైన; పాపవిమోచనుఁడు=పాపములనుండి విడిపించునట్టివాడు; అబ్జ సంభవ+ఆఖండల=బ్రహ్మదేవుని చేతను, ఇంద్రుని చేతను; పూజితుండు =పూజింపబడినవాడు; దశకంఠ=పది తలలను (రావణాసురుని యొక్క) విలుంఠన=ఖండించునట్టి; చండ=తీక్ష్ణమైన; కాండ=బాణములుగల; కోదండ కళాప్రవీణుడు=ధనుర్విద్యయందు నేర్పరియైనవాడు; అను= అనునట్టి, తావక కీర్తి వధూటికిన్=నీ యొక్క కీర్తి అనెడు కాంతకు;

నా కవితన్ = నా కవిత్వము పూవంపసలుగాఁగన్ = పూలమాలలగునట్లుగా; ఇత్తున్ = సమర్పించెదను, దాశరథీ! కరుణాపయోనిధీ!

**భావము :-**

ఓ జానకీ మనో విహారా! దుష్టరాక్షస సంహారా! నీవు పండిత శ్రేష్ఠులను కాపాడు వాడవు. సమస్తమైన జనులను, వారి వారి పాపముల నుండి విముక్తి నొందించు వాడవు. బ్రహ్మదేవుని చేతను, దేవేంద్రుని చేతను పూజింపబడినవాడవు. రావణాసురుని పది తలలను త్రుంచివేయ గల వాడియైన బాణములను ప్రయోగించు ధనుర్విద్యయను కళయందు నేర్పరివి అనెడు గొప్ప కీర్తిని పొందిన వాడవు. అట్టి నీ కీర్తి కాంతకు నాకు గల కవితా శక్తిచే రచింపబడిన పద్య సుమముల నర్పించెదను (నన్ననుగ్రహింపుము).

**20)** శ్రీరమ సీతగాఁగ నిజసేవక బృందము వైష్ణవా
చార జనంబుగాఁగ విరజానది గౌతమిగా, వికుంఠము
న్నారయ భద్రశైల శిఖరాగ్రముగాఁగ వసించుచేతనో
ద్ధారకుఁడైన విష్ణుఁడవు దాశరథీ! కరుణాపయోనిధీ!

**ప్రతిపదార్థము :-**

శ్రీరమ = సమస్త సంపదల నొసంగు లక్ష్మీదేవి; సీత + కాఁగన్ = సీతా మహా దేవిగను; నిజ = తనయొక్క; సేవక బృందము = సేవక సముదాయము; వీర వైష్ణవ + ఆచార జనంబు + కాఁగన్ = వీరవైష్ణవ సాంప్రదాయముల ననుసరించు జనులుగను; విరజానది = విరజ అను పేరుగల వైకుంఠము నందు గలనది; గౌతమి + కాన్ = గోదావరి నదిగను, ఆరయన్ = ఆలో చింపగా; వికుంఠమున్ = వైకుంఠము; భద్రశైల శిఖర + అగ్రము +

కొంగన్=భద్రాద్రి యొక్క శిఖర ప్రదేశముగను; వసించు=నివసించు నట్టి; చేతన+ఉద్ధారకుఁడు+ఐన=సమస్త ప్రాణులను తరింపజేయునట్టి; విష్ణుఁడవు=విష్ణు దేవుడవు; దాశరథీ! కరుణాపయోనిధీ!

**భావము :**

ఓ పతితపావన నామా! విరాధాది రాక్షస విరామా! ఈ భద్రాచల మున నివసించు నీవు సాక్షాత్ విష్ణుదేవుడవే; నీ అంకతలమున నున్న సీతామహాసాధ్వియే లక్ష్మీదేవి. వైష్ణవ సాంప్రదాయము ననుసరించుచు నీకు పూజ మొదలగు సేవలు చేయువారే నీ సేవక సముదాయము. ఇచ్చటి గోదావరీ నదియే అచ్చటి విరజానది. ఇచ్చటి భద్రగిరి శిఖరమే వైకుంఠము. ఈ విధముగా విష్ణు స్వరూపుడవైన నీవు ఈ లోకమునందలి ప్రజలను పాపముల నుండి విముక్తులను జేయుచు తరింపజేయు వాడవు. అట్టి నీవు నన్నుద్ధరింపుము.

21) కంటి నదీతటంబుఁ బొడగంటిని భద్రనగాధి
వాసమున్
గంటి నిలాతనూజ, నురుకార్ముక మార్గణ శంఖ
చక్రముల్
గంటిని, మిమ్ము లక్ష్మణునిఁగంటిఁగృతార్థుఁడనైతి,
నో జగ
త్కంటక దైత్య నిర్దళన! దాశరథీ! కరుణాపయోనిధీ!

**ప్రతిపదార్థము :-**

ఓ జగత్కంటక దైత్య నిర్దళన=భూలోకమునందలి ప్రజలను పీడించు రాక్షసులను దండించు శ్రీరామా! నదీతటంబున్=గోదావరి నది యొక్క ఒడ్డును; కంటిన్=చూచితిని; భద్రనగ+అధివాసమున్=భద్రా

చల నివాస స్థానమును; పొడగంటిని=చక్కఁగా చూచితిని; ఇలాతనూజిన్ =భూదేవి కుమార్తెయైన సీతాదేవిని; కంటిన్=చూచితిని; ఉరు= గొప్పవైన; కార్ముక=ధనుస్సును; మార్గణ=బాణములను; శంఖ=పాంచ జన్యమను పేరుగల శంఖమును; చక్రముల్=సుదర్శనమను పేరుగల చక్రము మొదలైన వానిని; కంటిని=చూచితిని; మిమ్ము లక్ష్మణునిన్= మిమ్ములను, మీ సోదరుడైన లక్ష్మణుని; కంటిన్=చూచితిని; కృతార్థుఁ డను+ఐతిన్=ధన్యుడనైతిని; దాశరథీ! కరుణాపయోనిధీ!

**భావము :-**

ఓ పురుషోత్తమా! రఘుకుల రాజసత్తమా! గోదావరీ నదీతీరమును, ఆ నది ఒడ్డుననున్న భద్రగిరిని వీక్షించి ఆనందపడితిని. నీ అర్ధాంగియైన సీతామహాసాధ్విని, నీవు ధరించు ధనుర్బాణములను, శంఖచక్రములు మొదలైన ఆయుధములను చూచి సంతోషించితిని. సర్వ సద్గుణ లక్షణ సమన్వితుడవైన నిన్నును, నిన్ను విడువక సేవించు నీ తమ్ముడైన లక్ష్మణుని నా అదృష్ట వశమున దర్శించి పరవశుడనైతిని. జగత్తునందలి ప్రజలను బాధించి హింసించు రాక్షసులను మట్టుపెట్టువాడా! నన్ను పాలింపుము

**22)** హలికునకున్ హలాగ్రమున నర్థము సేకురుభంగి, దప్పిచే
నలమటఁ జెందువానికి సురాపగలో జలమబ్బినట్లు, దు
ర్మలిన మనోవికారినగు మర్త్యుని నన్నొడఁగూర్చి నీ పయిం
దలఁ పుఘటింపఁ జేసితివి, దాశరథీ! కరుణాపయోనిధీ!

ప్రతిపదార్థము :-

హలికునకున్=వ్యవసాయము గావించు రైతునకు: హల+అగ్రమునన్=నాగలియొక్క కఱ్ఱునుండి; అర్థము=ధనము; చేకురు భంగిన్=సమకూరు విధముగను; దప్పిచేన్=దాహముచేత; అలమటం జెందువానికిన్=పీడింపబడుచున్నవానికి; సుర+అపగలోన్=దేవతా తరంగిణియైన గంగానది యందలి; జలము+అబ్బినట్లు=నీరు దొరికినట్లుగను; దుర్మలిన=పాప సంబంధమైన; మనోవికారిని+అగు=మనోవికారములు గలవాడనగు; మర్త్యునినన్నున్=మానవుడనైన నన్ను: ఒడంగూర్చి=దగ్గరకు చేర్చుకొని; నీ తలంపున్=నీ ధ్యానమును; ఘటింపంజేసితివి=నిన్ను స్మరించు ధ్యానమును కలుగునట్లు చేసితివి: దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ నీలమేఘశ్యామా! పతితపావననామా! కృషీవలుడు భూమిని దున్నుచుండగా నాగటికఱ్ఱునకు తగిలి నిధి దొరకిన విధముగను, దాహముతో తల్లడిల్లువానికి దివ్యమైన గంగోదకము లభించినట్లుగను, పాపచింతనచే వికారము నొందిన మనస్సుగల నన్ను దగ్గరకు చేర్చుకొని నీపై భక్తి కలుగునట్లు అనుగ్రహించితివి. నేను ధన్యుడనైతిని.

23) కొంజక తర్కవాదమను గుద్దలిచేంబరతత్త్వ భూస్థలిన్
రంజిల ద్రవ్వి కన్గొనిన రామనిధానము నేఁడు భక్తి సి

ద్ధాంజనమందు హస్తగతమయ్యె భళీ! యనఁగా
మదీయ హృ
త్కంజమునన్ వసింపుమిఁక దాశరథీ!
కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

కొంజక=సందేహింపక; తర్కవాదము+అను=తర్క శాస్త్రము నకు సంబంధించిన వాదము అనునట్టి; గుద్దలిచేన్=గడ్డపాఱచేత; పర తత్త్వభూస్థలిన్=పరతత్త్వమనెడు భూ ప్రదేశమును; రంజిలన్=ఒప్పు నట్లుగా; త్రవ్వి=త్రవ్వి; కన్గొనని=చూడశక్యముకాని; రామనిధానము= శ్రీరాముడనెడు డబ్బు పాతఱ; నేఁడు=ఈ దినమున; భక్తి సిద్ధాంజన మందున్=భక్తియనెడు ఫలమును తెలియజేయునట్టి కాటుకయందు; భళీయనఁగాన్=బాగుబాగు అనునట్లుగా; హస్తగతమయ్యెన్=చేతికి దొరకి నది; ఇఁకన్=ఇక మీదట; మదీయ=నాయొక్క; హృత్కంజమునన్= హృదయకమలము నందు; వసింపుము=నివసింపుము; దాశరథీ! కరుణా పయోనిధీ!!

భావము :–

ఓ సీతామనోహరా! నవనీతాపహరా! తర్కవాదమను గడ్డిపాఱచే పరబ్రహ్మమను భూమిని త్రవ్వి అందు శ్రీరామచంద్రుడను ధనపు పాతఱను పొందలేకపోతిని. అందుచే ఆ పాతఱ ఎచ్చటనున్నదో తెల్పు నట్టి అంజనము వేసి నేడు శ్రీరామచంద్రుడనునట్టి ధనపు పాతఱను తెలిసి కొనగలిగితిని. ఆ అంజనమే నీయందు నాకుగల భక్తి కావున కృతార్థుడ నైన నా హృదయకమలమునందు నీవు ఎల్లప్పుడు నివసించుటకు ప్రార్థించుచున్నాను.

24) రాముఁడు, ఘోరపాతక విరాముఁడు, సద్గుణ కల్పవల్లికా
రాముఁడు, షడ్వికారజయరాముఁడు, సాధుజనావన వ్రతో
ద్ధాముఁడు, రాముఁడే పరమదైవము మాకనిమీయ డుంగుఁగెం
దామరలే భజించెదను, దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :—

రాముఁడు=తన రూపలావణ్యాదులచేత సమస్త జనులను ఆనందింపజేయునట్టివాడును; ఘోరపాతక=గొప్ప మహాపాతకములను; విరాముఁడు=నాశనము గావించునట్టివాఁడును; సద్గుణ=మంచి గుణములనెడు; కల్పవల్లికా=కల్పవృక్షపు తీగలకు; ఆరాముఁడు=ఉద్యానవనము వంటివాడును; షడ్వికార జయరాముఁడు=కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లనెడు ఆఱు విధములైన వికారములను జయించుటచే సమస్త లోకమును రంజింపచేయువాడును; సాధుజన+అవన=సత్పురుషులను రక్షించుటయనెడు; వ్రత=వ్రతమునందు; ఉద్దాముడు=పట్టుదలగలవాడును; (అయిన) రాముఁడు+ఏ=శ్రీరామచంద్రుడే; మాకు=మాకు; పరమదైవము+అని=ఇలవేల్పుఅని; మీయడుంగుకెందామరలు+ఏ=ఎఱ్ఱని పద్మములవంటి మీ పాదములనే; భజించెదను=సేవించెదను; దాశరథీ! కరుణాపయోనిధీ.

భావము :—

ఓ సీతామనోనాయకా! అమోఘసాయకా! లోకమునందలి జనులనందఱను తన రూప సంపదచేత రంజింపచేయువాడును, ఘోరమైన పంచ

మహాపాతకములను గూడ నాశము గావించువాడును, సద్గుణములనునట్టి కల్పవృక్షపు తీగలతో నిండిన ఉద్యానవనము వంటివాడును, కామక్రోధాది అరిషడ్వర్గమును జయించినవాడును. సాధుజనరక్షణయను వ్రతముగల వాడును, అయినట్టి దశరథరాముడే మాకు పరమాత్మ స్వరూపుడని మీపాద పద్మములనే సేవించెదను. నన్ను కాపాడుము.

25) చక్కెరమాని వేము దినజాలినకైవడి మానవాధముల్
పెక్కురు పెక్కు దైవముల వేమఱు గొల్చెదరట్ల
కాదయా
మ్రొక్కిన నీకమ్రొక్కవలె మోక్షమొసంగిన
నీవయీవలెన్
దక్కిన మాటలేమిటికి? దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము :-

చక్కెరమాని = తియ్యని పంచదారను వదలి; వేదున్ + తినన్ + చాలినకైవడిన్ = చేదుగానుండు వేపకాయను తినుటకు పూనుకొనినట్లుగా; మానవాధముల్ = నీచమానవులు; పెక్కురు = చాలమంది; పెక్కు = అనేకులైన; దైవములన్ = క్షుద్రదేవతలను; వేమఱు = మాటిమాటికిని; కొల్చెదరు = సేవించెదరు; అట్లు + అ + కాదయా = ఆ విధముగా సేవించుట తగనిపని; మ్రొక్కినన్ = నమస్కరింపదలచిన; నీకున్ + అ = నీకే; మ్రొక్కవలెన్ = నమస్కరింపవలయును; మోక్షమొసంగినన్ = ముక్తిని ప్రసాదింపదలచిన; నీవు + అ = నీవే; ఈవలెన్ = అనుగ్రహింపవలయును; తక్కినమాటలు = ఇతరములైన మాటలు; ఏమిటికిన్ = ఎందులకు (అన వసరములని భావము): దాశరథీ! కరుణాపయోనిధీ!

**భావము :-**

ఓ సర్వదేవస్తుతా! సమస్తమునిజనసంస్తుతా! అజ్ఞానులైన మానవులు కొందఱు తీయనైన పంచదారను విడిచి చేదుగానుండు వేపకాయను తిను రీతిగా పరమాత్మ స్వరూపుడవైన నిన్ను విడిచి క్షుద్రదేవతలను ఆరాధించెదరు. అది సరియైన పద్ధతికాదు. పురుషార్థములలో నుత్తమోత్తమైన మోక్షమును ప్రసాదించుటకు నీవొక్కడవే సమర్థుడవు. ఆ కారణముచే మ్రొక్కదలచిన నీకే నమస్కరింపవలయును మోక్షము నీయదలచిన నీవే ఈయవలయును. అందుచే ఇహమునకు సంబంధించిన ఫలమునీయగల ఇతర దైవములను విడిచి నాకు ముక్తినొసంగుటకు నిన్నే ప్రార్థింతును. నా కోర్కెను సఫలము గావింపుము.

26) "రా" కలుషంబులెల్ల బయలంబడద్రోచిన "మా"
కవాటమై
దీకొని ప్రోచు నిక్కమని ధీయుతులెన్నదదీయవర్ణముల్
గైకొని భక్తిచే నుడువగానరుగాక! విపత్పరంపరల్
దాకొను నేజగజ్జనుల? దాశరథీ! కరుణాపయోనిధీ॥

**ప్రతిపదార్థము :-**

"రా"="రా" అనెడి అక్షరము; కలుషంబులు+ఎల్లన్=సకల పాపములను; బయలన్=లోపల నుండి బయటకు; పడద్రోచినన్=త్రోసి వేయగా; "మా"="మా" అను వర్ణము; కవాటమై=ద్వారమునకు సంబంధించిన తలుపువలె; దీకొని=ఎదుర్కొని, ప్రోచున్=రక్షించును; నిక్కము+అని=ఇది సత్యము అని; ధీయుతులు=పండితులు; ఎన్నన్=తలంచుచుండగా; తదీయవర్ణముల్ — "—"
లను; గైకొని=గ్రహించి;

స్మరింపజూడరే; (కాని అట్లు స్మరించిన) జగజ్జనులన్=లోకము నందలి సకల జనులను; విపత్+పరం పరల్=క్రమముగా కలుగు ఆపదలు; దాకొనునే=సమీపించునా? (సమీపింపవని భావము) దాశరథీ! కరుణా పయోనిధీ!!

భావము :-

ఓ సుమిత్రాపుత్ర సేవితా! సకలమునిజనభావితా! నీ పవిత్రనామము నందలి ప్రథమాక్షరమైన "రా" అను వర్ణమును ఉచ్చరించినమాత్రముననే శరీరమునందు నెలకొనియున్న పాపములన్నియు బయటకు నెట్టివేయ బడును. పిమ్మట ద్వితీయాక్షరమైన "మ" అను వర్ణము నుచ్చరించినపుడు పెదవులు కలిసికొని బయటకు వెడలద్రోయబడిన పాపములు తిరిగి లోపలకు ప్రవేశింపకుండ తలుపులవలె మూసికొనును. ఈ విషయమును మహాజ్ఞానులు వివరించియున్నారు ఈ సంగతి తెలిసియు లోకమునందలి మానవులు నీ నామస్మరణ గావింపకున్నారు. నీ పవిత్ర నామస్మరణ గావించిన ఆపదలెప్పుడును దగ్గరకురావు. అందుచే నీ నామస్మరణ గావించెదను. నన్ను కరుణింపుము.

27) "రామహరే! కకుత్స్థకులరామహరే! రఘురామరామశ్రీ
రామహరే" యటంచుమదిరంజిలభేకగళంబులీల నీ
నామము సంస్మరించివజనంబు భవంబెడఁబాసి తత్పరం
ధామనివాసులౌదురఁట! దాశరథీ! కరుణాపయోనిధీ!

ప్రతిపదార్థము :-

రామ=శ్రీరామా; హరే=శ్రీహరీ, కకుత్స్థకులరామ=కాకుత్స్థ వంశమున జన్మించిన శ్రీరామా; హరే=శ్రీహరీ; రఘురామ=ఓ రఘు

వంశమున బుట్టిన రామా; రామ=శ్రీరామా; శ్రీరామ=శ్రీరామా; హరే=శ్రీహరీ; అటంచున్=అని స్మరించుచు; మది=మనస్సు; రంజిలన్=ఆనందపడునట్లు; భేక=కప్పయొక్క; గళంబులీలన్=కంఠ ధ్వనితో; నీ నామమున్=నీ పవిత్రమైన పేరును; సంస్మరించిన=మిక్కిలిగా స్మరణ గావించిన; జనంబు=జనులు; భవంబున్=పుట్టుకను; ఎడఁబాసి=విడిచిపెట్టి, తత్+పరంధామనివాసులు=ఆ పరమపదమునందు నివాసము చేయువారుగా; ఔదురట=అగుదురని చెప్పుదురుగదా; దాశరథీ కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ మహాదేవా! వాసుదేవా! ఓ శ్రీరామా, ఓ శ్రీహరీ; ఓ కకుత్స్థ వంశమున బుట్టిన శ్రీరామా; రఘురామా; ఓ శ్రీహరీ అనుచు నీ పరమ పవిత్రమైన నామములను కప్పలు అఱచునట్లు గట్టిగా ఆర్తితో స్మరించిన జనులు జన్మరాహిత్యమును పొంది పై కుంఠమునందు స్థిరనివాసము గల వారగుదురట. అందుచే అట్లుగనే నీ నామస్మరణ గావించెదను. నన్ను కాపాడుము.

**28) చక్కెరలప్పకున్, మిగులజవ్వని కెంజిగురాకు మోవికిన్
జొక్కపు జుంటితేనియకుఁజొక్కిలుచుంగనలేరుగాక, నే
డక్కట! రామనామ మధురామృతమానుటకంటె
సౌఖ్యమా
తక్కిన మాధురీమహిమ? దాశరథీ! కరుణాపయోనిధీ॥**

**ప్రతిపదార్థము :-**

చక్కెర=పంచదారయొక్క; లప్పకున్=రాశికిని; జవ్వనికెం

జిగురాకు సోవికిన్ = చిగురుటాకువలె ఎఱ్ఱనైన యువతియొక్క పెదవికినీ; చొక్కపు = స్వచ్ఛమైన; జుంటితేనియకున్ = తేనెటీగలు సేకరించి తెచ్చిన తేనెకును; మిగులన్ = మిక్కిలిగా; చొక్కిలుచున్ = పరవశమునొందుచు; నేఁడు = ఇప్పుడు; కనలేచుగాక = తెలిసికొనలేకున్నారుగాని; రామనామ = శ్రీరామనామము యొక్క; మధుర + అమృతమున్ = మిక్కిలి మధురమైన అమృతమును: అనుటకంటెన్ = త్రాగుటకంటె: అక్కట = అయ్యో! తక్కిన మాధురీమహిమ = తక్కిన తీయని వస్తువుల మాధుర్యప్రభావము; సౌఖ్యమా = సుఖమును కల్గించునదా (కాదని భావము); దాశరథీ! కరుణా పయోనిధీ!

**భావము :—**

ఓ జానకీనాథా! సమస్త సద్గుణసనాథా! చక్కెరరాశిని కొందఱును, యౌవనమునందున్న స్త్రీల చిగురాకువంటి అధరామృతమును మఱికొంద ఱును; తేనెటీగలు కూర్చిన స్వచ్ఛమై మధురమైన తేనెను వేరొక కొంద ఱును, అనుభవించి పరవశమగుచుందురుగాని అయ్యయ్యో మీనామస్మర ణామృతమును గ్రోలి పరవశము నొందు సౌఖ్యమును పొందుచుండుట లేదుగదా; నీ నామస్మరణామృతపు రుచికి తక్కిన తీయని వస్తువులరుచులు ఎట్లు తుల్యములగును? ఆ విషయమును లోకులు తెలిసికొనలేక పోవు చున్నారు. నేనా రుచిని చవిచూచినవాడనుగాన నన్ననుగ్రహింపుము.

**29)** **అండజవాహా! నిన్ను హృదయమ్మున నమ్మినవారి పాపముల్**
**కొండలవంటివైన వెసఁగూలి నశింపకయున్నె? సంతతా**
**ఖండలవైభవోన్నతులు గల్గకమానునె? మోక్షలక్ష్మికై**
**దండయొసంగకున్నెతుద, దాశరథీ! కరుణాపయోనిధీ!**

ప్రతిపదార్థము :-

అండజవాహ=గరుత్మంతుడు వాహనము గాగల ఓ శ్రీరామా! నిన్నున్=నిన్ను; హృదయమ్మునన్=మనస్సునందు; నమ్మినవారి పాపముల్=నమ్ముకొనియున్నవారి యొక్క పాపములు; కొండలవంటివి+ఐనన్=కొండలతో బోల్చదగినవైనను; వెసన్=శీఘ్రముగా; కూలి=క్రిందకుపడి; నశింపకయున్నె=నశింపకపోవునా? (తప్పక నాశనము నొందును) సంతత=ఎడతెగని; అఖండల=ఇంద్రునితో సమానమైన; వైభవ+ఉన్నతులు=భోగభాగ్యాధిక్యములు; కల్గకమానునె=లభింపక పోవునా? (తప్పక కల్గును); తుదన్=జీవితము యొక్క అంతమందు మోక్షలక్ష్మి=ముక్తికాంత; కైదండ యొసంగకున్నె=హస్తావలంబనము ఈయకుండునా; (తప్పక చేయూతనిచ్చును) దాశరథీ! కరుణాపయోనిధీ॥

భావము :-

ఓ హరిహర రూపైకమూర్తీ! పరిహృతనతజనార్తీ! గరుడ వాహనుడవైన ఓ శ్రీరామచంద్రా! మిమ్ము మనసారా నమ్మినవారి పాపములు పర్వతముల వంటివైనను వెనువెంటనే తుప్పకూలి నశించును గదా, అట్లు మీ పాదసేవ గావించువారికి ఈ లోకమున దేవేంద్రునిఐశ్వర్యముతో సమానమైన భోగమును, అంతమున మోక్షలక్ష్మి యొక్క కరావలంబనమును తప్పక కల్గునుగదా! అనగా ఇహపర సౌఖ్యములు రెండును సమకూరునని భావము. అట్టి సౌఖ్యమును నాకు సమకూర్చి నన్నేలుకొనుము.

30) చిక్కనిపాలపై మిసిమిఁజెందిన మీఁగడ పంచదారతో
మెక్కినభంగి మీవిమలమేఁచకరూప సుధారసంబు నా

మక్కువ పళ్లెరంబున సమాహిత దాస్యమనేటి
దోయిటన్
దక్కెనటంచు జుఱ్ఱెదను, దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము :-

చిక్కని పాలపైన్=చిక్కని పాలమీదనున్న; మిసిమిఁజెందిన= ప్రకాశించునట్టి; మీఁగడన్=మీగడను; పంచదారతోన్=తీయనైన పంచదారతో కలిపి; మెక్కిన భంగిన్=తినినవిధముగా; మీ=మీయొక్క; విమల = స్వచ్ఛమయిన; మేచకరూప = నీలరూపముతోనున్న; సుధారసంబున్=అమృతరసమును; నా=నా యొక్క; మక్కువ పళ్లెరంబునన్=ప్రియమైన భోజన పాత్రయందు; సమాహితదాస్యము+ అనేటి=నిండుమనస్సుతో గావింపబడు సేవయనెడి; దోసిటన్=దోసిలి యందు; తక్కెనటంచున్=చిక్కెనుగదాయని; జుఱ్ఱెదను=మిక్కిలి ఇష్టముతో త్రాగెదను; దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :—

ఓ దశరథపుత్రా! నీలమేఘసమగాత్రా! నీవు నీలమేఘము వంటి వర్ణముగల రూపము గలవాడవు. అట్టి నీ సుందర రూపము అమృత స్వరూపము. అట్టి స్వరూపమును మీ సేవ చేయుట అను దోసిలితో మీ మీది భక్తియను పళ్లెరము నుండి గ్రహించి చిక్కని పాలమీద నేర్పడిన తళతళమను కాంతిగల మీగడపై పంచదారచల్లి తినిన విధముగా జుఱ్ఱెదను. ఇట్టి యదృష్టము నాకబ్బినది భక్తితో మీ సేవలొనర్చెదను. నన్ను కరుణింపుము.

31) సిరులిడసీత, పీడలెగఁజిమ్ముటకున్ హనుమంతుఁ
డార్తిపోఁ
దరుమ సుమిత్రసూతి, దురితంబుల మానుప రామ
నామమున్
గరుణదలిర్ప మానవులఁగావఁగఁబన్నిన వజ్రపంజరో
త్కరము గదా భవన్మహిమ దాశరథీ!
కరుణాపయోనిధీ॥

**ప్రతిపదార్థము :-**

సిరులు+ఇడన్=సంపదలను సమకూర్చుటకు; సీత=సీతామహా దేవియు; పీడలు+ఎగజిమ్ముటకున్ = ఆపదలను త్రోసివేయుటకు; హనుమంతుఁడు=హనుమంతుడును; ఆర్తిపోదరుమన్=కష్టములను తరిమి పోగొట్టుటకు; సుమిత్రసూతి=సుమిత్రాదేవి కుమారుడైన లక్ష్మణుడును; దురితంబులన్=పాపములను; మానుపన్=నాశము చేయుటకు; రామ నామమున్=పవిత్రమైన శ్రీరామనామమును; కరుణదలిర్పన్=దయ అతి శయింపగా; మానవులన్=మనుష్యులను; కావఁగన్=రక్షింపగా; పన్నిన=కలిగిన; భవత్+మహిమ=నీ యొక్క ప్రభావము; వజ్ర పంజర+ఉత్కరముగదా=వజ్రపంజరము యొక్క కూడికగదా; దాశరథీ! కరుణాపయోనిధీ!

**భావము :-**

ఓ దశరథనందనా! మునిజన నయనానందనా! ఈ కలియుగము నందలి మానవులకు సమస్తైశ్వర్యములను ప్రసాదించుతల్లి సీతామతల్లి. వారి ఆపదలను తొలగించువాడు నీ భక్తుడైన మారుతి. వారి కష్టములను

దూరముగా తరిమివేసి వారికి అండగానిల్చువాడు నీ సోదరుడు లక్ష్మణుడు. వారి సంచిత ప్రారబ్ధ సంబంధములైన పాపములను నాశము చేయునది పవిత్రమైన నీ నామ స్మరణము. అందుచే నీ మహత్త్వము వజ్రపంజరముతో సమానమై వారలను సంరక్షించుచుండును. గావున నేను నిన్నే భక్తితో సేవించెదను. నన్ను కాపాడుము.

**32) హలకులిశాంకుశధ్వజ శరాసన శంఖరథాంగ కల్పకో**
**జ్జ్వలజలజాత రేఖలను సాంకములైకనుపట్టుచున్న మీ**
**కలితపదాంబుజద్వయము గౌతమపత్నికొసంగినట్లు నా**
**తలపునఁజేర్చి కావఁగదె దాశరథీ! కరుణాపయోనిధీ!!**

**ప్రతిపదార్థము :—**

హల=నాగలి; కులిశ=వజ్రాయుధము; అంకుశ=అంకుశము; ధ్వజ=జెండా; శరాసన=విల్లు; శంఖ=శంఖము; రథాంగ=చక్రము; కల్పక=కల్పవృక్షము; ఉజ్జ్వల=మిక్కిలిగా ప్రకాశించుచున్న; జలజాత=పద్మము; (అనునట్టి) రేఖలను=రేఖలతో; స+అంకములై= గుర్తించుటకు వీలైనవై; కనుపట్టుచున్న=కనబడుచున్నట్టి; మీ=మీ యొక్క; కలితపద+అంబుజద్వయమున్=ఒప్పిదమైన పాదకమలముల జంటను; గౌతమపత్నికిన్=గౌతమ మహర్షి భార్యయగు అహల్యకు; ఒసంగినట్లు=ప్రసాదించిన విధముగా; నా తలఁపునన్=నా మనస్సునందు; చేర్చి=కూడునట్లుచేసి; కావఁగదె=రక్షింపవే; దాశరథీ! కరుణాపయోనిధీ!

**భావము :-**

ఓ రఘువంశ సుధాంబుధిసోమా! శత్రుజనభీమా! నీ పాద కమల

ముల జంట. శుభలక్షణములు, రాజ చిహ్నములు అయిన నాగలి, వజ్రాయుధము, అంకుశము, పతాకము, విల్లు, శంఖము, చక్రము, కల్ప వృక్షము, పద్మము అనువాటిచే నొప్పి ప్రకాశమానమై యున్నది. గొప్ప ప్రభావము గలవి కనుకనే రాయిగా పడియున్న అహల్యకు శాపవిమోచన గలిగించినవి. అట్టి నీ పాద ద్వయమును ఎల్లప్పుడు నా హృదయమున నిలుపవలసినదిగా నిన్ను ప్రార్థించుచున్నాను. నా కోరికను తీర్పుము.

**33)** **జలనిధిలోన దూఁటి, కులశైలముమీటి,**
**ధరిత్రిఁగొమ్మునన్**
**దలవడమాటి, రక్కసుని యాగముఁగీటి, బలీంద్రునిన్**
**రసా**
**తలమున మాటి, పార్థివకదంబముఁగూల్చినమేటి,**
**రామ! నా**
**తలఁపున నాటి రాగదవె! దాశరథీ! కరుణాపయోనిధీ॥**

ప్రతిపదార్థము :-

జలనిధిలోనన్ = సముద్రములో; దూఁటి = పొడిచి; కులశైలమున్ = మందరపర్వతమును; మీటి = పైకెత్తి; ధరిత్రిన్ = భూమిని; కొమ్మునన్ = కోఱయందు; అలవడన్ = ఏర్పడునట్లు; మాటి = మఱుగుపఱచి; రక్కసుని సంగమున్ = రాక్షసుని శరీరమును; గీటి = గోళ్ళతోచీల్చి; బలీంద్రునిన్ = బలిచక్రవర్తిని, రసాతలమునన్ = పాతాళమునకు; మాటి = త్రొక్కి; పార్థివకదంబమున్ = రాజసముదాయమును; కూల్చిన = చంపిన; మేటి = గొప్పవాడవు; (అయిన) రామ = శ్రీరామచంద్రా; నాతలఁపునన్ = నా హృదయమున; నాటి = నెలకొల్పి; రాఁగదవె = రమ్ము; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ శ్రీమన్నారాయణ స్వరూపా! యదుకులభూషా! నీవు అవతార పురుషుడవు. మత్స్యరూపముదాల్చి సముద్రములో దాగియున్న సోమకాసురుని సంహరించి వేదములను దెచ్చి బ్రహ్మదేవునికిచ్చినావు. మేటి తాబేటి రూపము ధరించి కవ్వముగా చేయబడిన మందరపర్వతమును సముద్రమున మునుగనీయక పయికెత్తినావు. వరాహరూపమున సముద్రమున మునిగియున్న భూదేవిని పైకెత్తి రక్షించినావు. నృసింహావతారమెత్తి హిరణ్యకశపుని సంహరించి భక్తుడైన ప్రహ్లాదుని కాపాడినావు. వామన స్వరూపమున బలిచక్రవర్తిని పాతాళమునకు అణగద్రొక్కినావు. పరశురాముడవై దుర్మార్గులైన రాజసమూహమును గొడ్డలిచేదునుమాడినావు. అట్టి అవతారపురుషుడవైన నీవు నా హృదయమున స్థిరముగా నిలిచి నన్ను కాపాడుటకు నిన్ను మిక్కిలిగా వేడుకొనుచున్నాను. నా మొఱ ఆలకింపుము.

34) ఖండనభీముఁడార్త జనబాంధవుఁడుజ్జ్వలబాణతూణకో
దండ కళాప్రచండ భుజతాండవకీర్తికి రామమూర్తికిన్
రెండవ సాటిదైవమిఁక లేఁడనుచున్ గడగట్టి భేరికా
డాండడ డాండ డాండ నినదంబుల జాండము
నిండమత్తవే
దండమునెక్కి చాటెదను దాశరథీ! కరుణాపయోనిధీ॥

**ప్రతిపదార్థము :-**

ఖండన భీముఁడు = యుద్ధభూమియందు భయంకరమైనవాడు; ఆర్తజన = కష్టములందు మునిగితేలుచున్న జనులకు; బాంధవుఁడు = ఆధు

కొని చుట్టమువలె కాపాడువాడు; ఉజ్జ్వల=ప్రకాశమానమైన; బాణ=బాణములతోడను; తూణ=అమ్ములపొదితోడను; కోదండ=విల్లుతోడను (కూడిన) కళా=విద్యయందు; ప్రచండ=భయంకరమైన; భుజ=భుజములుగల; తాండవమూర్తికిన్=నాట్యముచేయు స్వరూపముగలవాడైన; రామమూర్తికిన్=శ్రీరామచంద్రమూర్తికి; రెండవసాటిదైవము=సమానమని చెప్పదగిన వేఱొక దేవుడు; ఇఁకన్=ఇంతకుముందు; లేఁడు+అనుచున్=లేడని గట్టిగా పలుకుచు; గడ+కట్టి=జెండానెత్తి; భేరికా=ఢంకాలయొక్క; డాండడడాండడాండ నినదంబులు=డాం, డాం, అను శబ్దములు; అజాండము నిండన్=బ్రహ్మాండము నిండునట్లుగా; మత్తవేదండమును+ఎక్కి = మదగజమునెక్కి; చాటెదను = చాటించెదను; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ సీతామనోహరా! నవ్యనవనీతచోరా! యుద్ధములందు నీవు శత్రుసంహారము గావించునపుడు శత్రువులకు మిక్కిలి భయమును కలిగించువాడవనియు, కష్టదశలో నున్నప్పుడు నిన్ను ఆర్తితో స్మరించిన వారికి సమీపబంధువువలె ఆదుకొని కాపాడువాడవనియు, మిక్కిలి ప్రకాశించు బాణములు, అమ్ములపొది, ధనుస్సు మొదలగువాని నుపయోగించు విద్యయందు నేర్పరివై భయంకరమగు భుజద్వయము నాట్యమాడునట్లు చేయగలవాడవనియు, ప్రసిద్ధిగాంచిన కీర్తిగలవాడవు. అట్టి మా శ్రీరామచంద్రమూర్తికి పై విషయములలో సాటివచ్చు వేరొక దేవుడు లేడని జెండా ధరించి మిక్కిలిగా ధ్వనించు నగారాతో డాం, డాం, డాం, డాం అని మ్రోగించుచు మదపుటేనుగునెక్కి బ్రహ్మాండ భాండమంతయు దద్దరిల్లిపోవునట్లుగా చాటించెదను. నీ కీర్తి దిగంత విశ్రాంతమైనదిగదా! దయయుంచి నన్నేలుకొనుము.

35 ) అవనిజకన్నుదోయి తొగలందు వెలింగెడుసోమ! జానకీ
కువలయనేత్రగబ్బి చను(గొండలనుండు ఘన(బ, మైథిలీ
నవనవయౌవనంబను వనంబునకున్ మదదంతివీవెకా(
దవిలి భజింతు నెల్లపుడు దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

అవనిజ=భూపుత్రియైన సీతాదేవియొక్క; కన్నుదోయి=కన్నుల జంటయనెడి; తొగలందున్=కలువపూవులయందు; వెలింగెడు=ప్రకాశించునట్టి; సోమ=చంద్రుని వంటివాడవు; జానకీకువలయనేత్ర=నల్లకలువలవంటి నేత్రములు గల్గిన జనకరాజ పుత్రియైన సీతాదేవియొక్క; గబ్బి=ఔన్నత్యముతోనొప్పు; చను(గొండలన్=స్తనములనెడు కొండలయందు; ఉండు = ఉండునట్టి; ఘన(బు+అ = మేఘమైనవాడవును; మైథిలీ=మిథిలానగరాధీశుని కుమార్తెయైన సీతాదేవియొక్క; నవనవ=మిక్కిలి నూతనమైన; యౌవనంబు+అను=యౌవనమనెడి; వనంబునకున్=వనమునకు; మదదంతివి=మదపుటేనుగు వంటివాడవును; ఈవెకాన్=నీవేకదాయని; ఎల్లపుడు=అన్నివేళలయందును; తవిలి = మిక్కిలి అభిలాషతోకూడి; భజింతున్=సేవించెదను; దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ సచ్చిదానంద విగ్రహా! అనన్యసాధ్యేంద్రియ నిగ్రహా! నీవు సీతామహాసాధ్వియొక్క నేత్రద్వయమనెడు కలువలయందు ప్రకాశించు

చంద్రుని వంటివాడవు. జానకీదేవి స్తనద్వంద్వమను కొండల నడుమ నుండు నీలమేఘము వంటివాడవు; అవనిజ నిత్యనూతన యౌవనమను వనమున స్వేచ్ఛగా సంచరించు మత్తేభము వంటివాడవు. మా తల్లియైన సీతాదేవినిట్లు ఆనందపఱచు నిన్ను నే నెల్లప్పుడును సేవింతును. నన్ను మఱువకుము.

36) ఖరకరవంశజా! విను మఖండిత భూతపిశాచ ఢాకినీ
జ్వరపరితాప సర్ప భయవారకమైన భవత్పదాబ్జ వి
స్ఫురదురు వజ్రపంజరముఁజొచ్చితి, నీయెడ
దీనమానవో
ద్ధరబిరుదాంకమేమఱకు దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

ఖరకరవంశజా! = సూర్యవంశమున జన్మించిన ఓ శ్రీరామా! వినుము = నామాటలాలింపుము; అఖండిత = వారింపశక్యమువాని; భూత = భూతములు; పిశాచ = పిశాచములు; ఢాకినీ = భేతాళములు; జ్వర = జ్వరములు; పరితాప = దుఃఖములు; సర్ప = పాములు; భయ = (పైవానివలననైన) భయములను; వారకము + ఐన = పోగొట్టునదైన; భవత్ = మీ యొక్క; పద + అబ్జ = పాదపద్మములనెడు; విస్ఫురత్ = మిక్కిలిగా ప్రకాశించుచున్న; ఉరు = గొప్పదైన; వజ్రపంజరమున్ = వజ్రమయమైన పంజరమును; చొచ్చితిన్ = ప్రవేశించితిని; నీయెడన్ = నీయందు నిలిచియున్న; దీనమానవ + ఉద్ధర = దీనులైన జనులను కాపాడునట్టి; బిరుద +

అంకమున్ = బిరుదైన చిహ్నమును; ఏమఱకు = మఱచిపోకుము; దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ పురుషోత్తమా! సమస్త సద్గుణ సత్తమా! భూతపిశాచ ఢాకినీ పరివారము, జ్వరము, దుఃఖము, సర్పాది విషజంతువుల వలన గలుగు ఉపద్రవమున్నగువాని నుండి రక్షింప శక్తిగలయట్టి నీ పాదకమలము లనెడు వజ్రమయపంజరమును నేను ప్రవేశించి నిన్ను శరణు వేడుచున్న వాడను దీనుడను. స్థిరముగా నిలిచియున్న శరణాగతత్రాణ బిరుదాంకుడవు కాన ఆ బిరుదమును నీవు మరువక నన్ను కాపాడుము.

37) జుర్రెదమీకథామృతము జుర్రెదమీపదకంజతోయమున్
జుర్రెదరామనామమున జొబ్బిలుచున్నసుధారసంబు; నే
జుర్రెద జుఱ్ఱు జుఱ్ఱు గరుచుల్ గనువారి పదంబుగూర్పవే
తఱ్ఱులతోడి పొత్తిడక దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

మీకథామృతమున్ = మీ కథలయందలి అమృతమును; జుర్రెదన్ = సంతోషముతో శబ్దము కలుగునట్లుగా త్రాగువాడను; మీ పదకంజ తోయమున్ = మీ పాదపద్మములను అభిషేకించిన ఉదకమును; జుర్రెదన్, రామనామమునన్ = నీ పవిత్ర నామమునందు; జొబ్బిలుచున్న = స్రవించు చున్న; సుధారసంబున్ = అమృతరసమును; జుర్రెదన్; తఱ్ఱులతోడి పొత్తు + ఇడక = నీచులతో సహవాసమును కలుగనీయక; జుఱ్ఱుజుఱ్ఱుగన్ =

ధ్వని కలుగునట్లుగా త్రాగి; రుచుల్ గనువారి పదంబున్ = రుచులను గ్రహించి అందలి ఆనందమున ననుభవించినవారి స్థానమును; కూర్పవే = కలుగజేయుమా; దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ రఘురామా; తారకనామా! మీ పవిత్ర చరిత్రమైన శ్రీ మద్రామాయణమునందుగల అమృతరసమును పానము చేసెదను. మీ పాద కమలముల నభిషేకించిన గంగామృతమును జుర్రెదను. మీ నామస్మరణ మాత్రమున పుట్టిన అమృతరసమును దోసిలితో త్రాగెదను. అందుచే మీ నామస్మరణ గావింపని నీచుల సహవాసమును నాకు గూర్పక మీ నామ స్మరణామృతమును జుఱ్ఱుజుఱ్ఱుగజుఱ్ఱి యందలి రుచులననుభవించిన భాగవతోత్తముల పొత్తును నాకు కలుగజేసి నన్ను కాపాడుటకు వేడుకొనుచున్నాను కాన నా మొఱ ఆలకింపుము.

38) ఘోరకృతాంతవీరభటకోటికి గుండెదిగుల్, దరిద్రతా
కార పిశాచసంహరణకార్యవినోది, వికుంఠమందిర
ద్వారకవాటభేది; నిజదాసజనావళికెల్లప్రొద్దు నీ
తారకనామ మెన్నకొన దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

ఎన్నకొనన్ = ఆలోచించిచూడగా; నీ తారకనామము = భవతారకమైన "రామ" అనెడి నీ నామము; ఘోర = భయంకరమైన; కృతాంత = యముని యొక్క; వీరభటకోటికిన్ = వీరభటుల సమూహమునకు; గుండె

దిగుల్ = గుండెలో దిగులు పుట్టించునది; దరిద్రత + ఆకార = దారిద్ర్య రూపమును ధరించిన; పిశాచ = పిశాచమును; సంహరణ = చంపుటయనెడి; కార్య = కార్యమునందు; వినోది = ఆనందించునది; నిజ = తనయొక్క; దాసజన + ఆవళికిన్ = సేవకజనసమూహమునకు; ఎల్లప్రొద్దు = ఎల్లకాలము వికుంఠమందిర = వైకుంఠమనెడి మహాభవనము యొక్క; ద్వార = ద్వారము యొక్క; కవాట = తలుపును; భేది = విడదీయునట్టిది; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ భక్తజన సంసేవితా! సకల మునిజన సంభావితా! నీ పవిత్ర నామము భవతారకము. నీ నామస్మరణ గావించువారిని సమీపించుటకు భయంకరులైన యమభటుల గుండెలలో దిగులు పుట్టును పిశాచరూపమున నీ లోకమునందలి మానవులను పీడించు దరిద్రదేవతను పారద్రోలుట మీ నామమునకొక వినోదము తుదిని నీ దాసజనులను వైకుంఠమును జేర్పగలది నీ నామము. అందుచే నేనట్టి తారకనామ స్మరణమును విడువను. నన్ను తరింపజేయుము.

39) విన్నపమాలకించు రఘువీర! నహిప్రతిలోకమందు నా
తన్న దురాత్ముఁడుం; బరమకారుణికోత్తమ;
వేల్పులందు నీ
కన్న మహాత్ముఁడుం; బతితకల్మషదూరుఁడు లేఁడు
లేఁడు వి
ద్వన్నుత! నీవెనాకుగతి దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

రఘువీర=రఘువంశమునందు వీరుడవైనవాడా; విన్నపమున్= నా మనవిని; ఆలకింపుము=వినుము; లోకమందున్=ఈ ప్రపంచము నందు; నాకన్నన్ + దురాత్ముఁడున్ = నాకంటె మించినదుర్మార్గుడు గాని; ప్రతి=నాతో సమానమైన పాపుడుగాని; నహి=లేదు; పరమ కారుణిక+ఉత్తమ=మిక్కిలి దయాకరలో శ్రేష్ఠుడైనవాడా; వేల్పు లందున్=దేవతలయందు; నీకన్నన్=నీకంటె; మహాత్ముఁడున్= మహత్త్వము గలవాడుగాని; పతిత=పాపులయొక్క; కల్మష=పాపము లను; దూరుఁడు=నాశమునొందించువాడుగాని; లేఁడులేఁడు=ముమ్మాటికిని లేడు; విద్వత్+నుత=విద్వాంసులచే పొగడబడువాడా; నాకున్=నాకు; నీవె=నీవే; గతి=శరణము; దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ జానకీమనోనాయకా! భక్తజనాభీష్టదాయకా ఎచ్చట వెదకి చూచినను నా కంటె దుర్మార్గుడు వేరొకడు కానరాడు. ఇకనో దయామయా దేవతలలో ఏ యొక్కడును నీకంటె మహాత్ముడును, పతితపావనుడును ముమ్మాటికిలేడు. నేను పాతకుడను గాన నా పాపములను హరించుటకు నీవే సమర్థుడవు. పండితులు గూడ నిన్ను స్తుతించుచుందురుగాన నీవే నన్ను కాపాడుటకు శక్తిగలవాడవనియు, నీవే నాకు దిక్కు అనియు నిన్ను శరణు వేడుచున్నాను. నా మనవి నాలకింపుము.

40) పెంపను దల్లివై, కలుషబృంద సమాగమమొంద
కుండ ర
క్షింపను దండ్రివై, మెయివసించు దశేంద్రియ
రోగముల్ నివా
రింపను వెజ్జువై, కృపగుఱించి పరంబు దిరంబు
గాఁగ స
త్సంపదలియ్య నీవెగతి దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము —

పెంపను=పోషించుటకు; తల్లివై=తల్లితో సమానుడవై; కలుష బృంద సమాగమము=పాపసముదాయముయొక్క కూడిక; ఒంద కుండన్=సమీపింపకుండ; రక్షింపను=కాపాడుటకు; తండ్రివై= తండ్రితో సమానుడవై; మెయిన్=శరీరమునందు; వసించు=నివాసము చేయుచున్న; దశ+ఇంద్రియరోగముల్=పదియైన ఇంద్రియములకు సంబంధించిన వ్యాధులను; నివారింపన్=పోగొట్టుటకు; వెజ్జువై= వైద్యుడవై; కృపగురించి=కనికరముచూపి; పరంబు=మోక్షము; తిరంబుగాన్=స్థిరమగునట్లు; సత్+సంపదలు=సద్గుణ సంపత్తులను; ఇయ్యన్=ఇచ్చుటకు; నీవె=నీవే; గతి=దిక్కు; దాశరథీ! కరుణా పయోనిధీ!!

భావము :-

ఓ దుష్టదానవసంహారకా! పారిజాతాపహారకా! నన్ను బాల్య

మాదిగ పెంచి పోషించుటకు తల్లివలెను, దుర్గుణ సమూహము నన్ను చేరకుండ రక్షించుటకు తండ్రివలెను, నా శరీరమును నివాసస్థానముగా జేసికొనియున్న జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములకు సంబంధించిన వ్యాధులను పోగొట్టుటకు వైద్యునివలెను, కాపాడి ముక్తిని ప్రసాదింపగల సత్సంపదలిచ్చుటకు నీవే దిక్కు అని నిన్నే నమ్మియున్నాను. నా యందు దయజూపుము.

41) కుక్షినజాండపంక్తులొనఁగూర్చి చరాచర జంతు
కోటి సం
రక్షణ సేయు తండ్రివి పరంపర నీతనయుండనైన నా
పక్షము నీవుగావలదె? పాపములెన్ని యొనర్చినన్ జగ
ద్రక్షక! కర్తవీవెగద, దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

కుక్షిన్=గర్భమునందు; అజాండపంక్తులు = బ్రహ్మాండముల యొక్క వరుసలు; ఒనగూర్చి=సమకూర్చి; చరాచరజంతుకోటిన్= తిరుగునట్టియు; తిరుగక స్థిరముగానున్నట్టియు ప్రాణికోటిని; రక్షణ సేయు=రక్షించునట్టి; తండ్రివి=తండ్రియైనవాడవు; పరంపరన్= అప్పటినుండి వరుసగా వచ్చుచున్నతరతరములవారిలో; నీతనయుండను+ ఐన=నీ పుత్రుడనైన; నా పక్షము=నాయొక్క సహాయుడవు; నీవు= నీవు; కావలదె=కావలయునుగదా! జగత్+రక్షక=ప్రపంచమునుకాపాడు వాడా! పాపములు+ఎన్ని యొనర్చినన్=ఎన్ని పాపకార్యములాచరించినను; కర్తవు+ఈవెగద=సృష్టికర్తవు నీవేకదా! దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :—

ఓ శ్రీరామచంద్రా! యాదవేంద్రా! చరాచర ప్రాణిసమూహమును నీ కుక్షియందు ధరించి బ్రహ్మాండములను మరల మరల సృష్టించుచు సంరక్షించు తండ్రివి నీవేకదా! నాకు ఇంతవరకు గల్గిన జన్మలకు కారణ భూతుడవైన తండ్రివి నీవేకదా! తండ్రి కుమారుని పక్షమునే వహించుట ధర్మముగదా! నీ వెరుగనిదేమున్నది? జగత్తులను రక్షించు కర్తవు నీవేగాన నీ తనయుడనైన నేను ఎన్ని పాపములొనర్చినను నన్ను కాపాడు భారము నీదేసుమా! నన్నేలుకొనుము.

42) గద్దరియోగిహృత్కమల గంధరసానుభవంబుఁ
జెందు పె
న్నిద్దపు గండుఁదేఁటి ధరణీసుత కౌఁగిలిపంజరంబునన్
ముద్దులుగుల్కు రాచిలుక ముక్తినిధానము రామ
రాఁగదే
తద్దయు నేఁడు నాకడకు దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :—

గద్దరియోగి=ధీరులైన మహామునులయొక్క; హృత్కమల= హృదయమను కమలముయొక్క; గంధరస+అనుభవంబున్=సువాసనతో గూడిన మకరందముయొక్క ఆస్వాదమును; చెందు=అనుభవించునట్టి; పెనునిద్దపు=గొప్ప ప్రకాశమానమైన; గండుఁదేఁటి=బలముగలతుమ్మెద; ధరణీసుత=సీతాదేవియొక్క; కౌఁగిలిపంజరంబునన్=కౌగిలి యనెడు పంజరమునందు; ముద్దులుగుల్కు=ముద్దుగా సంచరించు; రాచిలుక=

రామచిలుక; ముక్తి నిధానము = మోక్షపు నిధి (అయిన); రామ = శ్రీరామా; నేఁడు = ఇప్పుడే; ఈ దినముననే; తద్దయున్ = తప్పక; నా కడకున్ = నా దగ్గరకు; రాఁగదే = రావలసినది సుమా! దాశరథీ! కరుణాపయోనిధీ॥

**భావము :—**

ఓ విదురా క్రూరవరదా! వేణునాద విశారదా! మహానుభావులైన యోగుల హృదయ కమలములందలి మకరందమును గ్రోలి పరవశము నందు తుమ్మెదవంటి వాఁడా! సీతా మహాసాధ్వి కౌగిలియనెడు పంజరమున ముద్దులుగుల్కు రామచిలుక వంటివాఁడా! నన్ను కరుణించి నా సమీపమునకు వచ్చి నన్ను రక్షించుటకు అభయమీయుమా!

**43) కలియుగ మర్త్యకోటి నినుఁ గన్గొనరాని విధంబొ! భక్త వ**
**త్సలత వహింపవో? చటుల సాంద్ర విపద్దశవార్ధిఁ గ్రుంకుచోఁ**
**బిలిచిన బల్కవింతమఱపే? నరులిట్లనరాదుగాక? నీ**
**తలఁపున లేదె సీతచెఱ? దాశరథీ! కరుణాపయోనిధీ॥**

**ప్రతిపదార్థము :-**

కలియుగ = కలియుగమునందలి; మర్త్యకోటి = మానవ సమూహము; నినున్ = నిన్ను; కన్గొనరాని విధంబొ = చూడరాదను నియమమా? భక్తవత్సలత = భక్తుల విషయమై వాత్సల్యమును కలిగి యుండుటను; వహింపవో = తాల్పవో; చటుల = చలించునట్టి; సాంద్ర = గొప్పదైన;

విపత్+దశ వార్ధిన్=ఆపదయనెడి సముద్రమునందు: క్రుంకుచోన్=మునిగియున్నప్పుడు; పిలిచినన్ = మొఱపెట్టి పిలువగా; పల్కవు=మాటాడవు; ఇంతమఱుపే=ఇంతటిపరాకా? నరులు=మానవులు; ఇట్లు=ఈ విధముగా నీకు మఱపు కలదని; అనరాదుగాక=అనుచు పలుకరాదు కదా! నీ తలంపునన్=నీ మనస్సునందు; సీత చెఱ=సీతాదేవి యొక్క ఆపద; లేదె=లేకున్నదా? దాశరథీ! కరుణాపయోనిధీ॥

**భావము :-**

ఓ సుమిత్రా పుత్ర సేవితా! భక్త జన భావితా! ఈ కలియుగమునందలి మహా పాపులైన జనులకు నీ దర్శన మీయరాదను నియమమా? లేదా నీ భక్తులపై నీకు గల వాత్సల్యము తగ్గినదా? కానిచో ఆపత్సముద్రమున మునిగి బాధపడుచున్న జనులు నిన్ను స్మరించి ప్రార్థించినను ఏల పలుకకున్నావు? భక్త రక్షణయందు నీకు మఱపు కలదని చెప్పుటకును వీలులేదు. ఏలయన నీ ప్రియురాలైన సీతాదేవి రావణాసురునిచే పడిన బాధలను నీవు మరచిపోలేదు గదా? అట్లే నన్నును మఱువక పాలింప వేడుకొనుచున్నాను. కరుణింపుము.

44) జనవర! మీ కథాళి విననైపక కర్ణములందు ఘంటికా
నినద వినోదముల్ సలుపు నీచునకున్ వరమిచ్చి
నావు, ని
స్సనయము నమ్మికొల్చిన మహాత్ములకేమి
యొసంగెదో సనం
దననుత! మాకొసంగుమయ
దాశరథీ! కరుణాపయోనిధీ!!

## ప్రతిపదార్థము :-

జనవర=ఓ మహాప్రభూ! మీకథ+ఆళి=మీ యొక్క లీలలను దెల్పు కథల సమూహమును; వినన్=వినుటకు; సైపక=సహించక; కర్ణములందున్=చెవులయందు; ఘంటికా=గంటల యొక్క; నినద= ధ్వనులచే గలుగు; వినోదముల్ సలుపు=వేడుకగా కాలము గడపునట్టి; నీచునకున్=పాపికి; వరము+ఇచ్చినావు=కోరిన కోరిక లొసంగినావు; సనందన నుత = సనందనుడను మహాత్మునిచే స్తుతింపబడినవాడా; నిన్నున్=నిన్ను; అనయము=ఎల్లప్పుడు; నమ్మి=నమ్ముకొని; కొల్చిన =సేవించిన; మహాత్ములకున్=మహాభక్తులకు; ఏమి యొసంగెదో=ఏమి ప్రసాదించెదవో; దానినే, మాకున్ + ఒసంగుము + అయ=మాకీయు మయ్య; దాశరథీ! కరుణాపయోనిధీ!

## భావము :-

ఓ మునిజన సంస్తుతా! సర్వవేద స్తుతా! మీ లీలలతో గూడిన కథలను వినుటకిష్టములేక చెవులకు గంటలు కట్టుకొని, ఆ ఘంటా నాదముచే వినోదించుచు తిరుగు ఘంటా కర్ణుడను మహాపాపునకు అతడు కోరిన వరములిచ్చి సంతోషపరచితివి గదా! అట్టి నీచునకే వరములిచ్చి నప్పుడు నిన్నెల్లప్పుడు మనస్సున నిల్పి సేవించు భక్తజనుల కెట్టి వర ములు ప్రసాదింప సమకట్టితివో, సనక సనందనాది మునులచే స్తుతింప బడు నీవు మాకును అట్టి వరములనే ప్రసాదించి మా భవ బంధముల నూడ బెరుక వేడుకొనుచున్నాను. నా ప్రార్థనను మన్నింపుము

45) పాపములొందువేళ, రణపన్నగ భూత భయ
జ్వరాదు లం
దాపద నొందువేళ, భరతాగ్రజ! మిమ్ము భజించు
వారికిన్
బ్రాపుగ నీవుఁ దమ్ముఁడిరుపక్కియలంజని,
తద్విపత్తి సం
తాపము మాన్పి కాతురఁట!
దాశరథీ! కరుణాపయోనిధీ॥

**ప్రతిపదార్థము :-**

పాపములు + ఒందు వేళన్ = పాపములు దరిజేరిన సమయము నందును; రణ = యుద్ధము వలనను; పన్నగ = పాములవలనను; భూత = పిశాచముల వలనను; భయ = భయము వలనను; జ్వర + ఆదులందున్ = జ్వరము మున్నగువాని వలనను; ఆపదన్ + ఒందు వేళన్ = బాధలు కలిగిన వేళలందు; భరత + అగ్రజ = భరతునికంటె పెద్దవాడవైన ఓ శ్రీరామా! మిమ్మున్ = మిమ్ములను; భజించువారికిన్ = మీ నామస్మరణము గావించుచు సేవించు వారికి; నీవున్ = నీవును; తమ్ముడు = సోదరుడైన లక్ష్మణుడును; ఇరుపక్కియలన్ = రెండు ప్రక్కలను; ప్రాపుగన్ = అండగా; చని = వెళ్ళి; తత్ + విపత్తి = ఆ ఆపదచే గలిగిన; సంతాపమున్ = బాధను; మాన్పి = పోగొట్టి; కాతురు + అఁట = కాపాడెదరట గదా! దాశరథీ కరుణాపయోనిధీ॥

**భావము :-**

ఓ యుద్ధ విశారదా! భక్తాభీష్టవరదా! మానవులను పాపములు చుట్టుముట్టినప్పుడును, యుద్ధము, విషజంతువులైనసర్పాదులు, భూతప్రేత

పిశాచాదులు, వ్యాధులు మొదలగువాని వలన ఆపదలు గలిగినపుడు వారు మిమ్ములను ఆర్తితో ప్రార్థించిన యెడల, నీవును నీ తమ్ముడు లక్ష్మణుడును, వారికి రెండు ప్రక్కలను నిలిచి ఆ ఆపదల వలన గలిగిన పరితాపమును పోగొట్టుదురని అనుభవజ్ఞులైన పెద్దలు చెప్పగా విన్నాము గాన మమ్ము భవబంధాదుల వలన గలిగిన భయము నుండి రక్షించుటకు సర్వదా మిమ్ము సేవింతుము. మమ్ము కాపాడుము.

46) అగణిత జన్మకర్మదురితాంబుధిలో బహుదుఃఖ
వీచికల్
తెగిపడనీఁదలేక జగతీధవ! నీపదభక్తినావచేఁ
దగిలి తరింపఁగోరితిఁబదంపడి నాదుభయంబుమాన్పవే
దగదని చిత్తమందిడక దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :—

అగణిత=లెక్కపెట్టుటకు శక్యముకాని: జన్మకర్మ=జన్మములలో గావించిన చేతలయొక్క; దురిత+అంబుధిలోన్=పాపములనెడు సముద్రములో; బహుదుఃఖవీచికల్=పెక్కుదుఃఖములనెడు కెరటములు; తెగిపడన్=ఎగిరి ముక్కలుముక్కలై మీదపడుచుండగా; ఈఁదలేక=ఈదిదాటలేక; జగతీధవ=ఓ జగన్నాథా; నీ=నీయొక్క; పదభక్తి=పాదములయందలి భక్తియనెడు; నావచేన్=ఓడచేత; తగిలి=కోరికగలిగి; తరింపఁగోరితిన్=దాటదలచితిని; పదంపడి=మఱియు; తగదు+అని=కూడదని; చిత్తమందున్+ఇడక=మనస్సున తలపక; నాదుభయంబున్=నాయొక్క భయమును; మాన్పవే=పోగొట్టవా! దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ సర్వలోక హితకరా! కరుణాకరా! నేనింతవరకెత్తిన జన్మలలో గావించిన పాపపుంజములు సముద్రపుటలలవలె నెగిరి మీదబడుచు నన్ను లేవనీయక అణగద్రొక్కుచుండగా నాకు నీపాద భక్తియను నావ దొరికినది. ఆ నావ సహాయమున ఈ పాపపుంజమును త్రోసివైచి భవసముద్రమును దాటుటకు యత్నించుచున్నాను. ఇందులకు వీడు తగడని తలంపక ఈ భవజలధిని దాటింప వేడుకొనుచున్నాను. నామొఱ నాలకింపుము.

47) **నేనొనరించు పాపములనేకములైనను నాదు జిహ్వకున్**
**పానకమయ్యె మీపరమపావననామము, తొంటి**
**చిల్క రా**
**మా! ననుఁగావుమన్న తుదిమాటకు సద్గతిఁజెందెఁ**
**గావునన్**
**దాని ధరింపఁగోరెదను దాశరథీ! కరుణాపయోనిధీ॥**

**ప్రతిపదార్థము :-**

నేను=నేను; ఒనరించునట్టి=చేయునట్టి; పాపములు=పాపములు; అనేకములు+ఐనన్=లెక్కకు మిక్కిలిగా నున్నప్పటికిని; నాదు జిహ్వకున్=నా నాలుకకు; మీ పరమ పావన నామము = పరమ పవిత్రమైన "రామ" అను మీ నామము; పానకము+అయ్యెన్=పానకముతో సమానమైనది అయ్యెను; తొంటి=పూర్వకాలమునందలి; చిల్క=ఒక చిలుక; "రామా" ననుఁగావుము+అన్న="ఓరామచంద్రా నన్ను రక్షింపుము" అనినట్టి; తుదిమాటకు=చివరగా పలికిన "రామా" అను పలుకునకు; సద్గతిన్+చెందెన్=మోక్షమును పొందెను; కావునన్=అందు

చేత: దానిన్=ఆ రామనామమును: ధరింపన్+కోరెదను=గ్రహింప గోరుదును; దాశరథీ! కరుణాపయోనిధీ॥

భావము :-

ఓ శ్రీరామచంద్రా! యాదవేంద్రా! నేను పెక్కు పాపములొనర్చి నప్పటికి పరమ పవిత్రమైన మీ నామము నా నాలుకకు పానకమువలె సేవింపుటకు బుద్ధి గలుగుచున్నది. పూర్వకాలమున ఒక చిలుక "రామా! నన్ను రక్షింపుము" అని వేడుకొనినంత మాత్రముననే ఆ పక్షిరాజమునకు మోక్షమునిచ్చితివిగదా! అందుచే నేనెల్లప్పుడును నీ దివ్యనామస్మరణమునే గావించెదను, రక్షింపుము.

48) పరధనముల్ హరించి, పరభామలనంటి. పరాన్న
మబ్బినన్
మురిపమకాని, మీదనగు మోసమెఱుంగదు మాన
సంబు, దు
స్తరమిది, కాలకింకరగదాహతిఁబాల్పడనీక మమ్ము నే
తఱిదరిఁజేర్చి కాచెదవొ దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము :-

పరధనముల్=ఇతరుల యొక్క ద్రవ్యములను; హరించి= దొంగిలించి; పరభామలన్+అంటి=ఇతరుల భార్యలను కూడి; పర+ అన్నము+అబ్బినన్=ఇతరుల ఇండ్లయందు భోజనము లభించినను; మురిపము+అ+కాని=సంతోషపడుటేకాని; మీదన్+అగు మోసమున్= అపిమ్మట గలుగు బాధను; మానసంబు=నా యొక్క మనస్సు; ఎఱుం గదు=తెలిసికొనన శక్తిచాలదు; దుస్తరము+ఇది=ఇది దాటశక్యము

కొనట్టి కర్మము; కాలకింకర=యమభటులయొక్క; గదాహతిన్=గదల దెబ్బలకు; పాల్పడనీక=వశముగానీయక; మమ్మున్=మమ్ములను; ఏతఱిన్=ఏ సమయమున; దరిఁజేర్చి=దగ్గరకు చేర్చుకొని; కాచెదవో= రక్షించెదవో; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ శకటాసుర భంజనా! గోపగోపీజనరంజనా! పరుల సొమ్ములను దొంగిలించుట; పరస్త్రీ సాంగత్యము, పరుల చేతియన్నము తినుట మున్నగువాని వలన గలిగిన సౌఖ్యమే పరమ సౌఖ్యమని నా మనస్సు గర్వముతో కూడుకొని సంతోషమును పొందుచున్నది. కాని ఇట్టి పాపములకు అనుభవింపక తప్పని పలమైన యమభటుల గదా ప్రహారములకు నన్ను పాల్పడనీయక నన్నే సమయమున దగ్గరగా జేర్చుకొని కాపాడెదవో గదా, తొందరగా దగ్గరకు తీసికొని నన్ను కాపాడుము నిన్ను వేడెదను.

**49) చేసితి ఘోరకృత్యములు, చేసితిభాగవతాపచారముల్**
**చేసితి నన్యదైవములఁజేరి భజించినవారిపొందు, నేఁ**
**జేసిన నేరముల్ దలఁచి చిక్కులఁబెట్టకుమయ్య,**
**యయ్య, నీ**
**దాసుఁడనయ్య! భద్రగిరి దాశరథీ !**
**కరుణాపయోనిధీ!!**

**ప్రతిపదార్థము :-**

ఘోరకృత్యములు=చేయకూడని పాపపుపనులను; చేసితిన్= చేసితిని; భాగవత+అపచారముల్=భగవద్భక్తులకు కావింపరాని అవమా

నములను; చేసితిన్ = చేసితిని; అన్యదైవములన్ = నీకంటె ఇతరములైన దేవతలను; చేరి = చేరి; భజించినవారిపొందు = సేవించినవారి తోడి స్నేహమును; చేసితిన్ = చేసితిని; ఏన్ = నేను; చేసిన నేరముల్ = చేసినట్టి పై అపరాధములను; తలఁచి = స్మరించి; చిక్కులఁబెట్టకుము + అయ్య + అయ్య = ఓ దేవా నన్ను కష్టములపాలు సేయకుము; నీ దాసుఁడనయ్య = నేను నీకు సేవకుడను; భద్రగిరి దాశరధీ! కరుణాపయోనిధీ!!

**భావము :**

ఓ భూమిజా మనో నాయకా! మోక్షముక్తి ప్రదాయకా? అనేకములైన చేయకూడని పనులను చేసి యున్నాను. పరమ భాగవతోత్తముల యెడ పెక్కు అపరాధములను గావించియున్నాను. నిన్ను గాక క్షుద్ర దేవతలను ఆరాధించిన వారితో స్నేహము చేసి యున్నాను. ఇట్టి నా నేరములను భావించి నన్ను కష్టములపాలు సేయకుము. నేనిప్పుడు నీకు సేవకుడను కరుణింపుము.

**50)** పరుల ధనంబుఁజూచి పరభామలఁజూచి
హరింపగోరు మ
ద్గురుతర మానసంబనెడు దొంగను బట్టి నిరూఢ
దాస్య వి
స్ఫురిత వివేకపాశములఁ జుట్టి భవచ్చరణంబ నే మరు
త్తరువునఁగట్టివేయఁగదె దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :—**

పరుల ధనంబున్ = ఇతరుల యొక్క డబ్బును; చూచి = చూచి;

పరభామలన్=ఇతర స్త్రీలను: చూచి=చూచి హరింపన్+కోరు= దొంగిలించుటకు ఆసపడునట్టి; మత్=నా యొక్క: గుచతర=మిక్కిలి గొప్పదైన; మానసంబు+అనెడు=మనస్సు అనునట్టి; దొంగను+పట్టి= దొంగను పట్టుకొని; నిరూఢ=ప్రసిద్ధికెక్కిన; దాస్య = సేవచేత; విస్ఫురిత=మిక్కిలి ప్రకాశము నందిన; వివేక=ఈశ్వర విషయమైన జ్ఞానమనెడు; పాశములన్=త్రాళ్ళచేత: చుట్టి = మెలివేసి; భవత్= చరణంబు+అనే=నీ పవిత్రమైన పాదములను నట్టి: మరుత్+తరువునన్ =కల్పవృక్షమునందు; కట్టివేయన్ + కదె = బంధించివేయు గదవే: దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ సచ్చిదానంద విగ్రహా! అరిషడ్వర్గ నిగ్రహా! నా మనస్సు ఇతరుల ధనములను హరింప జూచుచున్నది. అట్లే పర భార్యలను పొంద గోరుచున్నది. ఇక నీ పాద పద్మములు కల్పవృక్షము వంటివి. అందుచే నా దొంగ మనస్సును పట్టుకొని బంధించి సర్వదా నిన్ను సేవించు వివేకమును గల్పించి దానిని నీ పాదపద్మములందు నిలుచునట్లు కట్టివేయుటకు ప్రార్థించుచున్నాను. అట్టి శిక్ష నా మనస్సునకు విధించి దానికి బుద్ధి చెప్పుము. దేవా! నిన్ను ప్రార్థింతును.

**51)** **సలలిత రామ నామ జపసార మెఱుంగను కాశికాపురీ**
**నిలయుఁడ గాను, మీ చరణ నీరజరేణు మహా**
**ప్రభావమున్**
**దెలియన హల్యగాను, జగతీవర! నీ దగు**
**సత్యవాక్యమున్**

దలఁపఁగ రావణాసురుని తమ్ముఁడఁగాను,
భవద్విలాసముల్
దలఁచి నుతింప నా తరమె?
దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

సలలిత = మిక్కిలి మధురమైన; రామనామ జపసారమున్ = రామనామమును జపించుట వలన గలుగు ప్రభావమును; ఎఱుంగను = తెలిసికొనుటకు; కాశికాపురీ నిలయుఁడన్ + కాను = కాశీపట్టణమును నివాస స్థానముగా జేసికొన్న విశ్వనాథుడనుగాను; మీ చరణ నీరజ = మీ పాద పద్మములందలి; రేణు = ధూళి యొక్క; మహా ప్రభావమున్ + తెలియన్ = మాహాత్మ్యము నెరుంగుటకు; అహల్యన్ + కాను = అహల్యాసతిని గాను; జగతీవర = ఓ భూలోకనాథా! నీదగు సత్యవాక్యమున్ = నీ యొక్క సత్యవాక్య పరిపాలనము; తలఁపఁగన్ = ఎంచుటకు; రావణాసురుని తమ్ముఁడన్ + కాను = రావణుని సోదరుడగు విభీషణుడను కాను; భవత్ = నీ యొక్క; విలాసముల్ = లీలలు; తలఁచి = స్మరించి; నుతింపన్ = పొగడుటకు; నా తరమె = నాకు శక్యమా; దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ పురుషోత్తమా! సకల సద్గుణ సత్తమా! నీ పవిత్రమైన రామనామ జప మహత్త్వము ఆ కాశీ విశ్వేశ్వరునికే తెలియును గాని నేనెట్లు తెలిసికొన గలను? నీ పాదపద్మ పరాగ ప్రభావము ఆ సతీమణియైన అహల్యకే గాని నా బోటి అజ్ఞానికెట్లు తెలియుటకు సాధ్యపడును? నీ సత్యవాక్య పరిపాలన వ్రత నియమము ఆ రావణాసురుని తమ్ముడైన

విభీషణునకే తెలియును గాని నా వంటి మూఢునకెట్లు తెలియును? ఇక మీ లీలలను తెలిసికొని వర్ణించుటకు పైవారిలో ఏ ఒక్కరి తోడను సాటి రాని నాకు అలవియగునా? ఓ జగత్ప్రభూ! నా యందు దయయుంచి నన్ను పరిపాలింపుము.

**52)** పాతకులైన మీ కృపకుఁ బాత్రులుకారె తలంచి
చూడఁ జ
త్రాతికిఁగల్గెఁబావన మరాతికి రాజ్య సుఖంబుగల్గె, దు
ర్జాతికిఁ బుణ్యమబ్బెఁ గపిజాతి మహత్త్వము నొందెఁ
గావునన్
దాతవ యెట్టి వారలకు దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

తలంచి చూడన్ = పరిశీలింపగా; పాతకులైనన్ = మహా పాపాత్ములైనను: మీ కృపకున్ = మీ దయకు; పాత్రులుగారె = అర్హులు కారా (అగుదురని భావము) చత్రాతికిన్ = శాపవశముచే పడియున్న నల్లని రాతికి; పావనము + కల్గెన్ = పవిత్రత కల్గెను; అరాతికిన్ = శత్రుపైన విభీషణునకు; రాజ్య సుఖంబు + కల్గెన్ = రాజ్య సుఖము కలిగెను; దుర్జాతికిన్ = తక్కువ కులమున జన్మించిన శబరి మొదలగు వారికి; పుణ్యము + అబ్బెన్ = పుణ్యము కలిగెను; కపిజాతి = కోతుల కులము; మహత్త్వమున్ + ఒందెన్ = గొప్పతనము పొందెను; కావునన్ = అందువలన; ఎట్టి వారలకున్ = ఎటువంటి వారలకైనను; దాతవు + అ = కోరికయే సమస్తమైన కోరికల నిచ్చువాడవు సుమా! దాశరథీ! కరుణా పయోనిధీ!!

**భావము :-**

ఓ త్రిలోకనాయకా! భక్తాభీష్ట వరదాయకా! మహాపాతకులు కూడ నీ దయకు పాత్రులైరి. శాపముచే శిలగా పడియున్న అహల్యను పవిత్రురాలుగా జేసినావుగదా! శత్రుపక్షము వాడనియైనను తలంపక విభీషణునకు లంకారాజ్యదానము గావించినవాడవుగదా! తక్కువకులమున జన్మించిన వారలనియైనను తలంపక శబరి, గుహుడు మున్నగువారికి గూడ మోక్షమును ప్రసాదించినవాడవు గదా! అత్యంత చపలమైన మనస్సు, చేష్టలుగల కోతుల సముదాయముగూడ నీ దయవలన గొప్పమహత్త్వము గలదిగానయ్యెనుగదా! అందుచే నీవు మానవులకేగాక పశుపక్ష్యాదులకు గూడ ముక్తిఫలప్రదాతవు కాన దయానిధీ! నన్ను కాపాడుము.

**53)** మామకపాతక వ్రజముమాన్ప నగణ్యము ;
చిత్రగుప్తులే
మేమని వ్రాతురో? శమనుఁడేమి విధించునో? కాలకింకర
స్తోమ మొనర్చు టేమొ ? వినఁజొప్పడదింతకు
మున్నెదీ నచిం
తామణి! యెట్లుకాచెదవొ? దాశరథీ!
కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

దీన చింతామణి = దీనుల యొక్క కోరికలను తీర్చుటకు చింతామణి వంటివాడా! మామక = నా యొక్క; పాతకవ్రజమున్ = పాపముల సముదాయమును; మాన్పన్ = పోగొట్టుటకు; అగణ్యము = శక్యముగాని పని; చిత్రగుప్తులు = యమధర్మరాజు సమీపమందుండు వ్రాయసగాడైన చిత్ర

గుప్తులు; ఏమి+ఏమి+అని(వ్రాతురో=ఏఏ విధముగా నా పాతకములను గూర్చి (వ్రాయుదురో; శమనుఁడు=యమధర్మరాజు; ఏమి విధించునో= ఆ పాతకములకెట్టి శిక్ష విధించునో; కాలకింకరస్తోమము=యమభటుల సమూహము; ఒనర్చుట+ఏమొ=ఏవిధముగా నన్ను హింసపెట్టుదురో; వినన్+చొప్పడదు=వినుటకుగూడ శక్యముగాకున్నది; ఇంతకుమున్నె= పాపములకు శిక్ష విధించకపూర్వమే; ఎట్లు=ఏవిధముగా; కాచెదవో= రక్షించెదవో; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ దీనజన చింతామణీ! రఘువంశమణీ! నేనొనర్చిన పాపములను లెక్కింప శక్యముగాదు ఈ పాతకములను చిత్రగుప్తుడు తు, చ, తప్ప కుండ (వ్రాసి యమధర్మరాజునకు నివేదించును. ఆ ధర్మమూర్తి నా పాప ముల కెట్టి శిక్షలు విధించునో, ఆ శిక్షలను యమదూతలు నన్ను ఏ విధ ముగా అనుభవించునట్లు చేయుదురో? అట్టి బాధలు నేను అనుభవింపక పూర్వమే నన్ను యమభటుల బారినుండి రక్షించుటకు వేడుకొనుచున్నాను. నన్నెట్లు కాపాడెదవో నీదే భారము.

**54)** దాసినచుట్టమా శబరి దాని దయామతి నేలినావు, నీ
దాసుని దాసుఁడా గుహుఁడు తావక దాస్యమొసంగి
నావు, నేఁ
జేసిన పాపమో వినుతిఁజేసినఁగావవు; కావుమయ్య! నీ
దాసులలోన నేనొకఁడ దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

శబరి=శబరియను కిరాతవనిత; దాసినచుట్టమా=నీకు దగ్గర బంధువా; దానిన్=ఆ శబరిని; దయామతిన్=దయతోకూడినమనస్సుతో;

ఏలినావు=కాపాడినావు; గుహుఁడు=గుహుండను పేరుగల బోయవాడు; నీ దాసునిదాసుఁడా=నీ సేవకునికి సేవకుడా; తావక=నీయొక్క; దాస్యము+ఒసంగినావు=సేవచేయుటకంగీకరించినావు; వినుతిఁజేసినన్=స్తుతించినను: నేఁజేసిన=నేనుచేసికొన్నట్టి; పాపమో=పాపమేమో; కావవు=(నన్ను) రక్షింపవు; కావుము+అయ్య=కాపాడుమయ్యా; నీ దాసులలోనన్=నీ సేవకులలోన: ఏన్+ఒకఁడన్=నేను ఒకడను; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ త్రిలోకరక్షకా! దుష్టనిశాచరశిక్షకా! ఏవిధమైన బాంధవ్యము లేకపోయినను ఎంగిలిగావించి శబరి ఇచ్చిన పండ్లుతిని ఆమెను దయతో కాపాడినావు. నీ దాసులకు గూడ దాసుడుగాని బోయవాడైన గుహునకు నీ పాదప్రక్షాళనము గావించుటకనుగ్రహించినావు. నిన్నునేక విధములుగా ప్రార్థించినను నా పాపమేమోకాని నా మొఱనాలకింపకున్నావు. నీ దాసులలో నొకడనై నిన్ను వేడుకొనుచున్నాను. రక్షింపుము.

**55)** దీక్షవహించినాకొలఁది దీనుల నెందఱఁగాచితో! జగ
ద్రక్షక! తొల్లి యాగ్రుమపదరాజతనూజ తలంచినంతనే
యక్షయమైన పల్వలిడి తక్కటు! నా మొఱఁ
జిత్తగించి ప్ర
త్యక్షముగావదేమిటికి? దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

దీక్షవహించి=నియమమును పూని: నాకొలఁది=నన్ను పోలినట్టి; దీనులన్+ఎందఱన్=పెక్కుమంది దిక్కులేనివారిని; కాచితో=కాపా

డితివో; జగత్+రక్షక=లోకరక్షకుడా; తొల్లి=పూర్వము; ఆ ద్రుపద రాజతనూజ=ద్రుపద పుత్రికయైన ద్రౌపది; తలంచినంతనే=స్మరించిన తక్షణమే; అక్షయమైన=ఎడతెగని; వల్వలు+ఇడితి=చీరలనొసంగితివి; నా మొఱ చిత్తగించి=నా ఆర్తాలాపమును ఆలకించి; అక్కట=అయ్యో ప్రత్యక్షముకావు=దర్శనమీయకున్నావు; అది+ఏమిటికిన్=అట్టులేల దయచూపకున్నావు; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :—**

ఓ దండకారణ్యవిహారీ ఉపనిషద్రాజమార్గ సంచారీ! నా బోటి దీనులను అనేకులను దీక్షనుబూని కాపాడినవాడవుకదా! పాండవపత్నియైన ద్రౌపది నిన్ను తలచినంతమాత్రముననే అక్షయమగు చీరలిచ్చి ఆమె మానము కాపాడినవాడవేగదా! నిన్ను నేను నిత్యమును చాలకాలము నుండి ప్రార్థించుచున్నాను. నా మొఱ నేల ఆలకింపకున్నావు. ఈ దీనునికి దర్శనమిచ్చి రక్షించుటకు ప్రార్థించుచున్నాను.

**56)** నీలఘనాభమూర్తివగు నిన్నుఁగనుంగొనఁగోరి వేఁడినన్
**జాలముచేసి** డాఁగెదవు సంస్తుతికెక్కిన రామనామమే
**మూలను** దాఁచుకోఁగలవు ముక్తికిఁబ్రాపది,
**పాపమూల కు**
**ద్దాలము**గాదె మాయెడల దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :—**

నీలఘన+అభ+మూర్తివి+అగు=నీలమేఘముతో సమానమైన కాంతివంటి కాంతిగల రూపము గలిగినట్టి; నిన్నున్ = నిన్ను; కనుంగొనన్+కోరి=దర్శించుటకు కోరుకొని; వేఁడినన్=ప్రార్థింపగా;

జాలము+చేసి=మాయచేసి; దాఁగెదవు=కనిపింపకుండనున్నావు;సంస్తుతి కెక్కిన=ప్రఖ్యాతివహించిన; రామనామమున్=రామనామమును; ఏ మూలను=ఏ గొందియందు; దాచుకోఁగలవు=కనిపింపకుండ చేయగలవు (చేయజాలవని భావము); అది=ఆ పవిత్రమైన రామనామము; ముక్తికిన్ =మోక్షము నిచ్చుటకు; ప్రాపు=ఆశ్రయమైనది; మా+ఎడలన్=మా వంటి వారి విషయమై; పాపమూల=పాపమనెడు మొదలునకు; కుద్దాలము గాదె=తెగనఱకునట్టి గొడ్డలి వంటిదిగదా; దాశరథీ! కరుణాపయోనిధీ॥

**భావము :-**

ఓ మహాదేవా! వాసుదేవా! నీ దివ్య మంగళ స్వరూపమును కనులార చూచి సేవింపవలెనని నాకు దర్శనమీయవలసినదిగా ఎంత వేడుకొన్నను నా కంట బడకుండ దాగియున్నావు. నీ దివ్య స్వరూపమును దాచగలవు గాని ముక్తిని ప్రసాదింపగలదని మిక్కిలి ప్రసిద్ధికెక్కిన నీ "శ్రీరామ" అను నామమునెట్లు దాచగలవు? దాచలేవుగదా? మోక్షమిచ్చునది ఆ నీ దివ్య నామమేగదా? మా వంటి పాపుల పాపములను సమూలముగా నఱికివేయుటకు పదునైన గొడ్డలి వంటిది గనుకనే నేను నీ పవిత్ర నామమును విడువక స్మరింతును. ధన్యుడనగుటకు ప్రయత్నించెదను. కరుణింపుము.

**57)** వలదు పరాకు, భక్తజన వత్సల! నీ చరితమ్ము
వమ్ము గా
వలదు పరాకు నీ బిరుదు వజ్రము వంటిది, కాన
కూరకే

వలదు పరాకు, నా దురిత వార్ధికిఁ దెప్పవుగా
మనంబులోఁ
దలఁతుమెకా నిరంతరము
దాశరథీ! కరుణాపయోనిధీ!!

## ప్రతిపదార్థము :-

భక్తజన వత్సల=భక్త జనులయందు వాత్సల్యము గలవాడా; పరాకు=ఏమరుపాటు; వలదు=వలదుసుమా; నీ చరితంబు=నీ చరిత్ర; వమ్ము=వ్యర్థము; కావలదు=కాకూడదు; పరాకు=(అట్లయిన) ప్రమాదము; నీ బిరుదు=నీకు గల "ఆర్త త్రాణ పరాయణుడు" అను బిరుదు; వజ్రము వంటిది=వజ్రమువలె భేదింప శక్యముగానిది; కావక=(నన్ను) రక్షింపక; ఊరకే=మిన్నకే; వలదు పరాకు=ఏమఱిక వలదు సుమా; నా దురిత వార్ధికిన్=నా పాపములనెడి సముద్రమునకు; తెప్పవుగా=దాటించుటకు సమర్థమైన నావవుగా; నిరంతరము=ఎల్లప్పుడు; మనంబులోన్=మనస్సులో; తలంతుమెకా=తలంచుచుండెదముకదా; దాశరథీ! కరుణాపయోనిధీ!!

## భావము :-

ఓ పద్మపత్రాయతనేత్రా! నీలమేఘ సన్నిభగాత్రా! ఏమరిక వలదు సుమా! నీ భక్త జనులయందు నీవు మిక్కిలి వాత్సల్యము గలవాడవను నీ గురించిన కథలు వ్యర్థములు గాకూడదు. "శరణాగత రక్షకుడు" "ఆర్త త్రాణ పరాయణుడు" అను నీ బిరుదులు భేదించుటకశక్యములైన వజ్రముల వంటివి. నన్ను రక్షించుట యందు ఏ కొంచెము ఏమఱుపాటును వలదు. పాప సముద్రమున మునిగియున్న మేము మా మన

న్నులో ఎల్లప్పుడును ఆ సముద్రమును దాటింప శక్తి గల నావగా నిన్నే స్మరించుచుందుము. కాన మమ్ములను ఆ పాప సముద్రము నుండి ఉద్ధరించుటకు నిన్ను వేడుచున్నాము రక్షింపుము.

58) తప్పులెఱుంగలేక దురితంబులు చేసితినంటి నీవు మా
యప్పవు, గావుమంటి; నిఁకనన్యులకున్ నుదురంటు,
నంటి, నీ
కొప్పిదమైనదాస జనులొప్పిన బంటుకు
బంటునంటి, నా
తప్పులకెల్ల నీవెగతి దాశరథీ! కరుణాపయోనిధీ॥

## ప్రతిపదార్థము :—

తప్పులు = అపరాధములు; ఎఱుంగలేక = తెలిసికొనుటకు వివేకము లేక; దురితంబులు = పాపకృత్యములు; చేసితిన్ + అంటిన్ = చేసినానని చెప్పుచున్నాను; నీవు = నీవు; మా + అప్పవు = మా తండ్రివి; కావుము + అంటిన్ = రక్షింపుమని వేడుకొనుచున్నాను; ఇఁకన్ = ఇకముందు; అన్యులకున్ = నిన్ను వినా ఇతర దైవతములకు; నుదురు + అంటను + అంటిన్ = తలవంచి సాష్టాంగ నమస్కారము చేయనని పలుకుచున్నాను; నీకున్ = నీకు; ఒప్పిదమైన = నచ్చినట్టి; దాసజనులు = భక్తులు; ఒప్పిన బంటుకున్ = ఇష్టపడినట్టి భక్తునకు; బంటును + అంటిన్ = సేవకుడనని ఒప్పుకొనుచున్నాను; నా తప్పులకున్ + ఎల్లన్ = సమస్తమైన నా పాపములకు; నీవె = నీవే; గతి = శరణము; దాశరథీ! కరుణాపయోనిధీ॥

## భావము :-

ఓ జానకీ మనోభీష్ట దాయకా! త్రిలోక నాయకా! యుక్తాయుక్త

విచక్షణ జ్ఞానశూన్యుడనై అనేకములైన అపచారములను చేసి యున్నానని ఒప్పుకొనుచున్నాను. నిన్నే నేను తండ్రిగా భావించుచు నన్ను కాపాడ వలసినదిగా వేడుకొనుచున్నాను. నేటి నుండి నిన్ను గాక ఇతర దేవత లకు తలయొగ్గి సాగిలబడనని చెప్పుచున్నాను. నీకు సదా సేవలు గావించు దాస జనుల దాసులకు నేను దాసుడనని అంగీకరించుచున్నాను. కాన నా తప్పులను క్షమించి నన్ను కాపాడుమని ప్రార్థించుచున్నాను.

59) ఇతఁడు దురాత్ముఁడంచు జనులెన్నఁగ నారడి గొంటి;
నేనె పో
పతితుఁడనంటిఁబో, పతిత పావనమూర్తి వి నీవుగల్గ నే
నితరుల వేడ నంటి, నిహమిచ్చిన నిమ్ము:
పరంబొసంగు మీ
యతులిత రామనామ మధురాక్షరపాళి
నిరంతరంబు హృ
ద్గతమని నమ్మి కొల్చెదను
దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము :-

ఇతఁడు=ఈతడు; దురాత్ముఁడు+అంచున్ = దుర్మార్గుడనుచు; జనులు=మానవులు; ఎన్నఁగన్=గణింపగా; ఆరడిగొంటిన్=నిందను పొందితిని; నేనెపో=నేనేసుమా; పతితుఁడన్+అంటిన్+పో=పాపాత్ము డనని చెప్పితినిగదా; పతితపావనమూర్తివి=పాపులను పవిత్రులను చేయ గల దైవమవు; నీవు=నీవు; కల్గన్=దొరకగా; ఏన్=నేను; ఇతరు లన్ = వేరుదైవతములను; వేఁడన్+అంటిన్ = ప్రార్థింపనంటిని;

ఇహము=ఇహలోక సుఖములను; ఇచ్చినన్+ఇమ్ము=నీకు దయగల్గిన నిమ్ము; అతులిత=అనుపమానమైన; రామనామ=రామనామమనెడు; మధుర+అక్షరపాళిన్=మిక్కిలి రుచికరమైన అక్షర సముదాయమును; నిరంతరంబు=ఎల్లప్పుడును విడువక; హృద్గతము+అని+నమ్మి=నా హృదయమున స్థిరముగా నున్నదేయని నమ్మి; కొల్చెదను=నిన్ను సేవించెదను; (కావున) పరంబు+ఒసంగుమీ=ముక్తిని ప్రసాదింపుమా; దాశరథీ! కరుణాపయోనిధీ॥

**భావము :-**

ఓ పీతాంబరధారీ! మునిజన హృదయానందకారీ! "ఈతడు పాపాత్ముడు" అని ప్రజలందరు నన్ను నిందించుచున్నారు. నిజముగా నేను పాపాత్ముడనే. కాని పతితపావన స్వరూపుడవగు నీవు నాకు అండగా నుండగా నేనెట్లు పాపుడనయ్యెదను. నీ ప్రాపు నాకు కలుగగానే నితరులను వేడుటెందులకు? నిన్నే సేవించెదనుగాన నీ యిచ్ఛ గల్గిన ఇహ సుఖములనిమ్ము. నీ పవిత్ర నామ మధురాక్షరములైన "రామ" అనువాటిని విడువకుండ నా హృదయమున నిల్పికొని నిన్నే భజింతును. నాకు తప్పక ముక్తిని ప్రసాదింపుము

60) అంచితమైన నీదు కరుణామృతసారము నాదు పైనిఁబ్రో
క్షించినఁజాలు, దాననిరసించెద నా దురితంబు లెల్లఁదూఁ
లించెదవైరివర్గ మెడలించెదఁగోర్కులు, నీదుబంటనై
ధంచెద కాలకింకరుల దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము :-

అంచితమైన=పూజింపబడునట్టి; నీదు=నీయొక్క; కరుణ+అమృత సారమున్=దయామృతసారమును; నాదుపైని=నాపై; ప్రోక్షించినన్+ చాలు=చిలికిన చాలును; దానన్=అందుమూలమున; నా దురితంబులు+ ఎల్లన్=నా యొక్క సమస్తమైన పాపములను; నిరసించెదన్=పోగొట్టు కొనెదను; వైరివర్గమున్=శత్రుసమూహమును; తూలించెదన్=తొలగించు కొనెదను; కోర్కులున్=కోరికలనుగూడ; ఎడలించెదన్=విసర్జించె దను; నీదుబంటను+ఐ=నీ సేవకుడనై; కాలకింకరులన్=యమభటు లను; దంచెదన్ = దూరముగా తరిమివేయగలను; దాశరథీ! కరుణా పయోనిధీ!!

భావము :-

ఓ దాశరథీ! పార్ధసారథీ! నీ కరుణామృతముయొక్క సారపు చినుకులను నాపై కొలదిగ చిలుకరించిన నా పాపములన్నియు పటా పంచలగును. కామక్రోధాది శత్రువర్గమును తరిమివైచెదను. ఇహమునకు సంబంధించిన నా కోరికలను నాశము గావించెదను. నీకు పరిచర్యగావిం చుచు నీకు సేవకుడనై యమభటులను దరిజేరకుండ ప్రహరింపగలను. కాన నాయందు దయజూపుము.

61) జలనిధులేడు నొక్కమొగిఁజిక్కికిఁదెచ్చె శరంబు,
ఊతి నిం
పలరఁగఁజేసె నాతిగఁబదాబ్జపరాగము. నీ చరిత్రమున్
జలజభవాది నిర్జరులు సన్నుతి సేయఁగలేరు,
కావునన్

దలఁప నగణ్యమయ్యె యిది

దాశరథీ! కరుణాపయోనిధీ॥

**ప్రతిపదార్థము :-**

శరంబు=(నీ) బాణము; జలనిధులు+ఏడున్=ఏడు సముద్రములను; ఒక్కమొగిన్=ఒక్కమారుగా; చక్కికిన్+తెచ్చెన్ = ఒక్కచోటికి తెచ్చెను; పద+అబ్జ+పరాగము=(నీ) పాదపద్మముల యందలి దూళి; ఇంపు+అలరఁగన్=అందము ప్రకాశించునట్లుగ; జాతిన్=శిలను; నాతిగన్+చేసెన్=సుందరిగా మార్చెను; జలజభవ+ఆది+నిర్జరులు=బ్రహ్మ మొదలగు దేవతలు; నీ చరిత్రమున్=నీ చరిత్ర యందలి మహత్త్వము మున్నగువాటిని; సన్నుతి+చేయఁగలేరు=స్తుతించుటకు శక్తిలేనివారు; కావునన్=అందుచే; తలఁపన్=ఆలోచించి చూడగా; ఇది=ఈ నీ చరిత్రము; అగణ్యము+అయ్యె=అశక్యమయ్యె; దాశరథీ! కరుణాపయోనిధీ!

**భావము :-**

ఓ రాధామనోనాయకా! సమస్త జగన్నాయకా! నీ చరిత్ర మిట్టి ప్రభావముతో కూడినదని చెప్పుటకు శక్యముకానిది. ఏలయనగా నీబాణము సప్త సముద్రములను కలిపి ఒక్కచోటికి తెచ్చినట్టిది. నీ పాదకమల పరాగము జాతిని నాతిగా చేసినట్టిది. ఇక నీ మహత్త్వమును బ్రహ్మ మొదలైన దేవతలెవ్వరును పొగడుటకు శక్తిగలవారుకారు. ఇట్టి నీ మహిమను వర్ణింపగా మానవులమైన మేమెంతవారము. అయినను మమ్ములను కాపాడుము.

62) కోతికి శక్యమా యసురకోటులఁగెల్వను? గెల్చెఁబో

నిజం

బాతనిమేన శీతకరుఁడౌట దవానలుఁడెట్టి వింత? మా
సీత పతివ్రతామహిమ సేవకు భాగ్యము, మీ
కటాక్షమున్
ధాతకుశక్యమా పొగడ దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

అసురకోటులన్ = అనేకులైన రాక్షసులను; గెల్వను = జయించుటకు; కోతికిన్ = ఒక్క చేఒక్కటియైన కోతికి; శక్యమా = సాధ్యమా; (కాదనుట); గెల్చెన్ + పో = జయించినదేయనుకొందము; నిజంబు = వాస్తవముగా; ఆతనిమేనన్ = అతని శరీరమునంటి; దవానలుఁడు = అగ్నిహోత్రుడు; శీతకరుఁడు + ఔట = చంద్రునివలె చల్లనివాడగుట; ఎట్టి వింత = ఎట్టి ఆశ్చర్యకరమయిన విషయము; మా సీత పతివ్రతామహిమ = మా సీతామతల్లి పాతివ్రత్యమహాత్త్వము; సేవకున్ = (ఆ కపియొక్క) పరిచర్యకు గలిగిన; భాగ్యము = అదృష్టము; ధాతకున్ = చతుర్ముఖుడైన బ్రహ్మదేవునకు కూడ; మీ కటాక్షమున్ = మీదయను; పొగడన్ = స్తుతించుటకు; శక్యమా = సాధ్యమా (కాదనుట); దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ జరామరణరహితా! సర్వలోకహితా! ఒక్క కోతి స్వరూపుడైన హనుమంతునకు పెక్కు రాక్షసులను మట్టుబెట్టుటకెట్లు సాధ్యమయ్యెను? సాధ్యమయినదే అనుకొన్నను అతని తోకకు రాక్షసవీరులు నిప్పు అంటించగా ఆ అగ్ని అతనికి చల్లగానున్నదట. ఇది ఎట్టి వింత. ఇది అంతయు మా సీతామాత పతివ్రతామహిమయు, ఆ హనుమానుడు

మీకు గావించిన సేవా భాగ్య మహిమయుగాక మరేమి? ఇట్టి నీ కటాక్ష ప్రభావమును పొగడుటకు బ్రహ్మదేవునకు గూడ శక్యము కాదు గదా! ఆ నీ కటాక్షమునందలి కొంతయైనను నాపై చూపి కాపాడుము.

**63)** భూపలలామ రామ, రఘుపుంగవ రామ: త్రిలోక రాజ్య సం
స్థాపన రామ, మోక్ష ఫలదాయక రామ, మదీయ పాపముల్
పాప గదయ్య రామ, నినుఁబ్రస్తుతి చేసెదనయ్య రామ, సీ
తాపతి రామ. భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము –**

భూపలలామ రామ=రాజులలో శ్రేష్ఠుడవగు ఓ రామా; రఘుపుంగవరామ=మిక్కిలి ఖ్యాతి గాంచిన రఘువంశమున జన్మించిన ఓ రామా; త్రిలోక రాజ్య సంస్థాపన రామ=ముల్లోకములందలి రాజ్యములను స్థాపించిన ఓ రామా; మోక్ష ఫలదాయక రామ=మోక్షఫలము నిచ్చునట్టి ఓ రామా; సీతాపతిరామ=సీతాసతీ మనోహరుడవైన ఓ రామా; నిన్నున్=నిన్ను; ప్రస్తుతిచేసెదను+అయ్యరామ=మిక్కిలిగా స్తోత్రముగావించెదనయ్య రామ; మదీయ=నా సంబంధములైన; పాపముల్=పాపములను; పాపఁగదయ్య రామ=పోగొట్టగదవయ్య ఓ రామా; భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ ఆర్త త్రాణ పరాయణా! శ్రీమన్నారాయణా! నీవు రాజశ్రేష్ఠుడవు. మిక్కిలి పవిత్రమైనట్టియు ప్రఖ్యాతి నందినట్టియు రఘువంశమున జన్మించినవాడవు. ముల్లోకములందలి రాజ్యములను స్థాపించిన కీర్తి గలవాడవు. అన్నిటిని మించి మోక్షమును ప్రసాదింప సమర్థుడవు. భూదేవి పుత్రికయైన సీతాదేవికి భర్తవు. అందుచే నిన్ను సన్నుతించెదను గాన నా పాపములను పటాపంచలు గావించి కాపాడుటకు ప్రార్థించుచున్నాను

64) నీ సహజంబు సాత్త్వికము నీవిడిపట్టు సుధా
పయోధి, ప
ద్మాసనుఁడాత్మజుండు. కమలాలయ నీ
ప్రియురాలు, నీకు సిం
హాసన మిద్ధరిత్రి, గొడుగాకస, మక్షులు చంద్ర
భాస్కరుల్
నీ సుమతల్ప మాదిఫణి, నీవె సమస్తముఁ
గొల్చునట్టి నీ
దాసుల భాగ్యమెట్టిదయ దాశరథీ! కరుణాపయోనిధీ!।

ప్రతిపదార్థము :-

సాత్త్వికము=సత్త్వగుణము; నీ సహజంబు = నీ యొక్క స్వభావసిద్ధమైన గుణము; సుధాపయోధి=పాలసముద్రము; నీ విడిపట్టు =నీవు విశ్రాంతి తీసికొను స్థానము; పద్మాసనుఁడు=బ్రహ్మదేవుడు; ఆత్మజుండు=కుమారుడు; కమలాలయ=లక్ష్మీదేవి; నీ ప్రియురాలు=

నీ భార్య; ఈ+ధరిత్రి=ఈ భూమి; నీకు సింహాసనము=నీవు కూర్చుండు నట్టి సింహాసనము; ఆకసము=ఆకాశము; గొడుగు=గొడుగు; చంద్ర భాస్కరుల్=చంద్రుడును, సూర్యుడును; అక్షులు=నేత్రములు; ఆదిఫణి =ఆదిశేషుడు; నీ సుమతల్పము=నీకు పూవులతో గూడిన పానుపు; సమస్తము=సర్వమును; నీవె=నీవే; కొల్చునట్టి=(నిన్ను)సేవించునట్టి; దాసుల భాగ్యము=భక్తుల అదృష్టము; ఎట్టిది+అయ=ఎంత గొప్ప దయ్యా; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ సమస్త సద్గుణాకరా! అరిలోక భయంకరా! సాత్త్విక గుణమే నీకు సహజమైనది. పాల సముద్రమే నీకు విడిది. సృష్టికర్తయైన బ్రహ్మదేవుడే నీ కుమారుడు. సాక్షాత్ శ్రీ లక్ష్మీదేవియే నీకు ప్రియురాలు. ఈ ధరిత్రియే నీకు సింహాసనము, ఆకాశమే నీకు గొడుగు. సూర్యచంద్రులే నీకు కన్నులు ఆదిశేషుడే నీకు పుష్పశయ్య. నీవే సమస్తము. విశ్వరూపుడవు కాన నిన్ను సేవించునట్టి భక్తుల భాగ్యమును కొనియాడ నెవరి తరము. అందుచే నేను నీకు సేవకుడనయ్యెదను గాన నన్ను రక్షింపుము.

65) చరణము సోఁకినట్టి శిల జవ్వని రూపగుటొక్క
వింత, సు
స్థిరముగ నీటిపై గిరులు దేలిన దొక్కటి వింత;
గాని మీ
స్మరణఁ దనర్చు మానవులు సద్గతిఁజెందిన దెంత
వింత యీ
ధరను ధరాత్మజారమణ! దాశరథీ!
కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

చరణము=(నీ) పాదము; సోఁకినట్టిశిల=తాకినట్టి ఒక రాయి, జవ్వని రూపు+అగుట=ఒక యౌవనవతి రూపమును ధరించుట; ఒక్క వింత=ఒక ఆశ్చర్యకరమైన విషయము; నీటిపైన్=నీటిమీద; గిరులు= పర్వతములు; సుస్థిరముగన్=ఏ విధమైన కదలిక లేకుండ; తేలినది= నీటిలో మునుగకుండ నిలిచినది; ఒక్కటి వింత=ఇంకను ఆశ్చర్యమును గొల్పునట్టిది; కాని=అంతేకాని; ధరాత్మజా రమణ=ఓ సీతా మనో నాయకా; ఈధరను=ఈ లోకమునందు; మీ స్మరణన్=మీ నామస్మర ణతో; తనర్చు=ఒప్పునట్టి; మానవులు=మనుష్యులు; సద్గతిన్=మోక్ష మును; చెందినది=పొందినట్టిది; ఎంత వింత=ఎంత విచిత్రమైన విష యము; దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :

ఓ రఘు నాయకా! భక్తలోక ముక్తిదాయకా! ఒక రాయి నీ పాద స్పర్శ మాత్రముననే యౌవన వతియై ఎదుట నిలుచుట ఒక ఆశ్చర్య కరమైన విషయము అంతేగాక రావణాసుర సంహారమునకు లంకకు జేరుటకై సముద్రమునకు సేతువును నిర్మించు సందర్భమున నుపయో గించిన శిలలు, కొండలు నీటిపై తేలి కదలక స్థిరముగా నిలిచి యుండుట ఇంకను అత్యాశ్చర్యకరమైన విషయము గదా! ఈ ఆశ్చర్యకరములైన విషయములిట్లుండగా ఈ లోకమున సదా నీ నామస్మరణ గావించు మాన వులు మోక్షమును పొందుట ఒక విచిత్రమైన విషయముగా చెప్పకొనునట్టి దగునా? కాదుగదా! నేనెల్లప్పుడు నీ నామస్మరణ గావించెదను. నాకు ముక్తి నిమ్ము.

66) దైవము, తల్లి, తండ్రి, తగుదాత, గురుండు,
నఖుండు, నిన్నెకా
భావన సేయుచున్న తఱిఁబాపములెల్ల మనోవికార దు
ర్భావితుఁజేయుచున్నవి, కృపామతివై ననుఁగావు
మీ జగ
త్పావనమూర్తి, భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

దైవము=దేవుడు; తల్లి=తల్లి; తండ్రి=తండ్రి; తగుదాత=సమర్థుడగుదాత; గురుండు=ఆచార్యుడు; నఖుడు=స్నేహితుడు; నిన్నెకాన్=నీవేయనుకొని; భావన సేయుచున్న తఱిన్=మనస్సులో నీ రూపమును తలచుకొనిస్మరించుచొనుచున్న సమయమున; పాపములు+ఎల్లన్=పాపములన్నియు; మనోవికార=మనస్సునకు వికారమును కలుగజేయుచు; దుర్భావితున్=చెడుతలంపులు గలవానినిగా; చేయుచున్నవి=చేయుచున్నవి: జగత్+పావనమూర్తి=లోకమును పవిత్రమొనర్చు రూపాతిశయములు గలవాడా; కృపామతివై=దయతోకూడిన మనస్సుకలవాడవై; ననున్=నన్ను; కావుమా=రక్షింపుమా; భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ జానకీ మనోహరా కలికల్మషాపహరా! నీ దివ్య సుందర రూపము మానవులనందఱను పవిత్రులనుగా చేయునట్టిది. అట్టి నీ దివ్య మంగళ విగ్రహమును నా మనస్సున నిల్పికొని, దైవము, తల్లి, తండ్రి, దాత, గురువు, స్నేహితుడు మొదలగు సమస్తము నీవేయని భావన

చేయుచున్న కాలమున పాపపుచింతలు నా మనస్సునందు జేరి కలవర పరచుచున్నవి. అట్టి పాపపు తలంపులను నామనస్సున చేరనీయక దయతో నన్ను కాపాడుటకు వేడుచున్నాను.

67) వాసవ రాజ్యభోగసుఖవార్ధినిఁదేలు ప్రభుత్వమబ్బినా
యాసకుమేరలేదు; కనకాద్రి సమానధనంబుఁ
గూర్చినన్
గాసును వెంటరాదు; కనికానక చేసిన పుణ్యపాపముల్
వీసరఁబోవనీవు; పదివేలకుఁజాలు భవంబునొల్ల, నీ
దాసునిఁగాఁగ నేలుకొను
దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

వాసవ=ఇంద్రునితో సమానమైన; రాజ్యభోగసుఖ=రాజ్యము, భోగము, సుఖములు అనెడు; వార్ధినిన్=సముద్రమునందు; తేలు=తేల్చి ఆడించునట్టి; ప్రభుత్వము=దొరతనము; అబ్బిన్=లభించినను; నా+ఆసకున్=నా కోరికలకు: మేరలేదు=అంతములేదు: కనక+అద్రి=మేరుపర్వతముతో; సమాన=తులతూగునట్టి; ధనంబున్=ధనమును; కూర్చినన్=కూడబెట్టినను; కాసును=ఒక్క పైసయు; వెంటరాదు=చని పోయిన తరువాత నన్ను అనుసరింపదు; కని, కానక=తెలిసియు, తెలియకయు: చేసిన=చేసినట్టి; పుణ్యపాపముల్=పుణ్యకార్య పాపకార్య ఫలములు: వీసరఁబోవు=వ్యర్థముగబోవు; పదివేలకుఁజాలు=పదివేలకు తగినంత; భవంబున్+ఒల్లన్=పుట్టుకకుఇష్టపడను; నీదాసునిఁగాఁగన్=నీ సేవకునిగా; ఏలుకొను=పరిగ్రహించుము; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

దేవాదిదేవా! మహానుభావా! దేవేంద్రునితో సమానమైన రాజ్యభోగము లనుభవింపగలిగినను, నా కోరికలకు హద్దులేకున్నది. మేరుపర్వతముతో సమానమగు ధనమును కూడబెట్టినను ఇందు ఒక్క పైసకూడ చనిపోయిన తరువాత నా వెంటరాదు. తెలిసియు, తెలియకయు చేసిన పుణ్య పాప ఫలములే విడువక నన్ను వెంటాడునవి. పదివేలకు సమానమైనను జన్మ మెత్తుటకు అంగీకరింపను. నీ సేవకునిగా చేసికొని నన్ను ధన్యుని జేయగా ప్రార్థించుచున్నాను. నా ప్రార్థనను మన్నింపుము.

**68) సూరిజనుల్, దయాపరులు, సూనృతవాదులలుబ్ధ మానవుల్**
**వీరపతివ్రతాంగనలు విప్రులు గోవులు వేదముల్ మహీ**
**భారముఁదాల్పఁగా జనులు పావనమైన మహోప కార స**
**త్కారమెఱుంగలేరకట! దాశరథీ! కరుణాపయోనిధీ!!**

**ప్రతిపదార్థము :-**

సూరిజనుల్ = విద్వాంసులు; దయాపరులు = కరుణామయులు; సూనృతవాదులు = సత్యవాక్కులనే ఆదరించువారు; అలుబ్ధమానవుల్ = లోభగుణము లేనివారు; వీరపతివ్రత + అంగనలు = పతివ్రతాశిరోమణులు; విప్రులు = బ్రహ్మజ్ఞాన సంపన్నులైన బ్రాహ్మణులు; గోవులు = ఆవులు; వేదముల్ = నాలుగు వేదములు; మహీభారమున్ = ఈ భూభారమును; తాల్పఁగాన్ = వహించుచుండగా; జనులు = ఈ లోకమునందలి మనుష్యులు

పావనమైన=మిక్కిలి పవిత్రమైన; పర+ఉపకార సత్కారమున్=ఇతరులు గావించిన ఉపకారమునకు తగిన కృతజ్ఞతను; ఎఱుంగలేరు=చూపుటలేదు; అకట=ఇది ఏమిపాపమో; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :—**

ఓ భువనైక మోహనమూర్తీ! దిగంత విశ్రాంతకీర్తీ! పండితులు, దయామయులు, సత్యవాక్య పరిపాలకులు, ఉదార స్వభావులు, గొప్ప పతివ్రతలు, గోబ్రాహ్మణులు మొదలగువారు సమస్త వేదములను సంగ్రహించి అందలి ధర్మములను తు, చ. తప్పకుండ ఆచరించి ఈ లోకము నందలి జనుల నుద్ధరించుచున్నారు. ఇట్టి సత్కారమునకు జనులు వారికి ప్రత్యుపకారము గావించి కృతజ్ఞులుగా నుండవలెనో తెలియకున్నారు. అయ్యో! నన్నెట్లు నీవు కాపాడెదవో.

69) వారిచరావతారమునవారిధిలోఁజొచ్చిబాఱి, క్రోధ
విస్తారగుఁడైన యానిగమతస్కర వీర నిశాచ
రేంద్రునిన్
జేరి, వధించి, వేదముల చిక్కెడలించి, విరించికిన్,
మహో
దారతనిచ్చితీవెగద! దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

వారిచర+అవతారమునన్ = మత్స్యావతారమున; వారిధిలోన్=సముద్రమునందు; చొఁజొచ్చిబాఱి=ప్రవేశించి; క్రోధవిస్తారగుఁడు+ఐన=మిక్కిలి కోపముతో వెడలుచుండిన; ఆనిగమ = ఆ వేదములను; తస్కర=దొంగిలించినట్టి; వీరనిశాచర+ఇంద్రునిన్=గొప్ప రాక్షస

పేరుద్దైన (సోమకాసురుని); చేరి = సమీపించి; వధించి = చంపి; వేదముల = నాలుగు వేదములయొక్క: చిక్కు + ఎడలించి = సంకటమును పోగొట్టి; విరించికిన్ = బ్రహ్మదేవునకు; మహా + ఉదారతన్ = గొప్ప ఔదార్యముతో; ఈవె = నీవే; ఇచ్చితి + కద = ఇచ్చితివిగదా! దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ మత్స్యావతారధారీ! సోమకాసుర ప్రాణసంహారీ! బ్రహ్మదేవుని నుండి వేదములను దొంగిలించి సోమకుడను రాక్షసుడు సముద్రములో దాగియుండగా నీవు గొప్ప మీనముయొక్క రూపమును ధరించి సముద్రములో చొరబడి ఆ దుర్మార్గుడైన రాక్షసుని సంహరించి వేదములబాధను తొలగించి వాటిని మరల బ్రహ్మదేవునకిచ్చితివి. అట్టి నీ మహత్త్వమునకు అంజలి ఘటించెదను. నన్ను కాపాడుము.

**70)** కరమనురక్తి మందరముఁ గవ్వముగా నహిరాజుఁ ద్రాడుగా
దొరకొని దేవదానవులు దుగ్ధపయోధిమథించుచున్నచో
ధరణి చలింప, లోకములు తల్లడమందఁగఁగూర్మమై ధరా
ధరము ధరించితీవెకద దాశరథీ! కరుణాపయోనిధీ!

**ప్రతిపదార్థము :-**

కరము = మిక్కిలి; అనురక్తిన్ = ప్రేమతో; మందరమున్ =

మందర పర్వతమును; కవ్వముగాన్=కవ్వముగను; అహిరాజున్=సర్పములకు రాజైన వాసుకిని; త్రాడుగాన్=చిలుకుటకు వీలైనట్టి కవ్వపు త్రాడుగను; దొరకొని=ప్రయత్నించి; దేవదానవులు=దేవతలును, రాక్షసులును కలిసి; దుగ్ధపయోనిధిన్=పాలసముద్రమును; మధించుచున్న చోన్=చిలుకుచున్న సమయమున; ధరణి=భూమి; చలింపన్=కదలగా; లోకములు=మూడు లోకములు; తల్లడమందఁగన్=వ్యాకులపడగా; కూర్మరూపమై=తాబేటి రూపమును ధరించిన వాడవై; ధరాధరమున్=ఆ పర్వతమును; ఈవె=నీవే; ధరించితివి+కద=(క్రిందికి దిగిపోకుండ) ధరించిన వాడవు కదా; దాశరథీ! కరుణాపయోనిధీ॥

భావము :-

ఓ కూర్మస్వరూపావహా! మందరగిరిభారధూర్వహా! అమృతమును సంపాదించుటకై దేవతలును, రాక్షసులును, మందర పర్వతమును కవ్వముగాను, వాసుకిని కవ్వపు త్రాడుగానుచేసి, ఆ త్రాడును చెరియొక వైపునను పట్టుకొని పాలసముద్రమును చిలుకుటకు ప్రయత్నింపగా, ఆ పర్వతము సముద్రములో దిగబడిపోవనున్న సమయమున నీవు ఆ పర్వతము దిగిపోకుండ దానియడుగున తాబేటిరూపముతో చేరి వారికి అమృత సిద్ధికై సహాయపడితివి. అట్టి నీ ప్రభావమునకు నమస్కారములు గావించెదను. నన్నను గ్రహింపుము.

71) ధారుణిఁజాపఁజుట్టిన విశంబునఁగైకొని హేమనేత్రుఁడ
వ్వారిధిలోన దాఁగినను వానివధించి వరాహమూర్తివై
ధారుణిఁదొంటికైవడిని దక్షిణశృంగమునన్ ధరించి,ని
స్తారమొనర్చితీవెగద దాశరథీ! కరుణాపయోనిధీ॥

**ప్రతిపదార్థము :-**

ధారుణిన్=భూమిని; చాప=చాపగా; చుట్టినవిధంబునన్= చుట్టినరీతిగా; కై కొని=గ్రహించి; హేమనేత్రుఁడు=హిరణ్యాక్షుడు; ఆ+వారిధిలోన్=ఆ సముద్రములో; దాఁగినను=దాగియుండగా; వరాహ మూర్తివి+ఐ=వరాహరూపమును ధరించినవాడవై; వానిన్=ఆ రక్కసుని; వధించి=చంపి; ధారుణిన్=భూదేవిని; దక్షిణశృంగమునన్= కుడికోరయందు; ధరించి=తాల్చి; తొంటికై వడిన్=పూర్వపు విధమున నుండునట్లు; ఈవె=నీవే; నిస్తారమొనర్చితి+ఈవె+కద=విశాలముగా నుండునట్లు చేసితివిగదా; దాశరథీ! కరుణాపయోనిధీ!

**భావము :-**

ఆదివరాహమూర్తీ! ప్రశమితభూకాంతార్తీ; హిరణ్యాక్షుడను రక్కసుడు భూమిని చాపగచుట్టి సముద్రమున పడవైచి అతడు ఆ సముద్రముననే దాగియుండగా నీవు వరాహరూపమును ధరించి ఆ రాక్షసుని చంపి కుడికోఱతో భూదేవిని సముద్రమున నుండి పైకెత్తి భూలోకమునకు దెచ్చి పూర్వపురీతి నుంచితివిగదా. అట్టి నీ దయకు అంజలి ఘటించెదను. నన్ను కాపాడుము.

72) పెటపెటనుక్కుకంబమున భీకరదంతనఖాంకుర ప్రభా
పటలము గప్పనుప్పతిలి ఖండనవీథి నృసింహ భీకర
స్ఫుటపటుశక్తి హేమకశిపున్ విదళించి సురారిపట్టి నం
తటఁగృపఁజూచితీవెకద దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

ఉక్కు కంబమునన్ = ఉక్కుతో చేయబడిన స్తంభమునందు; పెటపెటన్ = పెటపెటమను గొప్ప ధ్వనితో; భీకర = భయంకరమైన; దంత = కోఱలయొక్కయు; నఖ + అంకుర = గోళ్ళ కొనలయొక్కయు; ప్రభా పటలము = కాంతులయొక్క సముదాయము; కప్పన్ = క్రమ్ముచుండగా; ఉప్పతిలి = పుట్టి; భండనవీధిన్ = పోరాడు స్థలమున; నృసింహ = నరసింహావతారముయొక్క; భీకర = భయంకరమైనట్టియు; స్ఫుట = స్పష్టమైనట్టియు; పటుశక్తిన్ = గొప్ప బలముచే; హేమకశిపున్ = హిరణ్యకశిపుని; విదళించి = చీల్చి; సుర + అరి + పట్టిన్ = రాక్షసుడైన ఆ హిరణ్యకశిపుని కుమారుడైన ప్రహ్లాదుని; ఈవెకద = నీవేకదా; కృపఁజూచితివి = దయతో రక్షించినవాడవు! దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ నృసింహావతారా! ప్రహ్లాదహృత్కమలవిహారా! భయంకరమైన శబ్దముతో ఉక్కు స్తంభమును పగులగొట్టుకొని ధగధగమని ప్రకాశించు దంతకాంతులతోడను; నఖకాంతులతోడను బయటకువచ్చి నిరతము నీ నామస్మరణమును గావించు కుమారుడైన ప్రహ్లాదునిపై కోపించి బాధలు పెట్టు హిరణ్యకశిపుని చీల్చిచెండాడి పరమ భక్తాగ్రగణ్యుడైన ప్రహ్లాదుని ఆదరించి కాపాడిన నీ భక్త వాత్సల్యమునకు ప్రణామము లర్పించెదను. నన్ను పాలింపుము.

73) పదయుగళంబు భూగగనభాగములన్ వెసనూని విక్రమా
స్పదమగు నబ్బలీంద్రునొకపాదమునన్ దలక్రింద నొత్తి మే

లొదవ జగత్త్రియంబుఁబురుహూతున కియ్యవటుండ
వైన చి
ద్సదమలమూర్తివీవెకద దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :—**

పదయుగళంబున్=పాదములను రెండింటిని: భూ గగనభాగము లన్=భూమి యొక్కయు, ఆకాశము యొక్కయు ప్రదేశములను; వెసన్+ఊని=శీఘ్రముగా ఆక్రమించి; విక్రమ+అస్పదము+అగు= పరాక్రమమునకు స్థానమైనట్టి; ఆ+బలి+ఇంద్రున్=ఆ బలిచక్రవర్తిని; ఒక పాదమునన్=వేఱొక పాదముతో; తలక్రిందన్+ఒత్తి=తలక్రిందగు నట్లుగా ఆక్రమించి; మేలు+ఒదవన్=శుభము కలుగునట్లుగా; జగత్+ త్రయంబున్=మూడు లోకములను; పురుహూతునకున్+ఇయ్యన్= దేవేంద్రునికిచ్చుట కొఱకు; వటుండవు+ఐన=బ్రహ్మచారి రూపమును ధరించిన; చిత్+సత్+అమలమూర్తివి=నిర్మలమైన సత్యజ్ఞాన స్వరూపు డవు; ఈవె+కద=నీవేకదా: దాశరథీ! కరుణాపయోనిధీ॥

**భావము :—**

ఓ వటురూపరంజనా! బలిగర్వభంజనా! స్వర్గము నుండి దేవేం ద్రుని పారద్రోలి దేవతలకు అనేక బాధలు కల్గించి మూడు లోకములను తన అధిపత్యమునకు కొనివచ్చి గర్వించియున్న బలిచక్రవర్తిని బ్రహ్మ చారి రూపమున వామన మూర్తివై మూడడుగుల స్థలమును యాచించితివి. అప్పుడు బలి నీ ఆకార విశేషములచే నాకర్షితుడై మూడడుగుల భూమిని దానమిచ్చుటకుఒప్పుకొనగా, ఒక పాదముచే స్వర్గలోకమును, రెండవ పాదముచే భూలోకమును ఆక్రమించి, గ్రహించి, మూడవ పాద ప్రమాణ మునకు, అతని శిరస్సున నీపాదమునుంచి, పాతాళమునకు అణగద్రొక్కి,

త్రిలోకాధిపత్యమును, ఇంద్రునకు వశముగావించిన నీ చరిత్రకభివాదనము గావించెదను. నా పై దయజూపుము.

74) ఇరువదియొక్క మాఱు ధరణీశులనెల్ల వధించి,
తత్కళే
బర రుధిర ప్రవాహమునఁ బైతృక తర్పణమొప్పఁ
జేసి, భూ
సురవర కోటికిన్ ముదము సొప్పడ భార్గవ రామ
మూర్తివై
ధరణి, నొసంగితీవెకద దాశరథీ! కరుణాపయోనిధీ॥

**ప్రతిపదార్థము :-**

ఇరువదియొక్క మాఱు=ఇరువది యొక్క పర్యాయములు; ధరణీశులన్+ఎల్లన్=రాజులనందఱను: వధించి=చంపి; తత్+కళేబర =ఆ చంపబడిన రాజులయొక్క శరీరములందు గల; రుధిర=రక్తము యొక్క; ప్రవాహమునన్=ప్రవాహముతో; పైతృక=పితృదేవతలకీయ బడు; తర్పణమునన్=తర్పణమును; ఒప్పన్+చేసి=విధి పూర్వకముగా చేసి; భూ సురవర కోటికిన్=అనేకులైన బ్రాహ్మణ శ్రేష్ఠులకు; ముదము =సంతోషము; చొప్పడన్=కలుగునట్లు; భార్గవరామమూర్తి వి+ఐ= పరశురామమూర్తివై; ఈవెకద=నీవే కదా; ధరణిన్=భూమిని; ఒసంగితి =ఇచ్చితివి; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ పరశురామ రూపా! ఖండిత సమస్తభూపా! ఇరువది యొక్క పర్యాయములు దుర్మార్గులగు భూమీశులను గండ్ర గొడ్డలిచే సంహరించి,

వారి కళేబరముల నుండి పాఱు రక్త ప్రవాహముచే పితృదేవతలకు తర్పణము గావించి పెక్కురు బ్రాహ్మణ శ్రేష్ఠులకు సమస్తమైన భూమిని వారికానందము గలుగునట్లుగా దానము గావించిన నీ మహిమకు అభివాదనము లర్పించెదను దయజూపుము.

75) దురమునఁ దాటకం దునిమి ధూర్జటి విల్ దునుమాడి సీతనుం
బరిణయమంది. తండ్రి పనుపన్ ఘనకానన భూమి కేగి దు
స్తరపటుచండ కాండ కులిశాహతి రావణ కుంభకర్ణ భూ
ధరములఁ గూల్చితీవెకద దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము :-

దురమునన్ = యుద్ధమునందు; తాటకన్ = తాటకయను రక్కసిని; తునిమి = చంపి తునుకలుగా చేసి; ధూర్జటివిల్ = శివ ధనుస్సును; తును మాడి = ముక్కలుచేసి; సీతనున్ = సీతా దేవిని; పరిణయమంది = వివాహము చేసికొని; తండ్రి = తండ్రియైన దశరథుడు; పనుపన్ = పంపగా; ఘన = గొప్పదైన; కానన భూమికిన్ = వనభూమికి; ఏఁగి = పోయి; దుస్తర = తప్పించుకొనుటకు వీలుకాని; పటు = గొప్పదియు; చండ = వాడియైనదియు నగు; కాండ = బాణములనెడు; కులిశ + ఆహతిన్ = వజ్రాయుధపు దెబ్బలచే; రావణ, కుంభకర్ణ = రావణ కుంభకర్ణులనెడు; భూధరములన్ = కొండలను (రాజులను); ఈవెకద = నీవేకదా; కూల్చితివి = పడగొట్టితివి (చంపితివి); దాశరథీ! కరుణాపయోనిధీ॥

**భావము :-**

ఓ దశరథ కుమారా! రావణ కుంభకర్ణసంహారా! సూర్యవంశమున దశరథ కుమారుడవై జననమంది, విశ్వామిత్ర మహర్షి యొక్క ప్రియ శిష్యుడవై, తాటకయను దుష్ట రాక్షసిని వధించి, శివ ధనుర్భంగము **గావించి,** సీతాదేవిని వివాహము చేసికొని; పితృవాక్య పరిపాలనార్థము **అరణ్యములకేగి** వజ్రాయుధముతో సమానమైన నీ బాణములచేకొండలతో సరిపోల్చ దగిన రావణ కుంభకర్ణులను మట్టుబెట్టిన నీ శక్తి విశేషమునకు చే మోడ్పులు అర్పించెదను. కాపాడుము.

**76) అనుపమ యాదవాన్వయ సుధాబ్ధి సుధానిధి**
**కృష్ణమూర్తి నీ**
**కనుజుఁడుగా జనింప కుజనావళి నెల్ల నడంచి,**
**రోహిణీ**
**తనయుఁడనంగ బాహుబల దర్పమునన్ బలరామ**
**మూర్తివై**
**తనరినవేల్పు వీవెకద దాశరథీ! కరుణాపయోనిధీ!!**

**ప్రతిపదార్థము :-**

అనుపమ=సాటిలేని; యాదవ+అన్వయ=యదువంశమనెడు; సుధాబ్ధి సుధానిధి=పాల సముద్రమునకు చంద్రుని వంటివాడగు; కృష్ణ మూర్తి=శ్రీకృష్ణుడు; నీకున్=నీకు; అనుజుఁడు గాన్=తమ్ముడుగా; జనింపన్=పుట్టగా; కుజన+ఆవళిన్+ఎల్లన్=సమస్తమైన దుర్మార్గుల సమూహమును అడంచి=పరిమార్చి; రోహిణీ తనయుఁడు+అనంగన్= రోహిణీదేవి కుమారుడనునట్లుగా; బాహుబల దర్పమునన్=భుజబల

గర్వముచేత; బలరామమూర్తివి+ఐ=మిక్కిలి బలముగల రాముడు అను పేరుగలవాడవై; తనరిన=ఒప్పినట్టి; వేల్పువు=దేవతా స్వరూపుడవు; ఈవె కద=నీవేగదా; దాశరథీ! కరుణాపయోనిధీ॥

**భావము :-**

ఓ యదుకులాబ్ధి సోమా! కౌరవకుల విరామా! యాదవ కులమున శ్రీకృష్ణుడు నీకు తమ్ముడుగా పుట్టిన వాడు. నీవు రోహిణీదేవి గర్భమున జన్మించి భుజబల పరాక్రమాదులచే బలరాముడను పేరుతో దుష్ట సంహారము గావించిన దేవతా స్వరూపుడవు. అట్టి నీ ప్రభావమునకు ప్రణతులర్పించెదను నన్ను కరుణింపుము

**77)** సురలునుతింపఁగాఁ ద్రిపుర సుందరులన్ భ్రమియింప బుద్ధ రూ
పరయఁగఁదాల్చితీవు; త్రిపురాసురకోటి దహించునప్పు డా
హరునకుఁ దోడుగా వరశరాసన బాణముఖోగ్ర సాధనో
త్కర మొనరించితీవె కద,
దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

సురలు=దేవతలు; నుతింపగా=స్తుతి చేయగా; త్రిపుర సుందరులన్=త్రిపురములయందలి స్త్రీలను; భ్రమియింపన్=భ్రాంతి నొందింప

జేయుటకై; బుద్ధరూపంబు = బుద్ధుని యొక్క రూపమును; అరయఁగన్ = విచారింపగా; ఈవు = నీవు; తాల్చితి = ధరించినావు; త్రిపుర + అసుర కోటిన్ = త్రిపురాసుర సమూహమును; దహించునప్పుడు = తగలబెట్టు సమయమున; ఆ హరునకున్ = ఆ శంకరునకు; తోడుగాన్ = సహాయముగా; వర = గొప్పదైన; శరాసన = ధనుస్సు; బాణముఖ = బాణము మొదలుగాగల; ఉగ్ర = భయంకరమైన; సాధన + సత్కారము = సాధన సంపత్తిని; ఈవె కద = నీవేగదా; ఒనరించితి = తయారుచేసితివి; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ బుద్ధరూపధరా! త్రిపురాసుర సంహార సహాయకరా! దేవతల కోరికచే త్రిపురాసుర స్త్రీలను భ్రమింప జేయుటకై బుద్ధ భగవానుడవై భూలోకమున నవతరించితివి. ఇక శంకరునకు త్రిపురాసుర సంహారమునకు కావలసిన విల్లు, బాణము మున్నగు సమస్త ఆయుధసముదాయమును సమకూర్చిన నీ మహత్త్వమునకు ఇవే జోహారులు. మమ్ము సాకుము.

78) సంకర దుర్గమై దురిత సంకులమైన జగంబుఁజూచి, స
ర్వాంకషలీల నుత్తమ తురంగము నెక్కి, కరాసిఁ
బూని, వీ
రాంక విలాసమొప్పఁ గలికాకృతి సజ్జనకోటికిన్ నిరా
తంక మొనర్తు వీవెగద దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

సంకర = వర్ణ సాంకర్యముచే; దుర్గమై (భ్రష్టమై) ప్రవేశింప వీలు

లేనిదై; దురిత సంకులము+ఐన=పాపములచే నిండినట్టిదైన; జగంబున్ =ఈ లోకమును; చూచి=పరిశీలించి; సర్వంకషలీలన్=ఆటంకములేని విధముగా; ఉత్తమ తురంగమున్+ఎక్కి=శ్రేష్ఠమైన గుఱ్ఱమునెక్కి; కరాసిన్+పూని=చేతియందు ఖడ్గమును ధరించి; వీర+అంక+విలాసము +ఒప్పన్=పరాక్రమమును సూచించు ప్రకాశము కలుగునట్లుగా; కలికి+ ఆకృతిన్=కల్కి అవతారమున; సజ్జనకోటికిన్=సత్పురుషుల సముదాయమునకు; ఈవెకద=నీవేకదా; నిరాతంకము+ఒనర్తువు=బాధ లేవియు లేకుండ చేయువాడవు; దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :

ఓ కలి కల్మషప్రహారా! మునిజన హృత్కంజ విహారా! లోకము వర్ణ సాంకర్యము నొంది పాప భూయిష్ఠమై యుండగా నిరాటంకముగా పరుగెత్తెడు ఒక గుఱ్ఱమునెక్కి చేతియందొక ఖడ్గమును ధరించి వీర విలాసమును ప్రదర్శించుచు కల్కి అవతారమున దుర్మార్గులను వధించి సజ్జనులను కాపాడగలనీవిశిష్ట ప్రభావమునకు కైమోడ్పులర్పించెదను. నన్ను అనుగ్రహింపుము.

78) మనమున నూహపోహణలు మర్వకమున్నె, కఫాది రోగము
ల్దనువున నంటి మేనివిగి దప్పకమున్నె, నరుండు మోక్ష సా
ధన మొనరింపఁగావలయుఁదత్త్వ విచారము మాని యుండుట
ల్తనువునకున్ విరోధమిది
దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

మనమునన్=మనస్సునందు; ఊహాపోహాలు=ఆలోచనలు; యుక్తాయుక్త విచక్షణ చర్చలు; మర్వకమున్నె=మరువక పూర్వమే; కఫ+ఆది+రోగము=కఫము మొదలగు వ్యాధులు; తనువునన్=శరీరము నందు; అంటి=తగుల్కొని; మేనిబిగి=శరీరము యొక్క పటుత్వము; తప్పకమున్నె=తప్పిపోక పూర్వమే; నరుండు=మానవుడు; మోక్ష సాధనమున్=ముక్తిని సాధింపగల మార్గమును; ఒనరింపఁగా వలయున్=వెదుకుకొన వలయును; తత్త్వవిచారమున్=దైవ సంబంధమైన ఆలోచనలును, చర్చలును; మాని=మానుకొని; ఉండుటల్=కాలమును వెళ్ళబుచ్చుటలు; తనువునకున్=దేహమునకు (ఆత్మకు); ఇది విరోధము=ఇట్టి వ్యర్థములైన చేతలు తగని పనులు; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ సనక సనందనాది మహాముని సేవితపాద? దిగంత విశ్రాంత కీర్తి సంపాద! బుద్ధి జాడ్యమున యుక్తాయుక్త విచక్షణజ్ఞాన రాహిత్యము చిత్తము నావేశింపక పూర్వమే, శ్లేష్మము మున్నగు వ్యాధులు సంక్రమించి స్మృతి తప్పక పూర్వమే, మానవుడు ముక్తి మార్గమును అన్వేషింప ప్రయత్నింప వలయును. ఆరోగ్యముగా నున్నప్పుడు బ్రహ్మజ్ఞాన విచారమును మాని యుండరాదు అట్లు భగవచ్చింతనలేక యుండుట శరీరమున కపాయమును గల్గించును. తన్మూలమున ఆత్మశక్తి నశించును. అందుచే శరీరము అవశముకాక ముందే నీ స్మరణ గావించెదను. నన్ను కాపాడుము.

80) ముదమున కాటపట్టు, భవమోహమద ద్విరదాంకు
శంబు, సం
పదల కొటారు, కోరికల పంట, పరంబునకాది, వైరుల
న్నదన జయించు త్రోవ, విపదబ్ధికి నావగదా! సదా
భవ
త్పదమలనామసంస్మరణ దాశరథీ!కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

సదా=ఎల్లప్పుడు; భవత్+సదమల=మీ యొక్క పవిత్రమైన; నామ=నామముయొక్క; సంస్మరణ=స్మరణము; ముదమునకున్=; సంతోషమునకు; ఆటపట్టు=నివాసస్థానము; భవమోహ=సంసార వ్యామోహమనెడి; మదద్విరద=మదపుటేనుగునకు; అంకుశము=అంకుశము వంటిది; సంపదల=సర్వసంపదలు నిల్వచేసికొనుటకు వీలగునట్టి కొటారు=గాదెవంటిది; కోరికల=కోరికలకు; పంట=ఫలము; పరంబునకున్=మోక్షమార్గమునకు; ఆదీ=ప్రారంభదశ; వైరులన్=శత్రువులను; అదనన్=సమయమునందు; జయించు=జయించునట్టి; త్రోవ=మార్గము; విపత్+అబ్ధికిన్=ఆపదలనెడు సముద్రమునకు; నావగదా=ఓడవంటిదిగదా! దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ నీలనీరదశ్యామా' పరాజిత భార్గవరామా! నీ పవిత్రనామ మెల్లపుడును స్మరణ గావించుచుండినయెడల ఆనందమునిచ్చును. సంసార మోహబంధము లేదా జన్మబంధమును దరిజేరనీయదు. నిరంతరము తఱుగని సంపదలనిచ్చును. సమస్తమైన కోరికలను తీర్చును. మోక్షసంపాదనకు

ప్రథమ సోపానమై యొప్పును. బహిరంతశ్శత్రువులను దూరముగా తఱిమి వేయును. ఆపత్సముద్రమును ఒక ఓడవలె దాటించును. కావున నిరంతరము నీ నామస్మరణ గావించెదను నన్ను కరుణింపుము.

81) దురితలతానుసారి భవదుఃఖకదంబము, రామనామ భీ
కరతర హేతిచేఁదెగి వకావకలై చనకుండనేర్చునే
దరికొనిమండుచుండు శిఖి దార్కొనినన్ శలభాది కీటకో
త్కరము విలీనమై చనదె
దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

దురిత=పాపమనెడి; లతా+అనుసారి=తీగననుసరించి పెరుగుచున్న; భవదుఃఖకదంబము=జన్మములు అనెడి దుఃఖములయొక్క సముదాయము; రామనామ="శ్రీరామ" నామమనెడు; భీకరతర=మిక్కిలి భయమును గలిగించు; హేతిచేన్=కత్తిచేత; తెగి=తెగిపోయి; వకావకలు+ఐ=ముక్కలు ముక్కలై; చనకుండనేర్చునే=నిలిచియుండగలదా (ముక్కలు ముక్కలుకాకుండ నిలిచియుండదని భావము); శలభ+ఆది=మిడుతలు మొదలగు; కీటక+ఉత్కరము = పురుగుల సమూహము; దరికొని=కాలుచు; మండుచుండు = మండుచున్నట్టి; శిఖిన్=నిప్పుమంటను; దార్కొనినన్=చేరినయెడల; విలీనము+ఐ=(ఆ మంటతో) కలిసి; చనదె=మరణింపదా (మరణించును); దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ సమస్త మహనీయసద్గుణపవిత్రా! దురితలతాలవిత్రా! మంట లెగయుచు రగుల్కొనుచున్న అగ్నిని మిడుతలు మున్నగు కీటకములు ఎదుర్కొనినచో అవి ఆ మంటలోబడి భస్మమైపోవలసినదే. అట్లే పూర్వ జన్మలయందును ఈ జన్మయందును గూడ జేసిన పాపపుంజము రామనామ స్మరణ వలన నశింపేయబడునుగదా! నీ పవిత్రనామ స్మరణ పాపముల పాలిట ఖడ్గము వంటిది. మోక్షమును ప్రసాదించునట్టిదిగాన నీ నామ జపము గావించెదను. నాకు ముక్తిని అనుగ్రహింపుము.

**82)** హరిపదభక్తి నింద్రియజయాన్వితుఁడుత్తముఁడింద్రి
యంబుల
మరగక నిల్వనూదినను మధ్యముఁడింద్రియ
పారవశ్యుఁడై
పరగినచో నికృష్టుఁడని పల్కఁగ దుర్మతినైన
నన్ను నా
దరమున నెట్లు కాచెదవొ దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

హరిపదభక్తిన్ = శ్రీవిష్ణువు యొక్క పాదములయందలి భక్తితో; ఇంద్రియజయ + అన్వితుఁడు = పంచేంద్రియములను జయించినవాడు; ఉత్తముఁడు = శ్రేష్ఠుడు; ఇంద్రియంబులన్ = ఆ పంచేంద్రియ సుఖంబులను; మరగక = ఆశింపక; నిల్వన్ + ఊదినను = నిలిచియుండునట్లు అణగ ద్రొక్కినట్లయిన; (అతడు) మధ్యముఁడు = మధ్యమతరగతికి జెందిన వాడు; ఇంద్రియపారవశ్యుఁడై = ఆ పంచేంద్రియ సుఖములకు లోబడి

పరవశత్వమును పొందినవాడై; పరగినచోన్ = విహరించినయెడల; నికృష్టుడు=అధముడు; అనిపల్కఁగన్=అనుచు నిర్ణయించుచుసుండగా; దుర్మతిని+ఐన=దుష్టమగు బుద్ధిగల; నన్నున్=నన్ను; ఆదరమునన్= ఆసక్తితో; ఎట్లుకాచెదవో=ఎట్లు కాపాడెదవో; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ మాయామానుషవిగ్రహా! భాగవతానుగ్రహా! నీ పావన పద భక్తిగలిగి పంచేంద్రియములను జయించినవాడు శ్రేష్ఠుడుగను, ఆ ఇంద్రియ సుఖములకు వశముగాక వాటిని జయించుటకు ప్రయత్నించినవాడు మధ్యముడుగను; పంచేంద్రియ సుఖములనే యథేచ్ఛగా అనుభవించుచు పరవశుడై నిన్ను మరచియుండువాడు అధముడుగను పెద్దలు నిర్ణయించియున్నారు. ఇందు నేను మూడవ తరగతికి చెందిన హీనుడను. నన్ను ఏ విధముగా ఆ సుఖములకు లోనుగాకుండ కాపాడి రక్షించెదవో నీదే భారము.

83) **వనకరిచిక్కె మైనసకువాచవికిం జెడిపోయె మీను, తా**
**వినికికిఁజిక్కెఁజిల్వ, కనువేఁదురు జెందెను వేశ్య; తావిలో**
**మనికి నశించెఁదేఁటి, తరమాయిరుమూఁటినిగెల్వ, నైదు సా**
**ధనముల నీవెకావఁదగు దాశరథీ! కరుణాపయోనిధీ!!**

**ప్రతిపదార్థము :-**

వనకరి=అడవియేనుగు; మై = శరీరముయొక్క; నసకున్= కు; చిక్కెన్=వశమయి కడగండ్లపాలగుచున్నది; మీను=చేప

వాచవికిన్ = నోటి రుచికి; చెడిపోయెన్ = లోనయి నశించుచున్నది; చిల్వ = సర్పము; తాన్ = తాను; వినికికిన్ = మధురమైన నాగస్వర ధ్వనికి; చిక్కెన్ = వశమయి పాములవానికి చిక్కుచున్నది; వేశ్య = వేశ్య; కను వేఁదుఱు = కన్నుల యొక్క ఉన్మాదమును; చెందెను = పొంది హతమగు చున్నది; తేఁటి = తుమ్మెద; తావిలోన్ = సువాసనలో; మనికి = వర్తించి; నశించెన్ = నాశము నొందుచున్నది; ఇరుమూటిని = ఐదిటిని; గెల్వన్ = జయించుటకు; తరమా = వశమా (కాదనుట); ఐదు సాధనములన్ = పంచేంద్రియ సుఖములనుండి; ఈవె = నీవే; కావఁదగున్ = రక్షింపదగును; దాశరథీ! కరుణాపయోనిధీ॥

భావము :-

ఓ పంచ శరాకారా! భక్తమందారా! సకల ప్రాణికోటికిగల త్వక్ =(చర్మము) చక్షున్ =(కన్ను) శ్రోత్ర (చెవి) జిహ్వా (నాలుక) ఘ్రాణము (నాసిక)లు అనునట్టి అయిదు ఇంద్రియములును సుఖముల ననుభవింపగోరును. మృదుమైన వస్తువులనే తాకి సుఖపడవలెనని చర్మమును, సుందరమైన రూపములనే చూచి ఆనందింపవలెనని నేత్రమును; మనోహరమైన ధ్వనులనే విని పరవశము నొందవలెనని చెవియు, రుచికరమైన పదార్థములనే తిని తృప్తి పొందవలెనని నాలుకయు, మంచి పరిమళము గల వాయువులనే ఆఘ్రాణించి సంతోషము నొందవలెనని నాసికయు కోరుకొనుచుండును. కాని ఈ ఐదు సుఖములును పంచేంద్రియ ములకును గల ఉన్మాదములేయని ఆలోచించిన తేలగలదు. అంతేగాక ఈ పంచేంద్రియ సేవ నాశమునకు కూడ దారితీయునని అనుభవజ్ఞులగు

పెద్దల హితవాక్యము. అందులకు ఉదాహరణములుగా ఐదు ఇంద్రియము లకును ఐదు జంతువులను గ్రహించి, ఆ జంతువులు ఆయా ఇంద్రియ సేవలవలన నెట్లు నాశము నొందుచున్నవో ఈ పద్యమున తెలుపబడినది. అందు అడవిలో సంచరించు ఏనుగు ఒక చెట్టునకు గొలుసులచే కట్టబడిన పెంపుడు ఏనుగు యొక్క మృదువైన శరీరమును సుఖము కొఱకై రాచు కొనుచు ఆ ప్రక్కనే అడవి ఏనుగును పట్టుకొనుటకై త్రవ్వబడి, తెలియ బడకుండ ఆకులచే కప్పబడిన గోతిలోబడి పైకి రాలేక వేటగాండ్రకు చిక్కి పలుకష్టములకు పాలగును ఇది త్వగింద్రియ చాపల్యమునకుదా హరణము ఇక మత్స్యము నీటిలో జాలరిచే విసరబడిన ఎఱ్ఱ (వాన పాము)ను గ్రుచ్చిన గాలమునకు తగుల్కొని ఆ జాలరివాని చేతిలో హతమగును ఇది జిహ్వేంద్రియ చాపల్యమునకుదాహరణము. ఇక సర్పము పాములను పట్టుకొనువాని బుఱ్ఱ నుండి వినబడు మధుర స్వరము నకు లోనై వానిచే చిక్కి దుఃఖముల పాలగును. ఇది శ్రోత్రేంద్రియ చాపల్యమునకు ఉదాహరణము. ఇక వేళ్ళ కంటికి కనిపించు చక్కని వెలుతురు నిచ్చు దీపమును చూచుచు మైమఱచి యున్న సమయమున వేటగాండ్రు వానిని హతమార్చుదురు. ఇది నేత్రేంద్రియ చాపల్యమున కుదాహరణము ఇక తుమ్మెద సమస్త పుష్పముల నుండియు మధువును గ్రహించునట్లు సంపెంగ పువ్వునుండియు తేనెను గ్రహించు నుద్దేశముతో ఆ పువ్వుపై వ్రాలి ఆ పుష్పము యొక్క వాసన తగులగానే ఆ పుష్పపు తావికి నశించును. ఇది నాసికేంద్రియ చాపల్యమునకుదాహరణము. ఈ ఈ విధముగా పై అయిదు జంతువులును ఒకొక్క జంతువుఒకొక్క ఇంద్రియమును తృప్తి నొందింపగోరి నాశము నొందుచుండగా పంచేంద్రియ తృప్తి కొఱకై ప్రాకులాడు మానవుల గతి ఎట్టిదో అనూ హ్యము కాన నన్నట్టి ఇంద్రియ సేవనమునకు లోనుగాకుండ చేయవల సినదిగా నన్నెట్లు కాపాడెదవో అని ప్రార్థించుచున్నాడీ మహా భక్తుడు.

84) కరములు మీకు ్రమొక్కులిడఁ గన్నులు మిమ్మునె
చూడ, జిహ్వ మీ
స్మరణఁదనర్ప, వీనులు భవత్కథలన్ వినుచుండ.
నాస మీ
యఱుతను బెట్టు పూసరుల కాసగొనంబరమార్థ
సాధనో
త్కరమిది చేయవే కృపను
దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

కరములు=చేతులు; మీకున్=మీకు; ్రమొక్కులు+ఇడన్=నమస్కారములు చేయుచుండగను; కన్నులు=కన్నులు; మిమ్మునె=మిమ్ములనే; చూడన్=వీక్షించుచుండగను; జిహ్వ=నాలుక; మీ స్మరణన్=మిమ్ములను స్మరించుటయందే; తలిర్పన్ = సంతోషించుచుండగను; వీనులు=చెవులు; భవత్+కథలన్=నీ లీలలను; వినుచుండన్=వినుచుండగను; నాస=ముక్కు; మీ+అఱుతను=మీ కంఠమునందు; పెట్టు=ఉంచబడిన; పూసరులకున్=పూలమాలలకు; ఆసగొనన్=ఆశపడుచుండగను; ఉండునట్టి; ఇది=ఈ పద్ధతి పరమార్థ సాధన+ఉత్కరము=మోక్ష సామగ్రి; కృపను=దయతో; చేయవే=కలుగజేయుమా; దాశరథీ! కరుణాపయోనిధీ॥

భావము :-

ఓ శిష్ట రక్షకా! దుష్ట శిక్షకా! రెండు చేతులు మోడ్చి ఆర్తితో నీకు

నమస్కరించుటయు, ఆసతో నీ మోహన రూపమును వర్ణించుటయు, మిక్కిలి భక్తితో నీ పవిత్ర నామస్మరణము గావించుటయు, సదా శ్రద్ధతో నీ కథలను, నీ లీలలను వినుటయు, భక్తులు నీ కర్పించిన పుష్ప మాలల సువాసనను మిక్కిలి అపేక్షతో ఆఘ్రాణించుటయు, అను నీ యైదును ముక్తి సాధనోపాయములు గాన ఆ అయిదు సాధనములను నా కనుగ్రహింప వేడుచున్నాను. దయజూపుము

85) చిరతరభక్తి నొక్క తులసీదళ మర్పణ
సేయువాఁడు ఖే
చరగరుడోరగ ప్రముఖ సంఘములో వెలుఁగన్
సదా భవత్
స్ఫురదరవింద పాదములఁ బూజలొనర్చిన వారికెల్లఁద
త్పరమఖచేతి ధాత్రిగద దాశరథీ! కరుణాపయోనిధీ॥

**ప్రతిపదార్థము :—**

చిరతర భక్తిన్=చాలకాలము నుండియు మనస్సున నెలకొన్న భక్తితో; ఒక్క=ఒక్కటే ఒక్కటైన; తులసీదళమున్=తులసీదళము: అర్పణ సేయువాఁడు=సమర్పించువాడు; ఖేచర=ఆకాశమునందు సంచరించు వేల్పులు; గరుడ=గరుడులు; ఉరగ=నాగులు; ప్రముఖ సంఘములోన్=మొదలగువారి సమూహములో; వెలుఁగన్=ప్రకాశించుచుండగా; సదా=నిరంతరము; భవత్=మీయొక్క; స్ఫురత్=వికసించిన: అరవింద పాదములన్=పద్మములవంటి పాదములను; పూజలు+ ఒనర్చినవారికిన్+ఎల్లన్=పూజలు కావించిన వారికందఱకును; తత్+

పరము=ఆ మోక్షము; అఱచేతి ధాత్రిగద=అఱచేతియందున్నట్టి ఉసిరిక (కరతలామలకము) వంటిగదా; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :—**

ఓ సత్యవాక్యపరిపాలకా! భక్తజన కరతలామలకా! చాలకాలముగా **మనస్సున** నాటుకొనియున్న భక్తితో ఒక్క తులసీదళమును నీ పాద **సరోజములయందర్పణ**సేయు మానవుడు దేవతాసమూహములో నొక్కడై **వెలుగొందుచుండు**నని పెద్దలు చెప్పుచుందురు. అట్టిచో నిరంతరము నీ **పాదకమలములను** సేవించు మానవులకు మోక్షము కరతలామలకమని వేరుగా చెప్పనవసరములేదుగదా. అందుచే నిరంతరము నిన్ను నేను భక్తితో సేవింతునుగాన ముక్తిని ప్రసాదింపుము.

86) భానుడు తూర్పునందుఁగనుపట్టినఁబావక చంద్ర
**తేజముల్**
**హీనతఁజెందినట్లు జగదేకవిరాజితమైన నీ పద**
**ధ్యానము సేయుచున్నఁబర దైవమరీచులడంగ**
**కుండు నే**
దానవ గర్వనిర్ధళన **దాశరథీ!** కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము :-

దానవ=రాక్షసులయొక్క; గర్వ=గర్వమును; నిర్దళన=భేదించు శక్తిగలవాడా; భానుఁడు=సూర్యుడు; తూర్పునందున్=తూర్పుదిక్కునందు; కనుపట్టినన్=కనిపింపగా; పావక=అగ్నియొక్కయు; చంద్ర=

చంద్రునియొక్కయు; తేజములే=కాంతులు; హీనతఁజెందినట్లు=కళా విహీనములయినట్లు; జగత్+ఏక=జగత్తునకంతకు ఒక్కటియై; విరాజిత మైన=మిక్కిలిగా ప్రకాశించుచున్న; నీపదధ్యానము=నీపాద స్మరణము; చేయుచున్నన్=చేయుచుండగా; పరదైవ=ఇతర దేవతలయొక్క; మరీచులు=కాంతులు; అడంగకుండునే=తగ్గిపోకుండునా (తగ్గిపోవునని భావము) దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ రాధికాహృదయలోలా! గోపాలా! సూర్యుడు ఉదయమున తన కాంతులను విరజిమ్ముచు ప్రకాశించుచురాగానే రాత్రి సమయమున దేదీప్యమానముగా వెలుగు చంద్రాగ్ని కాంతులు వెలవెలబోయినట్లుగా భక్తులు నీ పాదకమలములను సేవించుచుండగా ప్రభవించు దివ్యకాంతుల తేజస్సునకు అన్యదైవతములను కొలుచుటవలన గలుగు నెట్టికాంతులైనను మూగబోవునుగదా! అందుచే నేను నీదివ్య పాదారవిందములనే సేవించెదను. కృప జూడుము.

87) నీ మహనీయతత్త్వరస నిర్ణయబోధ కథామృతాబ్ధిలోఁ
దాము నుగ్రుంకులాడక వృథాతనుకష్టముఁజెంది
మానవుం
డీమహిలోక తీర్థముల నెల్లమునింగిన దుర్వికార హృ
త్తామసపంకముల్ విడునె?
దాశరథీ! కరుణాపయోనిధీ!!

## ప్రతిపదార్థము :-

మానవుండు=మనుష్యుడు; నీ=నీయొక్క; మహనీయ=కొనియాడదగిన; తత్త్వరసనిర్ణయబోధ=పరమాత్మ స్వరూపమును తెలుపగల కథామృత+అబ్ధిలోన్=కథామృతముతో కూడిన సముద్రములో; మును=ముందుగా; క్రుంకులు+ఇడక=స్నానమాచరింపక; వృథా=వ్యర్థముగా; తనుకష్టమున్=శరీర కష్టము; చెంది=పొంది; ఈ మహిలోక=ఈ భూలోకమునందలి; తీర్థములన్+ఎల్లన్ = సమస్త పుణ్యతీర్థముల యందును; మునింగినన్=మునకలుపేయగా; దుర్వికార=మిక్కిలి వికారముతో కూడిన; హృత్+తామసపంకముల్ = హృదయమునందున్న తామస గుణముతో కూడిన పాపములు; విడునె=సమసిపోవునా? (పోవని భావము); దాశరథీ! కరుణాపయోనిధీ॥

## భావము :-

ఓ ఖగరాజతురంగా! దయాతరంగా! మానవుడు నీ దివ్య కథా శ్రవణామృతమునాను అందుమూలమున ఉద్భవమునొందిన ఆనందాబ్ధిలో మునకలు వైచిన యెడల తన హృదయమున బురదవలె అంటుకొని యుండి పెక్కు వికారములను గల్గించు చెడు తలంపులు నశించునుగాని కాయకష్టమునకు లెక్కసేయక బాధలననుభవించుచు ఈ భూలోకమున గల పుణ్యతీర్థములన్నిటియందును మునిగినను ఆ అజ్ఞాన పంకము కడుగ బడదుగదా! అందుచే నీ దివ్య కథాశ్రవణమే సతతము గావించెదను. అదియేనాకు శరణ్యము. నన్ను కాపాడుము.

88) కాంచనవస్తు సంకలిత కల్మషమగ్నిఁబుటంబువెట్టి వా
రించినరీతి నాత్మనిగిడించిన దుష్కరదుర్మలత్రయం

బంచిత భక్తియోగ దహనార్చిఁదగుల్పకపాయునే?
కన
త్కాంచన కుండలాభరణ,
దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము :-

కనత్=ప్రకాశించుచున్న; కాంచన=బంగారముతో చేయబడిన; కుండల+ఆభరణ=కుండలములు ఆభరణములుగా గలవాడా; కాంచన=బంగారముతో చేయబడిన; వస్తు=వస్తువులతో; సంకలిత=కూడుకొనియున్న; కల్మషమున్=మాలిన్యమును; అగ్నిన్=నిప్పునందు; పుటంబు పెట్టి=మూసియుంచి; వారించినరీతిన్=పోగొట్టిన విధముగా; ఆత్మన్=మనస్సును; నిగిడించియున్న=అంటియున్నట్టియు; దుష్కర=ఏ విధముగను తొలగింప శక్యముగానట్టియు; దుర్మలత్రయంబున్=సత్వరజస్తమోగుణములచే మనోవాక్కాయముల మూలమున గల్గిన దోషములను; అంచిత=ఒప్పిదమైనట్టి; భక్తి యోగ=భక్తియోగమనెడు; దహన+అర్చిన్=అగ్నిజ్వాలలో; తగుల్పకన్=సక్తముగావింపక; పాయునే=వదిలింప శక్యమా (కాదని భావము); దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ సువర్ణకుండలాభరణా! దురితవారిజవారణా! బంగారము నందలి మాలిన్యమును పోగొట్టుటకై అగ్నియందు పుటము పెట్టుదురు. అప్పుడా సువర్ణము మాలిన్యరహితమై స్వచ్ఛముగా ప్రకాశించును. అట్లే నా మనస్సును సత్వరజస్తమోగుణములచే మనోవాక్కాయముల మూలమున నుద్భవించిన దోషములు నీపైగల భక్తియనెడు అగ్నిమూలమున దగ్ధము

గాకుండ వదలిపోవునా? (పోవని భావము) అందుచే సదా నీపాదారవింద సేవ గావించెదను. నన్ను పవిత్రునిగా నొనర్పవేడుచున్నాను.

89) నీ సతి పెక్కు కల్మలిడ నేర్పరి, లోకము
కల్మషంబు గా
నీ సుత సేయు పావనము, నిర్మితి కార్యధురీణ
దక్షుడై
నీ సుతుడిచ్చు నాయువులు, నిన్ను భజించినఁ గల్గ
కుండునే
దాసుల కీప్సితార్థములు దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

నీ సతి=నీ భార్యయైన లక్ష్మీదేవి; పెక్కు=అనేకములైన; కల్మలు+ఇడన్=ఐశ్వర్యములను ఇచ్చుటయందు; నేర్పరి=మిక్కిలి సమర్థురాలు; నీ సుత=నీ కుమార్తెయైన గంగాదేవి; లోకమున్=లోకము నందలి సమస్త జంతు సముదాయమును; అకల్మషంబుగాన్=పాపరహిత ముగా; పావనము+చేయున్=పవిత్రముగా చేయును; నీ సుతుడు= నీ కుమారుడైన బ్రహ్మదేవుడు; నిర్మితికార్య=సృష్టికార్యము యొక్క; ధురీణ=భారమును వహించుట యందు; దక్షుడై=సమర్థుడై; ఆయువులు =ఆయుస్సులను; ఇచ్చున్=ఇచ్చును; నిన్నున్=నిన్ను; భజించినన్= సేవించినయెడల; దాసులకున్=భక్తులకు; ఈప్సితార్థములు=కోరబడిన కోరికలు; కల్గక+ఉండునే=సఫలము గాకుండునా; (తప్పక నెరవేరునని భావము) దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

అమోఘ విక్రమ పరాజిత భార్గవ రామా! త్రిలోక స్తుతశౌర్య రమాలలామా! నీ భార్యయైన లక్ష్మీదేవి సమస్త లోకములకు సకలైశ్వర్యములను ప్రసాదించు శక్తి గలది. నీ కుమార్తెయగు గంగాదేవి సమస్త జీవకోటిని పవిత్రముగా జేయు శక్తి కలది. నీ పుత్రుడగు బ్రహ్మదేవుడు సమస్త చరాచర వస్తుతతిని సృజించి పూర్ణాయువు నిచ్చుటయందు దక్షుడు. అందుచే నిన్ను సంతతము భక్తితో సేవించు సేవకులకు సకలైశ్వర్య మోక్షముర్ధాయములను కలుగుచుండును. అట్టి ముక్తికై నిన్ను నేను సేవింతును నా యందు దయ జూపుము.

90) వారిజ పత్రమందిడిన వారి విధంబున వర్తనీయమం
దారయ రొంపిలోనఁదనువంటిని కుమ్మర పుర్వురీతి, సం
సారమునన్ మెలంగుచు విచారగుఁడై
పరమొందుగాదె స
త్కార మెఱింగి మానవుఁడు,
దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

మానవుఁడు = మనుష్యుడు; వర్తనీయమందున్ = నడవడి యందు; వారిజ పత్రమందున్ = తామరాకునందు; ఇడిన = ఉంచబడిన; వారి విధంబునన్ = నీటివలెను; రొంపిలోనన్ = బురదయందు; తనువు + అంటని = శరీరమును అంటని; కుమ్మరపుర్వురీతిన్ = కుమ్మర పురుగువలెను; ఆరయన్ = ఆలోచింపగా; సంసారమునన్ = సంసారమునందు

మెలంగుచు=ప్రవర్తించుచు; సత్కారము+ఎఱింగి =జాగ్రత్తపడి; విచారగుడై =పరతత్త్వ విచారమునందాసక్తి గలవాడై ; పరమున్ =మోక్షము; ఒందున్+కాదె=పొందునుకదా; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ పరమపావన చరిత్రా! అరవిందదళ నేత్రా! మానవుడు తామరాకుమీద నుండియు దానినంటుకొనని నీటి బిందువు వలెను, బురదయందు మునిగి తేలుచు దానిని తన శరీరమున కంటించుకొనని కుమ్మరపురుగువలెను, సంసారమునందు భార్య, పుత్రులు, పుత్రికలు, బంధువులు, మిత్రులు మున్నగువారితో మెలగుచు, దారేషణ, పుత్రేషణ, ధనేషణములకు వశము గాకయు, లౌకిక విషయములందు తగుల్కొనకయు జాగ్రత్తపడి భగవద్విషయ విచారమును సల్పిన తప్పక మోక్షము నందగలడు. నేనా విధముగానే నిన్ను సేవించెదను. నాకు ముక్తి ననుగ్రహింపుము.

91) ఎక్కడి తల్లి, తండ్రి, సుతులెక్కడివారు, కళత్ర బాంధవం
బెక్కడ, జీవుఁడెట్టి తనువెత్తిన, బుట్టుచుఁ బోవుచున్న వాఁ
డొక్కఁడె, పాపపుణ్య ఫలమొందిన నొక్కఁడె కానరాఁడు వే
ఱొక్కఁడు వెంటనంటి, భవమొల్లనయా! కృపఁ జూడవయ్య నీ
తక్కరి మాయలందిడక దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

ఎక్కడి తల్లి తండ్రి=ఈ తలిదండ్రు లెక్కడి వారు; సుతులు= పుత్రులు: ఎక్కడివారు=ఎక్కడ నుండి వచ్చినవారు; కళత్ర బాంధవంబు+ఎక్కడ=ఎచ్చటి భార్య, ఎచ్చటి చుట్టరికము; ఎట్టి తనువు+ ఎత్తినన్=ఏ రూపమైన శరీరమును ధరించినను; పుట్టుచు=జన్మించుచు; పోవుచున్నవాఁడు=మరణించుచున్నవాడు; జీవుఁడు=ప్రాణి; ఒక్కడే= ఒక్కడే సుమా; పాపపుణ్య ఫలము + ఒందినన్ = ఈ లోకములో గావించిన పాప పుణ్యముల కనుగుణమైన ఫలము ననుభవించు వాడైనను; ఒక్కడె=ఆ ఒక్క ప్రాణియే; వేఱొక్కఁడు=వేఱొక్కజీవి; వెంటన్ +అంటి=వెనువెంట కలిసి; కానరాఁడు=కన్పింపడు; భవమున్=పుట్టుకను లేదా సంసారమును; ఒల్లన్+అయా=ఒప్పనయ్యా! నీ=నీయొక్క టక్కరి మాయలందున్=వంచనతో కూడిన మాయలందు; ఇడక= పడనీయక; కృపఁజూడవయ్య=దయతో నన్ననుగ్రహింపుము స్వామీ; దాశరథీ! కరుణాపయోనిధీ॥

**భావము :-**

ఓ సమస్త మునిసేవిత పావన చరణా! భూ భార భరణా! తల్లి, తండ్రి, కుమారుడు, భార్య, చుట్టములు, మొదలగు వారందఱును మాయా కల్పిత సంబంధము కలవారే కాని జీవికి ఏ విధముగను సహాయపడువారు కారు జీవి పరలోక గతుడైనప్పుడు తాను గావించిన పాపపుణ్య ఫలములే వెంటనంటి వచ్చును గాని పై వారిలో ఒక్కఁడును వెంటరాడు. అందుచే ఓ దయాసింధూ! నాకు తిరిగి జన్మమును కలిగించవలదు. నాపై నీమాయ నావరింపజేసి అజ్ఞానమునకు లోబడునట్లు చేయకుము. నీ కైంకర్యము భక్తితో గావించెదను. నా కోర్కెను మన్నింపుము.

**92)** దొరసిన కాయముల్ముదిమి తోఁచినఁ జూచి
ప్రభుత్వముల్ సిరుల్
మెఱుపులు గాఁగఁజూచి మఱి మేదినిలోఁదమతోడి
వారు ముం
దరుగుట చూచిచూచి తగునాయువు నెఱుంగక మోహ
పాశముల్
దఱుఁగని వారికేమి గతి?
దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

దొరసిన=జన్మతో కలిగిన; కాయముల్=శరీరములు; ముదిమి=ముసలితనము; తోఁచినన్+చూచి=పొందుటను కనులారాగాంచి; ప్రభుత్వముల్=రాచఱికములు; సిరుల్=ఐశ్వర్యములు; మెఱుపులుగాఁగన్=మెఱుపులవలె క్షణకాలముండునవిగా; చూచి=మనసారతెలిసికొని; మఱి=ఇక; మేదినిలోనన్=ఈ భూలోకమున; తమతోడివారు=తమకు సన్నిహితముగా నుండువారు; ముందు=తమకంటెముందే; అరుగుటన్+చూచి+చూచి=పరలోకగతులగుటనుచూచిచూచి; తగు+ఆయువున్=ఒప్పిన తమ ఆయుస్సును; ఎఱుంగక=ఎప్పటితో అంతమగునో తెలిసికొనలేక; మోహపాశముల్=తమ్ము ఆవరించియున్న భ్రాంతియనెడు బంధములను; తఱుఁగనివారికిన్=త్రెంపుకొనలేనివారికి; ఏమిగతి=ముక్తిమార్గమేది; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ రంగధరాతిభంగా! పక్షిరాజతురంగా! మానవుడు జనించి

పెరిగి పెద్దవారై వృద్ధాప్యపు బాధలనుభవించుటను చూచియు; యౌవనమున తనకుగల అధికారము, సంపద మొదలగునవి శాశ్వతములు కావని గ్రహించియు, తోడివయస్సువారలు తన కనులముందే పరలోకగతులగుటను కనులార చూచియు, తన ఆయుర్దాయము క్షణక్షణమునకు తఱుగుచుండుటను తెలిసియు, నీ దివ్య నామస్మరణ గావింపక మోహపాశబద్ధులగుచున్నారు. వారికేదిగతియో తెలిసికొనలేకున్నాను. నేను నీ పవిత్రనామస్మరణ గావించెదను నన్నను గ్రహింపుము

**93)** సిరిగలనాఁడు మైమఱచి చిక్కిననాఁడు దలంచి
 పుణ్యముల్
 పొరిఁబొరి సేయనైతినని పొక్కినఁగల్గునె,
 గాలిచిచ్చు పైఁ
 గెరలినవేళఁదప్పిఁగొని కీడ్పడువేళ జలంబుగోరి త
 త్తరమునఁద్రవ్వినంగలదె దాశరథీ! కరుణాపయోనిధీ॥

**ప్రతిపదార్థము :—**

సిరిగలనాఁడు=ఐశ్వర్యమున్న కాలమున; మైమఱచి=శరీరము తెలియక ప్రవర్తించి; చిక్కిననాఁడు=సంపదలు నశించి దారిద్ర్యమనుభవించుకాలమున; పుణ్యముల్ = పుణ్యకార్యములు; పొరిఁబొరి=మాటిమాటికి; చేయనైతిన్+అని=చేయకపోతినే అని; తలంచి=స్మరించి; పొక్కినన్=విచారపడగా; కల్గునె=ఉపయోగముండునా (ఉండదు); చిచ్చుపైన్=అగ్నిపై; గాలి=గాలి; కెరలినవేళన్=విజృంభించిన సమయమునను; దప్పిగొని=దాహమువేసి; కీడ్పడువేళన్ = బాధపడుసమయమునందును; జలంబున్=నీటిని; కోరి=కోరుకొని; తత్తరమునన్=తొందరపాటుతో; త్రవ్వినన్=భూమిని త్రవ్వినయెడల; కలదె=లాభముండునా (ఉండదని భావము); దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ చిదానందభాసా! మునిజనహృత్కమలనివాసా! సకలైశ్వర్యము లును కలిగిననాడు నిన్ను మరచి ఒడలెరుంగక ముందువెనుక లాలోచింపక ప్రవర్తించి ఆ సంపదలు సన్నగిల్లినప్పుడు ఇదివరలో పుణ్య కార్యములు చేయనైతినే, నిన్ను స్మరింపనైతినే అని విచారించిన యెడల ప్రయోజనమావంతయునుండదుగదా! ఇంటినినిప్పంటుకొని, దానికి గాలి తోడై విజృంభించినపుడును, మిక్కిలి దాహముచేత తపించుచున్నప్పుడును నీటికై బావిని త్రవ్వుటకు మొదలుపెట్టిన లాభము శూన్యముగదా! అందుచే ఇప్పుడే శక్తివంచన లేకుండ నిన్ను స్మరించుచు పుణ్యకార్యము లాచరించెదను. కరుణింపుము

**94)** **జీవనమింకఁబంకమునఁ జిక్కినమీను చలింప**
**కెంతయుం**
**దావుననిల్చి జీవనమె తద్దయుఁగోరు విధంబు**
**చొప్పడం**
**దావలమైన దానిగుఱిదప్పనివాఁడు తరించువాఁడయా**
**తావక భక్తియోగమున దాశరథీ! కరుణాపయోనిధీ!!**

**ప్రతిపదార్థము –**

జీవనము=నీరు; ఇంకన్=ఇంకిపోగా; పంకమునన్=బురద యందు; చిక్కిన=తగుల్కొనిన; మీను=చేప; ఎంతయున్+చలింపక =కొంచెమైనను కదలలేక; తావునన్=తానున్నచోటనే; నిల్చి=ఉండి; జీవనమె=నీటినే(బ్రదుకునే); తద్దయున్=మిక్కిలిగా; కోరువిధంబు= కోరుకొనునట్టి రీతి; చొప్పడన్=కలుగగా; తావలమైనదానిన్=ఆధార

భూతమైనదానిని; గుటితప్పనివాఁడు = మనస్సునందుంచుకొనినవాడు; తావక=నీ సంబంధమైన; భక్తియోగమునన్=భక్తిగలుగుట మూలమున; తరించువాఁడు+అయా=(ఎన్ని కష్టములు వచ్చినను) తప్పక ముక్తిని పొందునుగదా; దాశరథీ కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ నందగోకులవిహారీ ఖరదూషణసంహారీ! నీటియందు జీవనము గడుపు చేప అచ్చటి నీరు ఇంకిపోయినప్పుడు అచ్చటి బురదయందే కదలకయుండి జీవనమును గడుపుచు తిరిగి నీటికై ఎదురు తెన్నులు చూచుచునేయుండునుగాని ఆ చోటును విడిచిపోదు. అట్లే పుంఖానుపుంఖములుగా ఆపదలు ముంచుకొని వచ్చినను నీ పదభక్తిని విడువనివాడు సమస్త బంధములనుండియు విడువబడి ముక్తినిగాంచును. అందుచే నీపాద కమలములయందే మనస్సును నిల్పి నిన్ను భక్తితో సేవించు నదృష్టమునే నాకు కల్గించుము. నన్ను తరింపజేయుము.

**95)** సరసుని మానసంబు సరసజ్ఞుఁడెఱుంగును;
ముష్కరాధ ముం
డెటిఁగి గ్రహించువాఁడె; కొలనేక నివాసముగాఁగ
దర్దురం
బరయఁగనేర్చునెట్లు వికబాబ్జమరందరసైకసౌర భో
త్కరము మిళిందమొందు క్రియ
దాశరథీ! కరుణాపయోనిధీ!!

**ప్రతిపదార్థము :-**

సరసుని=రసికజనుని; మానసంబున్=మనస్సును; సరసజ్ఞుఁడు=వేరొక సరసుడు; ఎఱుంగును=గ్రహింపగలడు; ముష్కర+అధముఁడు

=మూర్ఖుడగు హీనుడు; ఎఱిఁగి=తెలిసికొని; గ్రహించువాఁడె=గ్రహింప శక్తిగలవాడా (లేనివాడని భావము); కొలను=సరస్సు; ఏకనివాసము గాఁగన్=ఒకే ముఖ్యమైనవాసస్థలముగా కలదియైనను; దర్దురము=కప్ప; వికచ+అబ్జ=వికసించిన తామరపువ్వు యొక్క; మరందరస=తేనె రసము యొక్క; ఏకసౌరభ=ముఖ్యమైన సువాసనగల; ఉత్కరము= వరుసను; మిళిందము=తుమ్మెద; ఒందుక్రియన్=గ్రహింప గల్గిన విధముగా; అరయన్=ఆలోచింపగా; నేర్చును+ఎట్లు=ఏ విధముగాగ్రహింప గలదు (గ్రహింపలేదని భావము) దాశరథీ! కరుణాపయోనిధీ॥

**భావము :-**

ఓ మాధవా! ఆపద్బాంధవా! సరస్సునందు వికసించి కమలము యొక్క పెదజల్లు తావిని తుమ్మెద గ్రహింపగల్గిన రీతిగా ఆ సరస్సునే నివాస స్థానముగా చేసికొన్న కప్ప గ్రహింపజాలదు గదా! అట్లే నీ పావన తారక నామస్మరణ యొక్క మహత్త్వమును మహాభక్తుడు గ్రహింపగల్గిన విధముగా, మూర్ఖుడును, అజ్ఞానియు గ్రహింపజాలడు గదా! అందుచే భక్తి పూరిత హృదయము గల మహా భక్తుల సహవాసమునే నాకు సంప్రాప్తింపజేయ వేడెదను. నన్ను అనుగ్రహింపుము

96) నోఁచిన తల్లిదండ్రికిఁ దనూభవుఁడొక్కఁడె చాలు
మేటి, చే
చాఁచని వాఁడు. వేఱొకఁడు చాఁచిన లేదన
కిచ్చువాఁడు, నో

రాఁచి నిజంబకాని పలుకాడనివాఁడు, రణంబులోన
మేన్

దాఁచని వాఁడు, భద్రగిరి
దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :–

నోఁచిన=పుణ్యవ్రతము లాచరించిన; తల్లిదండ్రికిన్=తల్లిదండ్రులకు; చేఁ+చాఁచని వాఁడు=యాచింపనివాఁడు: వేఁఱొకఁడు=అన్యుడు; చాఁచినన్=యాచించిన యెడల; లేదు+అనక=నాస్తియని చెప్పక; ఇచ్చువాఁడు=యాచకుని కోరికను తీర్చువాడు; నోరు+ఆఁచి=నోటిని నిగ్రహించుకొని; నిజంబు+అ+కాని=సత్యము కానట్టి; పలుకు=మాటను; ఆడనివాఁడు=పలుకనివాడు; రణంబులోనన్=యుద్ధమునందు; మేన్=శరీరము యొక్క శక్తిని; దాఁచనివాఁడు=దాచుకొననివాఁడు; (అయిన): తనూభవుఁడు=కుమారుడు; మేటి=శ్రేష్ఠుడైనవాడు; ఒక్కఁడె చాలున్=ఒక్కడే చాలును; దాశరథీ! కరుణాపయోనిధీ॥

భావము :-

ఓ పితృవాక్పరిపాలకా! నీరద నీలాలకా! దాతలను దేహియని చేయిచాచి యాచింపని వాడును, యాచకులకు లేదనక వారి కోరికలను తీర్చువాడును, ఎల్లపుడు సత్యమునే పలుకువాడును, యుద్ధభూమియందు శక్తి వంచన లేక వెన్నుజూపక పోరాడువాడును అయిన పుత్రుడు తలిదండ్రులు నోచిన నోముల ఫలముగా గలుగును. అట్టి పుత్రుడొక్కడే చాలును కాన అట్టి సద్గుణములు గల్గిన పుత్రులనే అనుగ్రహింపుము. వేడెదను.

97) శ్రీయుత! జానకీరమణ! చిన్మయరూప! రమేశ!
రామ! నా
రాయణ! పాహిపాహియని ప్రస్తుతిఁజేసితి
నా మనంబునన్
బాయక కిల్బిష వ్రజవిపాటన మందఁగఁజేసి
సత్కళా
దాయి ఫలంబు నాకియవె
దాశరథీ! కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

శ్రీయుత=ఐశ్వర్యముతో కూడియున్నవాడా; జానకీరమణ= సీతాదేవికి మనోజ్ఞమైన వాఁడా; చిన్మయరూప=జ్ఞానస్వరూపుడా; రమా+ ఈశ=లక్ష్మీదేవికి భర్తయైనవాడా; రామ=శ్రీ రామా; నారాయణ=శ్రీమన్నారాయణుడా; పాహి పాహి+అని=కాపాడుము, కాపాడుము అని; ప్రస్తుతిన్+జేసితిన్=స్తోత్రము చేసితిని; నా మనంబునన్=నా మనస్సునందు; పాయక=విడువక నిల్చి; కిల్బిష=పాపముల యొక్క; వ్రజ= సముదాయమును; విపాటనము+అందఁగన్+చేసి=సమూలముగా పెకలించి వైచుటను చేసిన వాడవై; సత్కళాదాయిఫలంబున్=మంచి శుభము నిచ్చునట్టి ఫలితమును; నాకున్+ఇయవె=నాకు ఇయ్యగదవే; దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :

ఓ ముని సంసేవితచరణా! భూభార భరణా! సమస్త సంపదలతో

లక్ష్మీ మనోహరా అనియు, శ్రీరామా అనియు నారాయణా అనియు పెక్కు విధముల నీ నామస్మరణ గావించుచు రక్షింపుము దేవా అని పెక్కు రీతుల స్తోత్రములు చేసితిని. నా మనస్సునందు విడువక నిల్చి నా పాపములను సమూలముగా పెకలించి వైచి చక్కని శోభను కలుగ జేయునట్టి ఫలమును నాకీయ గదవే! మోక్షమును ప్రసాదించి రక్షింపుము. మరి మరి వేడుదును.

98) ఎంతటి పుణ్యమో శబరి యెంగిలి గొంటివి,
వింతగాదె, నీ
మంతనమెట్టిదో యుడుతమైని కరాగ్రనఖాంకు
రంబులన్
సంతసమంద జేసితివి, సత్కులజన్మము లేమిలెక్క! వే
దాంతముగాదె నీ మహిమ
దాశరథీ! కరుణాపయోనిధీ॥

ప్రతిపదార్థము :-

ఎంతటి పుణ్యమో=ఎంత గొప్ప పుణ్యము చేసినదో; శబరి= శబరి అను పేరుగల బోయవనిత యొక్క; ఎంగిలిన్=కొరికి రుచిచూచి ఎంగిలి గావించిన పండ్లను; కొంటివి=గ్రహించితివి; వింతగాదె= ఆశ్చర్యకరమైన విషయము గదా; నీ మంతనము=నీ యొక్క భావ మెట్టిదో; ఉడుత=ఉడుత యొక్క; మైని=శరీరము పైని; కర+అగ్ర= చేతివేళ్ళ చివరల; నఖ+అంకురంబులన్=కొనగోళ్ళతో తాకి; సంత సము+అందన్+చేసితివి=సంతోష పరచితివి; సత్కుల జన్మములు= సత్కులమున జన్మమందుటలు; ఏమి లెక్క=అవశ్యకమా (కాదని

భావము); నీ మహిమ=నీ యొక్క మహత్త్వము; వేదాంతముగాదె= ఉపనిషత్తుల మూలమున తెలియదగినదేకదా; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ వేదాంతవేద్యా! మహాతపస్సంపాద్యా! బోయతయైన శబరి కోరికి రుచిచూచి ఇచ్చిన ఫలముల నారగించినావు. ఆమె పుణ్యమేమో కదా! ఎంత ఆశ్చర్యకరమైన విషయము. ఉడుత శరీరమును నీ చేతి కొన గోళ్ళతో నిమిరి శాశ్వతముగా చూపట్టు చిహ్నములను గావించితివి. జాతి మత వయఃకులాదులు నీ మనస్సునంటవు. నీ మహత్త్వము ఉపనిషత్తుల చేత మాత్రమే తెలియదగినది. నేను అజ్ఞానిని. నీ మహత్త్వ మెట్లెరుంగ గలను. దయజూపి నాకు ముక్తి ననుగ్రహింప వేడుచున్నాను.

99) బొంకనివాఁడె యోగ్యుఁడరి బృందములెత్తినచోటఁ జివ్వకున్
జంకనివాఁడెజోదు, రభసంబున నర్థికరంబు సాచి నం
గొంకనివాఁడె దాత; మిమ్ముఁగొల్చి భజించినవాఁడె పో నిరా
తంకమనస్కుఁడెన్నఁగను దాశరథీ! కరుణాపయోనిధీ॥

**ప్రతిపదార్థము :-**

ఎన్నఁగను=విచారించిచూడగా; బొంకనివాఁడె = అసత్యములు పలుకనివాడె; యోగ్యుఁడు=ఉత్తముడు; అరి బృందములు=శత్రు సము దాయములు; ఎత్తినచోటన్=దండెత్తివచ్చిన స్థలమున; చివ్వకున్= యుద్ధమునకు; జంకనివాఁడె = భయపడనివాడె; జోదు=వీరుడు; రభ స్సంబునన్=తహతహతో; అర్థి=యాచకుడు; కరంబు=చేయి; చాచినన్

=దేహియని యాచించిన; కొంకనివాఁడె=వెనుదీయక దానముచేయువాడె
దాత=వాస్తవమగుదాత; మిమున్=మిమ్ములను; కొల్చి=సేవించి; భజిం
చినవాఁడెపో=స్తుతించినవాడేగదా; నిరాతంకమనస్కుఁడు= ఏ విధమైన
సంకటములేని మనస్సు గలవాడు; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ సుమిత్రాపుత్రసేవితా! మునిజనభావితా! అసత్యములాడనివాడె
యోగ్యుడు. శత్రువులెదుర్కొనినప్పుడు రణరంగమున జంకక పోరువాడె
వీరుడు మిక్కిలి దైన్యముతో చేయిచాచిన యాచకునకు లేదనక అతని
సంతోషపెట్టినవాడె దాత. నిన్ను మనస్సున నిల్పుకొని భజించిన భక్తుడె
తాపత్రయము నుండి విడివడిన మనస్సుగలవాడు. కావున సదా నిన్నే
మనస్సున నిల్పుకొని ధ్యానించెదను. నన్ను అనుగ్రహింపుము.

**100) భ్రమరము కీటకంబుఁగొని పాల్పడి**
**ఝంకరణోపకారియై**
**భ్రమరముగానొనర్చునని పల్కుఁటజేసి భవాదిదుఃఖ**
**సం**
**తమసమెడల్చి, భక్తిసహితంబుగ జీవుని విశ్వరూపత**
**త్త్వమున ధరించుటేమరుదు**
**దాశరథీ! కరుణాపయోనిధీ!!**

**ప్రతిపదార్థము :-**

భ్రమరము=తుమ్మెద; కీటకంబున్+కొని=ఒక విధమైన పురు
గును తీసికొనివచ్చి; పాల్పడి=ప్రయత్నించి; ఝంకరణ+ఉపకారియై=

ఝంకారమాత్ర సహాయమై; భ్రమరముగాన్=తుమ్మెదగా; ఒనర్చును+అని=చేయునని; పల్కుటన్+చేసి = శాస్త్రవేత్తలు చెప్పుచుండగా; జీవునిన్=ఒక ప్రాణిని; భవ+ఆది=పుట్టుకమొదలుగాగల; దుఃఖసంతమసమున్=దుఃఖమనెడి కారుచీకటిని; ఎడల్చి=విచ్ఛిన్నముచేసి; భక్తిసహితంబుగన్=భక్తితో కూడుకొన్నవానినిగా; విశ్వరూపతత్త్వమునన్=విశ్వరూపుడవగు నీ ఆకారాది విశేషములను; ధరించుట=ధరింపజేయుట; ఏమి+అరుదు=ఏమంత ఆశ్చర్యకరమైన విశేషము (కాదని భావము) దాశరథీ! కరుణాపయోనిధీ॥

**భావము :-**

ఓ ఘోరపాతకవిరామా! సద్గుణకల్పవల్లికారామా! తుమ్మెద ఒక విధమైన పురుగును తెచ్చి తాను మట్టిచే నిర్మించిన గూటియందుంచి ఆ గూటిని మట్టితోడనే పూడ్చివేసి ఆ గూటిపై ఝంకార ధ్వనిచేయుచు రాగా ఆ కీటకము తుమ్మెదగా మార్పునందును. ఒక కీటకము విషయమే ఇట్లుండగా సర్వశక్తి సమన్వితుడవగు నీవు ఒక భక్తునకు జననమరణాది దుఃఖములనుండి విముక్తునిగావించి, నీయందు పరిపూర్ణమైన భక్తి కలవానినిగా చేసి నీ ఆకార గుణాదులను భక్తునకు ప్రసాదించుట వింతకామగదా! నీ భక్తులయెడ నీకుఁగల దయ అపారము. నన్ను అట్లే కాపాడుము.

**101)** తరువులు పూచి కాయలగుఁదత్కుసుమంబులు
పూజగా భవ
చ్చరణమునొంకి దాసులకు సారములౌ, ధనధాన్య

కరిభటఘోటకాంబర నికాయములై, విరజానదీ
త్తరణమొనర్చుఁ జిత్రమిది
దాశరథీ! కరుణాపయో

ప్రతిపదార్థము :-

తరుపులు=చెట్లు; పూచి=పుష్పించి; కాయలు+అగున్=
లగును; తత్+కుసుమంబులు=ఆ పుష్పములే; పూజగాన్=పూ
బడినవిగా; భవత్+చరణమున్=నీ యొక్క పాదమును; సోఁకి
శించి; దాసులకున్=(ఆ పుష్పములతో పూజగావించిన) భక్తులకు;
ములు+ఔ=శ్రేష్ఠములైనట్టి; ధనధాన్యరాసులు+ఐ=ధనము యొక
ధాన్యము యొక్కయు రాసులుగానయ్యును; కరి=ఏనుగుల యొక
భట=సైనికుల యొక్కయు; ఘోటక+అంబర=గుఱ్ఱముల యొక
వస్త్రముల యొక్కయు; నికాయములు+ఐ=సమూహములుగాన
విరజానదీ=విరజ అను పేరుగల వైకుంఠమునందుండెడి నదిని; 
రణము+ఒనర్చున్=దాటించును; చిత్రము+ఇది=ఇది మిక్కిలి
మైన విషయముగదా! దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ భవసముద్రతారకా! నరకసంహారకా! సామాన్యముగా
చెట్లున పూచిన పుష్పముల నట్లేయుంచిన కాయలగునుగదా! అట్లు
పుష్పములనేకోసి భక్తితో మీ పాదకమలములందు పూజించిన నా
ములే ఈ లోకమున ధన ధాన్యరాసులై ఐశ్వర్యవంతులను జేయు
ఇక నీ ఇహలోక యాత్ర ముగిసిన తరువాత ఆ పుష్పములే గజ
సైనికులై, అశ్వములై వస్త్రముల సముదాయములై వైకుంఠమున

విరజానదిని దాటించి పై కుంభమును జేర్చి మోక్షము నొసంగును. శ్రీరామా మంచితావిని వెదజల్లు పుష్పములతో నీ పాదపూజ గావించెదను? ఇహపర సౌఖ్యముల నొసంగి కాపాడుము.

**102) పట్టితి భట్టరార్య గురుపాదములిమ్మెయినూర్ధ్వ పుండ్రముల్**
**పెట్టితి, మంత్రరాజ మొడిఁబెట్టితి, నయ్యమ కింక రాళికిన్**
**గట్టితి బొమ్మ, మీ చరణ కంజములందుఁ దలంపు పెట్టి పోఁ**
**దట్టితిఁబాప పుంజముల దాశరథీ! కరుణాపయోనిధీ!!**

**ప్రతిపదార్థము :-**

భట్టరార్య గురుపాదములన్ = గురువులైన భట్టరాచార్యులవారి పాదములను; పట్టితిన్ = గ్రహించితిని; ఈ మెయిన్ = ఈ భౌతిక కాయ మందు; ఊర్ధ్వ పుండ్రముల్ = తిరుచూర్ణముతో కలిసిన తిలకమును; పెట్టితిన్ = నుదుట నలంకరించుకొంటిని; మంత్ర రాజమున్ = మంత్ర శ్రేష్ఠమైన తారకనామ మంత్రమును; ఒడిన్ + పెట్టితిన్ = ఒడియందు నిక్షేపించి యుంచితిని. ఆ + యమకింకర + ఆళికిన్ = ఆ కాలకింకరుల సమూహమునకు; బొమ్మ గట్టితిన్ = అవమాన చిహ్నమును బంధించితిని; మీ చరణ కంజములందున్ = మీ పాద పద్మములయందు; తలంపు పెట్టి = మనస్సు నిల్పి; పాప పుంజములన్ = పాప సముదాయమును; పోన్ + తట్టితిన్ = పోగొట్టుకొంటిని; దాశరథీ! కరుణాపయోనిధీ!!

**భావము :-**

ఓ గోపాలకా! సుందర కుటిలాలకా! నేను గురుమూర్తులైన భట్టరాచార్యుల వారి పాదములాశ్రయించి తిరు మంత్రమును ఉపదేశమునంది తిరుమణిని నొసట ధరించి యమ భటులను దరిజేరకుండ పారద్రోల శక్తి

ముగా నుండునట్లు చేసికొన ప్రయత్నించుచుంటిని. నీ నామ స్మరణము సర్వదా గావించెదను. నాయందు దయ జూపుము.

103) అల్లన లింగమంత్రి సుతుఁడ త్రిజ గోత్రజుఁడాదిశాఖి, కం
చెర్ల కులోద్భవుండనఁ బ్రసిద్ధుఁడనై భవదంకి
తంబుగా
నెల్లకవుల్ నుతింప రచియించిన గోపకవీంద్రుఁడన్
జగ
ద్వల్లభ; నీకు దాసుఁడను దాశరథీ కరుణాపయోనిధీ!!

ప్రతిపదార్థము :-

అల్లన=యోగ్యుడైన; లింగమంత్రి సుతుఁడు=లింగన మంత్రి యొక్క కుమారుడు; అత్రిజగోత్రుఁడు=ఆత్రేయస గోత్రమున జన్మించిన వాడు; ఆదిశాఖి=ప్రథమ శాఖకు చెందినవాడు; కంచెర్ల కుల+ఉద్భవుండు +అనన్=కంచెర్ల వంశమున పుట్టినవాడనగా; ప్రసిద్ధుడనై=పేరు ప్రఖ్యాతులు పొందినవాడనై; భవత్+అంకితంబుగాన్=మీకు కృతినిచ్చు తలంపుతో; ఎల్లకవుల్+నుతింపన్=కవి లోకమంతయు బాగున్నదని పొగడగా; రచియించిన=రచన గావించినట్టి; గోప కవీంద్రుఁడన్= గోపన్న అను పేరుగల వాడను; జగత్ వల్లభ=జగన్నాథా! నీకున్= నీకు; దాసుఁడను=సేవకుడను; దాశరథీ! కరుణాపయోనిధీ!!

భావము :-

ఓ భక్త జనార్తి హరణ విశారదా! ఆంజనేయ వరదా! బ్రాహ్మణులలో ప్రథమ శాఖయందు ఆత్రేయసగోత్రమున లింగన మంత్రికి పుత్రుడనై, గోప కవినామముతో ప్రఖ్యాతి నందిన నేను కవులెల్లరు మెచ్చుకొనునట్లుగా నీ చరణ కమలముల కంకితంబుగా ఈ శతకంబు భక్తితో రచించి సమర్పించితిని. నేను నీకు సదా సేవచేయు దాసుడను. నన్ను కరుణించి భవబంధ విచ్ఛేదము గావించి తరణోపాయముపదేశింపుము. నిన్ను సదా వేడుకొందును.

శ్రీరస్తు

# శ్రీ రామాష్టోత్తర శత నామావళి

ఓం శ్రీరామాయనమః
రామభద్రాయ
రామచంద్రాయ
శాశ్వతాయ
రాజీవలోచనాయ
శ్రీమతే
రాజేంద్రాయ
రఘుపుంగవాయ
జానకీవల్లభాయ
జైత్రాయ 10
జితామిత్రాయ
జనార్దనాయ
విశ్వామిత్ర ప్రియాయ
దాంతాయ
శరణత్రాణ తత్పరాయ
వాలిప్రమథనాయ
వాగ్మినే
సత్యవాచే
సత్యవిక్రమాయ
సత్యవ్రతాయ 20
వ్రతధరాయ
సదాహనుమదాశ్రితాయ
కౌసలేయాయ
ఖరధ్వంసినే
విరాధవధపండితాయ
విభీషణ పరిత్రాత్రే
హరకోదండ ఖండనాయ

ఓం సప్తతాల ప్రభేత్రేనమః
దశగ్రీవ శిరోహరాయ
జామదగ్న్య మహాదర్పదళనాయ
తాటకాంతకాయ
వేదాంతసారాయ
వేదాత్మనే
భవరోగస్య భేషజాయ
దూషణత్రిశిరోహంత్రే
త్రిమూర్తయే
త్రిగుణాత్మకాయ
త్రివిక్రమాయ
త్రిలోకాత్మనే
పుణ్యచారిత్ర కీర్తనాయ 40
త్రిలోక రక్షకాయ
ధన్వినే
దండకారణ్య కర్తనాయ
అహల్యా శాపశమనాయ
పితృభక్తాయ
వరప్రదాయ
జితేంద్రియాయ
జితక్రోధాయ
జితామిత్రాయ
జగద్గురవే 50
ఋక్షవానరసంఘాతినే
చిత్రకూట సమాశ్రయాయ
జయంతత్రాణ వరదాయ
సుమిత్రాపుత్ర సేవితాయ

ఓం సర్వదేవాదిదేవాయనమః
మృతవానర జీవనాయ
మాయామారీచహంత్రే
మహాదేవాయ
మహాభుజాయ
సర్వదేవస్తుతాయ 60
సౌమ్యాయ
బ్రహ్మణ్యాయ
మునిసంస్తుతాయ
మహాయోగినే
మహోదారాయ
సుగ్రీవేప్సితరాజ్యదాయ
సర్వపుణ్యాధిక ఫలాయ
స్మృతసర్వాఘనాశనాయ
ఆదిపురుషాయ
పరమపురుషాయ 70
మహాపురుషాయ
పుణ్యోదయాయ
దయాసారాయ
పురాణ పురుషోత్తమాయ
స్మిత వక్త్రాయ
మితభాషిణే
పూర్వభాషిణే
రాఘవాయ
అనంతగుణగంభీరాయ
ధీరోదాత్త గుణోత్తమాయ 80
మాయామానుషచారిత్రాయ

ఓం మహాదేవాది పూజితాయనమః
సేతుకృతే
జితవారాశయే
సర్వతీర్థమయాయ
హరయే
శ్యామాంగాయ
సుందరాయ
శూరాయ
పీతవాససే 90
ధనుర్ధరాయ
సర్వయజ్ఞాధిపాయ
యజ్వనే
జరామరణ వర్జితాయ
శివలింగ ప్రతిష్ఠాత్రే
సర్వావగుణవర్జితాయ
పరమాత్మనే
పరస్మైబ్రహ్మణే
సచ్చిదానంద విగ్రహాయ
పరంజ్యోతిషే 100
పరంధామ్నే
పరాకాశాయ
పరాత్పరాయ
పరేశాయ
పారగాయ
పారాయ
సర్వదేవాత్మకాయ
ఓం పరస్మైనమః 108

# శ్రీ సీతాష్టోత్తరశతనామావళిః

ఓం శాంతాయైనమః
మహేశ్వర్యై
నిత్యాయై
శాశ్వత్యై
పరమాక్షరాయై
అచింత్యాయై
కేవలాయై
అనంతాయై
శివాత్మనే
పరమాత్మికాయై 10
జానక్యై
మిథిలానందాయై
రాక్షసాంతవిధాయిన్యై
రావణాంతకర్త్యై
రమ్యాయై
రామవక్షస్థలస్థాయై
ప్రాణేశ్వర్యై
ప్రాణరూపాయై
ప్రధానపురుషేశ్వర్యై
సర్వశక్త్యై 20
కలాయై
కాష్ఠాయై
జ్యోత్స్నాయై
ఇందుమహిమాస్పదాయై
పురాణ్యై
చిన్మయ్యై
ఫుంసమాఢ్యై

ఓం పురుషరూపిణ్యైనమః
భూతాంతరాత్మనే
కూటస్థాయై 30
మహాపురుషసంజ్ఞితాయై
స్వకార్యాయై
కార్యజనన్యై
బ్రహ్మాశాయై
బ్రహ్మసంశ్రయాయై
వ్యక్తాయై
ప్రథమజాయై
బ్రహ్మె
మహాత్ర్యై
జ్ఞానరూపిణ్యై 40
మహేశ్వర్యై
సముత్పన్నాయై
భుక్తిముక్తిఫలప్రదాయై
సర్వేశ్వర్యై
సర్వవర్ణాయై
నిత్యాయై
ముదితమానసాయై
వాసవ్యై
వరదాయై
వాచ్యాయై 50
కర్త్ర్యై
సర్వార్థసాధికాయై
వాగీశ్వర్యై
సర్వవిద్యాయై

ఓం మహావిద్యాయైనమః
సుశోభనాయై
శోభాయై
వంశకర్త్ర్యై
లీలాయై
మానిన్యై 60
పరమేష్టిన్యై
త్రిలోకసుందర్యై
కామచారిణ్యై
విరూపాయై
సురూపాయై
భీమాయై
మోక్షప్రదాయిన్యై
భక్తార్తినాశిన్యై
భవ్యాయై
భవభావవినాసిన్యై 70
వికృత్యై
శంకర్యై
శాంత్యై
గంధర్వయక్షసేవితాయై
వైశ్వానర్యై
మహాశీలాయై
దేవసేనాయై
గృహప్రియాయై
హిరణ్మయ్యై
మహారాత్ర్యై 80
సంసారపరివర్తికాయై

ఓం సుమాలిన్యైనమః
సురూపాయై
తారిణ్యై
భావిన్యై
ప్రభాయై
జగత్ప్రియాయై
జగన్మాత్రై
అమృతాశ్రయాయై
నిరాశ్రయాయై 90
నిరాహారాయై
నిరంకుశాయై
రణోద్భవాయై
శ్రీఫల్యై
శ్రీమత్యై
శ్రీశాయై
శ్రీనివాసాయై
హరిప్రియాయై
శ్రీకర్యై
కామప్రియాయై 100
శ్రీధరాయై
ఈశవరిణ్యై
శ్రీవేదవత్యై
శ్రీ హనుమదాశ్రితాయై
మహాలక్ష్మ్యై
సరసామృతధాత్ర్యై
శ్రీ పట్టాభిరామప్రియాయై
ఓం శ్రీ సీతాదేవ్యై నమః 108

# శ్రీ మదాంజనేయాష్టోత్తరశతనామావళిః

ఓం శ్రీఆంజనేయాయ నమః
మహావీరాయ
హనుమతే
మారుతాత్మజాయ
తత్త్వజ్ఞానప్రదాయ
సీతాదేవీముద్రాప్రదాయకాయ
అశోకవనికాచ్ఛేత్రే
సర్వమాయావిభంజనాయ
సర్వబంధవిమోక్త్రే
రక్షోవిధ్వంసకారకాయ 10
పరవిద్యాపరీహారాయ
పరశౌర్యవినాశనాయ
పరమంత్రనిరాకర్త్రే
పరయంత్రప్రభేదకాయ
సర్వగ్రహవినాశినే
భీమసేనసహాయకృతే
సర్వదుఃఖహరాయ
సర్వలోకచారిణే
మనోజవాయ
పారిజాతద్రుమూలస్థాయ 20
సర్వమంత్రస్వరూపవతే
సర్వతంత్రస్వరూపిణే
సర్వయంత్రాత్మకాయ
కపీశ్వరాయ
మహాకాయాయ
సర్వరోగహరాయ
ప్రభవే

ఓం బలసిద్ధికరాయ నమః
సర్వవిద్యాసంపత్ప్రదాయకాయ
కపిసేనా నాయకాయ 30
భవిష్యచ్చతురాననాయ
కుమారబ్రహ్మచారిణే
రత్నకుండలదీప్తిమతే
సంచలద్వాలసన్నద్ధలంబమా
నశిఖోజ్జ్వలాయ
గంధర్వవిద్యాతత్త్వజ్ఞాయ
మహాబలపరాక్రమాయ
కారాగృహవిమోక్త్రే
శృంఖలాబంధమోచకాయ
సాగరోత్తారకాయ
ప్రాజ్ఞాయ 40
రామదూతాయ
ప్రతాపవతే
వానరాయ
కేసరిసుతాయ
సీతాశోకనివారణాయ
అంజనాగర్భసంభూతాయ
బాలార్కసదృశాననాయ
విభీషణప్రియకరాయ
దశగ్రీవకులాంతకాయ
లక్ష్మణప్రాణదాత్రే 50
వజ్రకాయాయ
మహాద్యుతయే
చిరంజీవినే





ఓం రామభక్తాయనమః
దైత్యకార్యవిఘాతకాయ
అక్షహంత్రే
కాంచనాభాయ
పంచవక్త్రాయ
మహాతపసే
లంఖిణీభంజనాయ 60
శ్రీమతే
సింహికాప్రాణభంజనాయ
గంధమాదనశైలస్థాయ
లంకాపురవిదాహకాయ
సుగ్రీవసచివాయ
ధీరాయ
శూరాయ
దైత్యకులాంతకాయ
సురార్చితాయ
మహాతేజసే 70
రామచూడామణిప్రదాయ
కామరూపిణే
పింగాక్షాయ
వార్ధిమైనాకపూజితాయ
కబళీకృతమార్తాండమండలాయ
విజితేంద్రియాయ
రామసుగ్రీవసంధాత్రే
మహారావణమర్దనాయ
స్ఫటికాభాయ
వాగధీశాయ 80

ఓం నవవ్యాకృతిపండితాయన
చతుర్బాహవే
దీనబంధవే
మహాత్మనే
భక్తవత్సలాయ
సంజీవనగాహర్త్రే
శుచయే
వాగ్మినే
దృఢవ్రతాయ
కాలనేమిప్రమథనాయ
హరిమర్కటమర్కటా
దాంతాయ
శాంతాయ
ప్రసన్నాత్మనే
శతకంఠమదాపహృతే
యోగినే
రామకథాలోలాయ
సీతాన్వేషణపండితాయ
వజ్రదంష్ట్రాయ
వజ్రనఖాయ
రుద్రవీర్యసముద్భవాయ
ఇంద్రజిత్ప్రహితామోఘ
బ్రహ్మాస్త్రవినివారకాయ
పార్థధ్వజాగ్రసంవాసినే
శరపంజరభేదకాయ
దశబాహవే
లోకపూజ్యాయ
జాంబవత్ప్రీతివర్ధనాయ